సాధన గ్రంథ మండలి 21, 22, 23, 24 పుష్పములు

# భారతీయ తత్త్వశాస్త్రము

(షడ్దర్శనములు : వేదాంతసూత్రభాష్య సంప్రదాయములు)

## ప్రథమ భాగము

రచయిత:

శ్రీ నిర్వికల్పానంద స్వామి

(భారతినుండి పునర్ముద్రితము.)

౧౯౪౯

ప్రకాశకులు:

సాధన గ్రంథ మండలి, తెనాలి.

సంస్కార మెంత తక్కువగ నున్నది తెల్పుటకు స్థాలీపులాకన్యాయ ముగ ఈవిషయములు చాలు ననుకొందును.

ఈకారణ మొకటి. రెండవ కారణము : సంస్కృతభాషా చర్చయే మనదేశమున చాల తక్కువ. సంస్కృతమునందలి ఏముఖ్య గ్రంథమునైనను సరే, వదలిపెట్టకుండ ఆంగ్లేయులును, అమెరికను లును ఆంగ్లములోని కనువదించుకొనిరి. తెలుగులోనికి ఎన్ని గ్రంథ ములు వచ్చినవి ? వేళ్ళమీాద లెక్కించి చెప్పవచ్చును. ప్రాంతీయ భాషలలో ఒక్కొక్క గ్రంథమునకు నాలైదు అనువాదములు కూడ లభించుచున్నవి !!

ఈ రెండు కారణములవలనను, ఆంధ్రమున దర్శనశాస్త్ర వాఙ్మయము వ్యర్థ మగుచున్నది.

ఇంతకంటెను చిత్రమైన విషయ మేమన : కవిబ్రహ్మయగు తిక్కనగారు, దర్శనశాస్త్రదృష్ట్యా మహాభారతమున కంతటికిని శిరో భూషణమగు భగవద్గీత, తెలిగించుట విడచివైచి పరవిద్యయెడల మనకుగల పరమవిరక్తిని స్వభావోక్తిపూర్వకముగ నిరూపించిరి ! ఇదేరీతిగ, పోతనగారు ఉద్ధవగీతను కేవలము మూచూచి విడచివైచిరి!!

అయితే: త్యాగయ్య, వేమన, పోతన, రామదాసులు మనలో పుట్టలేదా ? మనది అంత నిర్జీవమైన జాతి కాదు. అని కొందర నవచ్చును. నిజమే! భారతదేశమునందలి ఇతర రాష్ట్రములలో జన్మించి సాధనసిద్ధులైన భక్తులసంఖ్యతో పోల్చి చూచినయెడల "కేవలము వారిపేర్లను చెప్పుకొని ఒకింత మన గౌరవమును కాపాడుకొనుటకే, వీరు ఆంధ్రులైనారేమో ? " అనవలసియుండును. అంతేగాక, వారు మనకు ప్రసాదించిన వాఙ్మయము ఉపయుక్త వాఙ్మయముతో తులిత మొనర్చిన, ఎన్నోవ వంతు ఉండును ? ప్రాచుర్యగౌరవమే కాక, ఈవాఙ్మయప్రభావము మనమీాద ఎంతగ పనిచేసినది, చేయుచున్నది అను సందర్భమును గూడ పరిశీలింపవలెను. వల్లభ, నింబార్కులు జన్మతః, ఆంధ్రులే యైనను వారిప్రచారము ఉత్తరదేశమున జరిగినది. భవతు.

ఇంతకును ఆయాకారణములవలన మనకు చెప్పుకో తగినంత దర్శనశాస్త్రవాఙ్మయము గాని, మతసంబంధము లగు రచనలు గాని లేవని ఫలితము.

( ౨ )

ఈ ఉభయశాస్త్రముల సారాంశము నీ క్రిందివిధముగ చెప్ప వచ్చును.

(౧) పరతత్త్వ మొకటి యున్నది — దాని నేపేరుతోనైనను పేర్కొనుము.

(౨) అది జగదంతర్గతమును, జగదతీతమును కూడ.

(౩) ఈపరతత్త్వమును బొందుటయే పరమావధి.

(౪) ఈపొందుటకు సునిర్దిష్ట మార్గ మొకటి యున్నది.

దర్శనశాస్త్రము ఈమార్గమును చూపించుటకే అవతరించినది. చూచుట అను అర్థముగల 'దృశ్' ధాతువునుండి దర్శనశబ్దోత్పత్తి. ఈశాస్త్రము పరతత్త్వమును చూపించున దని భావము.

వేదములు శ్రుతు లనియు, తక్కినవాఙ్మయ మంతయు స్మృతి యనియు, దార్శనికపరిభాష. వేదములలోని చరమభాగములగు ఉపనిషత్తులు అత్యంతముఖ్యములు. ఈఉపనిషత్తుల నాధారపరచుకొనియే భారతీయదర్శనములు వెలువడినవి. ఈశ్వరుడు, (లేక బ్రహ్మము) జీవుడు, జగత్తు — ఈమూడింటికి గల సంబంధము విశేషముగ తరచి చెప్పునదియే దర్శనశాస్త్రము.

ఈ జగత్తు యేమిటి? ఈ జగదంతఃపాతి యగు ఈ నే నెవరు? భగవంతుని ఉనికి ఎక్కడ? — అను ప్రశ్నలు ఉద్భవింపని మనుష్యమాత్రు డుండడు. ఈప్రశ్నలకు ఎవరంతట వారు ప్రత్యుత్తరము చెప్పుకొనునంతవరకు మనశ్శాంతి లభింపదు. కనుక, స్వానుభూతియే పరమనిర్దేశకము. కాని. ఈ అనుభూతి, శ్రుతివిరుద్ధమై, తర్కవిరోధముగ నుండకూడ దని మన ప్రాచీనుల నిర్ధారణ. కనుక, అనుభూతిని శ్రుతిప్రమాణముతో మేళవించి న్యాయసమ్మతమగు భాషలో ప్రతిష్ఠించుటకే ఈశాస్త్రము ముఖ్యముగ ప్రయత్నించును.

ఇంతటి గొప్ప శాస్త్ర మగుటవలననే మ్యాక్సుముల్లరు, థిబో, పాల్ డయిసన్, మానియర్ విలియమ్సు, విలియమ్ జోన్సు, జేమ్సు విలియమ్. షోపెన్‌హార్, ఎమర్సన్, ఎటమణ్ మున్నగు పాశ్చాత్యు లెందరో ఉపనిషత్ (తత్త్వ) శాస్త్ర - వాఙ్మయమును మథించి ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మను భాషలలో ఎన్నెన్నో ఉద్గ్రంథము లను వ్రాసియున్నారు. ఇది గతకాలపు మాట.

ఇప్పుడు మాత్రము ఆల్డస్ హక్స్లే, సోమర్ సేట్ మాగమ్, ఇషర్‌వుడ్, రోమారోలా మున్నగు ప్రసిద్ధ రచయిత లెందరో, ఈ శాస్త్రమును ప్రశంసించి గ్రంథరచన చేయుటయే గాక; మన ప్రాచీన ఋషుల సాక్షాత్కారములను అనుసరించుచున్నారు. బహుశః చాల కాలమునకే ఈ సంగతి తెలియగా అనుకొనెదను.

(౨)

ప్రస్తుతము ఉపనిషత్తులను సంగ్రహముగ వ్యాఖ్యానముల గురించియు, వీటిలో ముఖ్యములగు వేదాంతదర్శనములందలి-సంప్రదాయభేదములగు శ్రీశంకర, రామానుజ, మధ్వ, వల్లభ, నింబార్క, చైతన్య, భాస్కర, విజ్ఞాన-భిక్షు, శ్రీకంఠశివాచార్యుల మతవాదములను తెలుపుచున్నాను. సూత్రగ్రంథములకు, భాష్యగ్రంథములకు ముఖ్యప్రమాణములు.

సంస్కృత భాషను లేనివారికి ఈ గ్రంథము దిక్ప్రదర్శినిగ నుండ గలదనియును. సంస్కృతమున భాష్యగ్రంథముల నన్నిటిని పఠించిన వారికి మననార్హముగ నుండగలదనియు తలచుచున్నాను. వేదాంత-సూత్ర-భాష్యముల సారమును తెలియగోరు వారికి ఇది ఉపయోగకారి.

ఇందు ప్రకటింపబడిన ప్రకరణము లన్నియును 1936-44 సంవత్సరముల మధ్య అప్పుడప్పుడు భారతిలో వెలువడినవే. మరల 1943 సంవత్సరారంభమున వీని నన్నిటిని ఏలూరు దివ్యజ్ఞానసమాజ సభ్యులకు ఉపన్యాసరూపమున చెప్పియుంటిని. వీటిని పలువురు పుస్తక రూపమున అందజేయుమని కోరుచుండుటవలన ఈ ప్రచురణ వెలువడు చున్నది. దీనికి సమ్మతించిన శ్రీ శంభుప్రసాదుగారికి ధన్యవాదములు.

జ్ఞానాన్వేషణతత్పరులగు శ్రీ కలగర నాగభూషణచౌదరి బి. ఎ., బి. యల్., శ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రి, విద్యార్థిగార్ల పరిశ్రమవలననే ఈగ్రంథము వెలుగు చూచుచున్నది. పరమేశ్వరుడు వారికి జ్ఞాన భక్తి వైరాగ్యములను ప్రసాదించును గాక - అని నా ప్రార్థన.

ఈగ్రంథమును కూర్చుటలో నాకు పెక్కు సంస్కృతాంధ్రాంగ్ల వంగ గ్రంథములు తోడ్పడినవి. ఆ గ్రంథకర్తలకు కృతజ్ఞుడను. మాకు ఆరేండ్లు చక్కగ వేదాంతశాస్త్రమును బోధించిన పండితులు న్యాయవేదాంతతీర్థులు శ్రీ దినేశచంద్ర భట్టాచార్యుల వారికి నమోవాకములు. దర్శనశాస్త్ర-విషయసూచిక యనదగు ఈరచన నాధారముగ జేసుకొని ఎవరైనను ఇంతకంటె విపులమైన పుస్తకమును రచించినను, మరియు నేనొక్కరికైనను ఈగ్రంథము జ్ఞానాసక్తిని కలిగింపగలిగినను - నాపరిశ్రమ సార్థకమని తలంతును.

ఇంకొకమాట చెప్పి ముగింతును. ఈగ్రంథమున వివరించిన శంకర సంప్రదాయమును, అద్వైతదర్శనముగను, రామానుజ, మధ్వ, వల్లభ, నింబార్క, చైతన్య సంప్రదాయములను వైష్ణవదర్శనములుగను, శ్రీకంఠశివాచార్యమతమును శైవదర్శనముగను పేర్కొనవచ్చును. ఇవన్నియును ఔపనిషద - దర్శనములు. ఇక ద్వితీయభాగమున చార్వాక, అర్హత, బౌద్ధ, పాశుప, నకులీశ, ప్రత్యభిజ్ఞ, రసేశ్వర దర్శనములను గురించియు, పురాణ, తంత్ర, ధర్మశాస్త్రమతములను గూర్చియు వివరింతును.

శ్రీ రామకృష్ణ మఠము,
భువనేశ్వర్,
పూరీ జిల్లా-ఒరిస్సా
1—1—1919.

ఇట్లు,
శ్రీ నిర్వికల్పానందస్వామి.

# కృతజ్ఞత

గుణగ్రహణపారీణులైన రసికవరుల ఆదరాభిమానములతో సాధనగ్రంథమండలి, అనతికాలమందే సర్వతోముఖ ప్రశస్తి బడసి, శ్రీ నిర్వికల్పానందస్వామివారి భారతీయతత్త్వశాస్త్ర పరామర్శతో ద్వితీయవార్షిక మహోత్సవమును నెఱపుకొనుచున్నది.

వర్తమాన-ఆంధ్రవాఙ్మయమున దర్శనసాహిత్యము మృగ్యము. కనుక, ఇతస్తతముగ భారతి పత్రిక సంచికలలో పడియుండిన ఈరచనలను ఒకచో గూర్చి పుస్తకరూపమున వెలువరచుట అవసరమని తలచి ఈపనికి పూనుకొంటిమి. తత్త్వశాస్త్రాభిరతి గల ముముక్షువులకు ఈగ్రంథము ప్రీతిని గల్పించిన, మాశ్రమ సార్థకమని తలతుము.

ఈ వ్యాసములద్వారానే గాక శ్రీవ్యాసాశ్రమమువారు ప్రకటించిన "యోగవాసిష్ఠానువాదము"వలనను, చెన్నపురి రామకృష్ణమఠమువారు ప్రకటించిన "భగవద్గీత" వలనను గ్రంథకర్తగారిపేరు పలువురకు తెలిసియే యున్నది.

పదునేడేండ్ల వయస్సులో తురీయాశ్రమ స్వీకారార్థము వీరు 1933 వ సంవత్సరమున శ్రీభువనేశ్వరము రామకృష్ణమఠమున చేరిపోయిరి. 1939 వరకు వీరు ఓఢ్రరాష్ట్రమునను, 39 నుండి 42 వరకు వంగరాష్ట్రమునను యుండిరి. 42 నుండి 46 వరకు వీరు చెన్నపురి శ్రీరామకృష్ణమఠములో నుండిన కాలమున శ్రీమద్భగవద్గీతవ్యాఖ్యను రచించి, 44 లో "శ్రీరామకృష్ణప్రభ" యను పత్రికను ఆమఠముతరపున స్థాపించి 46 సెప్టెంబరువరకు సంపాదకునుగ నుండిరి. 46 నుండి 48 మధ్యభాగమువరకు విశాఖపురిలో నుండిరి. ఆరునెలలు పూరీ జగన్నాథములో విశ్రాంతిని గొని, ప్రస్తుతము మరల భువనేశ్వరములో నివసించుచున్నారు.

సంస్కృతమున నున్న తత్త్వజ్ఞానమును తెలుగునకు గొని రావలెనని వీరి సంకల్పము. పరాత్పరు డనుగ్రహించును గాక !

శ్రీ నిర్వికల్పానంద స్వామివారు, మా చిన్ని గ్రంథమండలి కొసనగి ఆశీర్వాదమునకు గ్రంథమండలి యెంతయు కృతజ్ఞత తెలుపు కొనుచున్నది.

ఉదారులగు రసిక కవి పండిత విద్వద్వరుల సహాయమున సాధన గ్రంథమండలి, తన సర్వశక్తులు వినియోగించి ఐహికాముష్మిక సుఖ సంపాదకము లగు ఉత్తమ పుష్పపరంపరలను, తెలుగుకోటలో పరిమళింప జేయ గలుగునట్లు లోక మాశీర్వదించు నని మా విశ్వాసము.

భారతీయ తత్త్వశాస్త్ర గ్రంథ ప్రకటనకు అన్నివిధముల తగు ప్రోత్సాహ సహాయ సంపత్తు లొసగిన, శ్రీ ఈదర వేంకటరావు పంతులుగారికి, శ్రీ కలగర నాగభూషణచౌదరి, బి. ఎ. బి. యల్. గారికి ఎంతయు కృతజ్ఞులము. భారతీపత్రికా నిర్వాహకులకు గూడ మాధన్యవాదములు.

సర్వధారి, పుష్య
హేమంతము,
తెనాలి.

సంపాదకులు,
సాధన గ్రంథమండలి.

# అంకితము

*

శ్రీరామకృష్ణపరమహంసుల వారి శిష్యులలో నొకరును, శ్రీరామకృష్ణ
మఠ-సేవాసంఘములకు ప్రధానాధ్యక్షులును, నగు

శ్రీ బ్రహ్మానంద స్వామి జీ

మహారాజావారి
కరకమలమున నీగ్రంథమును
ఉంచుచున్నాను.

గ్రంథకర్త.

# విషయానుక్రమణిక

# న్యాయ వైశేషిక దర్శనములు

౧

కేవలము బుద్ధినే ఆధారముగా గైకొని న్యాయవైశేషిక దర్శనములు నిర్మింపబడినవి. న్యాయవైశేషికదర్శన సూత్రముల బరిశీలించిచూచినచో నివి ఒండొంటిని ఒప్పుకొనియే తమతమసూత్రముల నిర్వచించినట్లు తెలియవచ్చును. ఈశ్వరుడు, పరమాణువులు, అనేకజీవవాదము ఇత్యాదులగు పలువిషయముల నివి పరస్పర మేకీభవించి సిద్ధాంతముల నొనర్చుచున్నవి. న్యాయదర్శనము యొక్క గొప్పతనము పంచావయవన్యాయమున. దీనినే ఆంగ్లమున 'సిలోగిజం' అని వ్యవహరింతురు. వైశేషికుల విశేషసిద్ధాంతము పరమాణువాదము. ఒకపదార్థమును సూక్ష్మ, సూక్ష్మతర, సూక్ష్మతమములుగా విభజించుచుపోగా తుదకు మనకు లభించునది పరమాణువు. ఇయ్యది కార్యరూపమున లేక వస్తురూపమున అనిత్యము; దీనిని సాంఖ్యుల తన్మాత్రతో బోల్చవచ్చును. మూలరూపమున నిత్యము. వాస్తవమునకు న్యాయవైశేషిక దర్శనముల సమాప్తియే దర్శనశాస్త్రమునకు మొదలు. అందువలననే విద్యారణ్యముని స్వవిరచిత తైత్తిరీయోపనిషద్దీపికయం దిట్లు పల్కియున్నారు:

'మూలకారణాత్ పరబ్రహ్మణ ఉత్పన్నా
ఆకాశకాలదిశః పరమాణవశ్చ యదావ్యవస్థితాః,
తదాతత ఆరభ్య ఉత్తరకాలీనా
సృష్టిర్గోతమాద్యుక్తప్రకారేణవ్యవతిష్ఠతామ్.'

మూలకారణమగు పరబ్రహ్మమునుండి కలిగిన ఆకాశ, కాల, దిక్, పరమాణువులు స్థాపింపబడిన పిమ్మట, తదనంతర సృష్టి గోతమాదులచే ప్రదర్శింపబడిన పద్ధతిని స్థాపింపవచ్చును.

న్యాయదర్శనమునకు మూలకందము గౌతమ విరచితమగు న్యాయసూత్రములు. ఇది ఐదు అధ్యాయముల గ్రంథము. ప్రత్యేకా ధ్యాయము రెండు ఆహ్నికములుగ విభజింపబడినది. ఇచ్చట ఆహ్నిక శబ్దమునాధారముగా జేసుకొని పదిరోజులలో గౌతము డిద్దానిని వ్రాసె నందురు. మొత్తముమీద ఇందు ఐదువందల ముప్పది యెనిమిది సూత్రము లున్నవి. వాత్స్యాయనుడనునాయన ఈ సూత్రముల కొక భాష్యమును విరచించెను. ఈ భాష్యమునకు ఉద్యోతకారు డొక వార్తికమును, వాచస్పతిమిశ్రుడు తాత్పర్య టీకను, ఉదయనా చార్యుడు తాత్పర్యవిశుద్ధిని రచించిరి. ఇవియే ముఖ్యముగ పండిత జన ప్రశంసను బడసిన న్యాయగ్రంథ రాజములు.

న్యాయదర్శనానుసారము ప్రపంచము దుఃఖమయము. ఉన్న కొద్దిసుఖము దుఃఖముతో గూడుకొని యున్నది. అందువలన దీనిని దుఃఖమనియే చెప్పనగును. జన్మించినచో దుఃఖము తోడునీడయే. అందువలన దుఃఖమును రూపుమాపగోరినచో జన్మమునుగూడ నిగ్ర హింపవలెను. జన్మయొక్క కారణము ప్రవృత్తి. ప్రవృత్తికి లోనై మనుష్యుడు కర్మ నాచరించును. తత్ఫలము జన్మ. ప్రవృత్తికారణ మేమి ? దోషము. ఇయ్యది రాగద్వేష మోహాత్మకము. ఈ దోషము మిథ్యాజ్ఞాన ప్రసూతము కాన మిథ్యాజ్ఞానమును ఛేదింపనిచో దుఃఖ నివృత్తి లేదు.

'దుఃఖ, జన్మ, ప్రవృత్తి, దోష, మిథ్యాజ్ఞానానాం
ఉత్తరోత్తరాపాయే తదంతరాపాయాదపవర్గః.'

— న్యాయసూత్రములు ౧-౧-౨

'యదా తు తత్వజ్ఞానాత్ మిథ్యాజ్ఞానం అపైతి, తదా మిథ్యాజ్ఞానాపాయే
దోషా అపయన్తి, దోషాపాయే ప్రవృత్తిరపైతి,
ప్రవృత్త్యపాయే జన్మ అపైతి, జన్మాపాయే దుఃఖం అపైతి,
దుఃఖాపాయే చ ఆత్యన్తికోఽపవర్గో నిఃశ్రేయస మితి.'

— వాత్స్యాయనుడు.

తత్వజ్ఞానములభించినచో మిథ్యాజ్ఞాన, దోష, ప్రవృత్తి, జన్మ, దుఃఖములు తొలగిపోయి పరమ శ్రేయస్సు అగు మోక్షము లభించు

నని సూత్రకార, భాష్యకారులు వచించియున్నారు. అందువలన తేలున దేమన - తత్త్వజ్ఞాన మొక్కటియే మోక్షోపాయము. న్యాయ దర్శనము జీవున కీతత్త్వజ్ఞానమును సవిస్తరముగా తెల్పుటకే నిర్దేశింప బడినది. ఈ తత్త్వజ్ఞాన మేమిటి? ప్రమాణ, ప్రమేయ, సంశయ, ప్రయోజన, దృష్టాన్త, సిద్ధాంత, అవయవ, తర్క, నిర్ణయ, వాద, జల్ప, వితండ, హేత్వాభాస, ఛల, జాతి, నిగ్రహస్థానములను పదు నారు పదార్థముల తత్త్వజ్ఞానమే న్యాయదర్శన ముపదేశించునది.

ఈ షోడశపదార్థములగురించి ఒకించుక ఆలోచింతము.

ప్రమ, లేక జ్ఞానముయొక్క సాధనమే ప్రమాణము (Means of knowledge). ఇది ప్రత్యక్ష (Perception) అనుమాన (Inference), ఉపమాన (Analogy) శబ్దము (Scripture) అను నాలుగు విధములుగ విభజింపబడినది.

ఇంద్రియములు విషయముల సంసర్గములోనికి వచ్చినప్పుడు కలుగు నిశ్చయజ్ఞానమే ప్రత్యక్ష ప్రమాణము. దీనినుండి కలుగు జ్ఞానమే అనుమానము. ఇయ్యది మరల 'పూర్వవత్, శేషవత్, సామాన్యతోదృష్టమ్' అను మూడు తెగుల విభజింపబడినది. సాదృశ్యజ్ఞానమునుండి లభించునది ఉపమానము. నిశ్చితగతి నెఱిగిన వారినుండి గైకొను జ్ఞానము శబ్దము. ఇయ్యది దృష్టాదృష్టములను రెండువిధముల విభజింపఁబడినది.- దృష్టమనగా ఇహలోకమునకు సంబంధించినది. అదృష్టమనగా మనకు కనఁబడని పరలోకమునకుఁ జెందినది.

ప్రమేయ మనగా ప్రమాణముయొక్క విషయములు (Objects of Knowledge). ఇవి పదిరెండు. ఆత్మ, శరీరము, ఇంద్రియములు, అర్థములు, బుద్ధి, మనస్సు, ప్రవృత్తి, దోషము, ప్రేత్యభావము, ఫలము, దుఃఖము, అపవర్గములను నామముల వీటిని నైయాయికులు వ్యవహరింతురు.

ఇచ్ఛా, ద్వేష, ప్రయత్న, సుఖ, దుఃఖ, జ్ఞానములవలన ఆత్మయొక్క అస్తిత్వము అనుమానింపబడును. యత్నము, ఇంద్రియ

ములు, తద్విషయములు - వాటి కాధారభూతమైన భోగాయతనమే శరీరము. ఘ్రాణ, రసన, చక్షు, త్వక్, శ్రోత్రము లను పంచేంద్రియములు క్రమముగా పృథివి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశములను భూతములనుండి జన్మించినవి. గంధ, రస, రూప, స్పర్శ, శబ్దములనునవి వీటివిషయములు. విషయజ్ఞానము లభింపజేయునది మనస్సు. బుద్ధి, ఉపలబ్ధి, జ్ఞానములనునవి ఒక్కటియే. ప్రవృత్తి యనగా వాక్కు, బుద్ధి, శరీరముల ప్రయత్నము. దోషమన ప్రవృత్తిని గలుగజేయునది. ప్రేత్యభావమన పునర్జన్మ. ప్రవృత్తి, దోషములవలన కలుగునది ఫలము. దుఃఖమనగా పీడ. ఈ దుఃఖవిముక్తియే అపవర్గము. ఇవి నైయాయికులు చెప్పు ప్రమేయములు.

సంశయము (Doubt) అనగా అనిశ్చితజ్ఞానము.

ప్రయోజనము (Purpose) అన ఏవిషయమును లభింపజేసుకొనుటకై యత్నింతుమో అయ్యది.

దృష్టాంతము (Instance) అనగా పండితులకు, పామరులకు బోధగమ్యమగు వస్తువు.

సిద్ధాంతము అనగా విషయనిశ్చయము. ఇయ్యది సర్వతంత్రసిద్ధాంతము, ప్రతితంత్రసిద్ధాంతము, అధికరణసిద్ధాంతము, అభ్యుపగమసిద్ధాంతము అని నాల్గువిధములు.

అవయవములు, ప్రతిజ్ఞ, హేతువు, ఉదాహరణ ఉపనయ, నిగమనము లనునవి.

తర్కము (Reasoning) అనగా ప్రయోజనీయమగు వస్తుతత్వమును నిర్ణయించుటకై చేయబడు ఊహ.

నిర్ణయము (Conclusion) అనగా పరపక్షదూషణ, స్వపక్షసమర్థన మొనర్చి ఒనర్పబడు తత్వనిర్ణయము.

వాదము (Argumentation) అనగా తత్వ నిర్ణయమునకై శాస్త్రసిద్ధాంతముల ననుసరించి ఒనర్పబడు వివాదము,

జల్పము (Sophistry) అనగా ప్రతిపక్షి నెట్లో ఒకట్లు ఓడింప వలెనని చేయువాదము.

వితండము (Wrangling) స్వమతస్థాపన నొనర్ప యత్నింపక, పరపక్షము నోడింపజేయు జల్పము.

ఈ మూడింటిని అనగా, వాద, జల్ప, వితండముల కథయని న్యాయశాస్త్రజ్ఞులు వ్యవహరింతురు.

కుహేతువులన్నియు హేత్వాభాస (Fallacy) లను నామమున పేర్కొనబడును. ఇవి సవ్యభిచారము, విరుద్ధము, ప్రకరణసమము, సాధ్యసమము, కాలాతీతములను పంచవిధములు.

పరవాక్యమునవిపరీతార్థమునుకల్పించుటయే ఛలము (Quibble). ఇది సామాన్యచ్ఛలము, ఉపచారచ్ఛలము, వాక్ఛలము అను మూడు విధములు.

సాధర్మ్య వైధర్మ్యముల ననుసరించి ఆరోపింపబడు దోషము జాతి (False Analogy) అనబడును. ఇది ఇరువదినాలుగు విధములు.

నిగ్రహస్థానమున వాదియొక్క పొరపాట్లు, అజ్ఞానము వెల్లడియగును. ఇవి ఇరువదిరెండు తెఱంగులని న్యాయదర్శన శేషభాగమున వర్ణింపబడియున్నవి.

ఇట్లీ పదారు పదార్థములవర్ణనముతో న్యాయదర్శనము ముగింపునొనర్పినది. ఈ దర్శనమును న్యాయాంశము (Logic) తర్కాంశము (Dialectic) దర్శనాంశము (Metaphysic) అను మూడు విధముల విభజింపవచ్చును. న్యాయాంశమున పంచావయవన్యాయమును గుఱించిన విశేషాలోచన యున్నది. నవ్యన్యాయమున ప్రమాణవిచారమే యెక్కువగ నున్నది. కొందఱీశ్వరాస్తిత్వమును అనుమాన ప్రమాణమువలన స్థాపింప యత్నించిరి. 'క్షిత్యాదికం సకర్తృకం కార్యత్వాత్ ఘటవత్' అని న్యాయచర్చనొనర్పదొడగిరి. ఉదయనాచార్యు లిట్టిచర్చనే యొనర్చుచు 'కుసుమాంజలి' యను గ్రంథమును రచించిరి. ఇట్టి శాస్త్రచర్చయే వేదోక్తమననతుల్యమని

ఆచార్యులభిప్రాయపడిరి. 'న్యాయచర్చేయ మీమాంస్యా మననవ్యాప దేశభాక్' తర్కముచలన ఈశ్వరుని ప్రతిపాదింప గలుగుట గొప్ప విషయమే కాని వాత్స్యాయనుడీశ్వరుని తర్కవిషయ మొనర్చుట మంచిదికాదని అభిప్రాయపడినాడు.

తర్కాంశమున జల్ప, వితండ, ఛలాది విషయవిచారమున్నది. దర్శనాంశమున పంచభూతములు, గుణములు, పరమాణువులు విచారింపబడినవి. ఆత్మ, శరీరేంద్రియ మనోబుద్ధులనుండి స్వతంత్రమైన దనియు, భోక్త, జ్ఞాతయనియు, నిత్యవస్తువనియు యుక్తివలన స్థాపింపబడినది.

చతుర్థాధ్యాయ ప్రథమాహ్నికమున ఈశ్వర ప్రశంసయున్నది. ఈశ్వరుని కర్మఫలదాతగా అంగీకరించినారు.

ఈశ్వరః కారణం పురుషకర్మ సాఫల్య దర్శనాత్.

న్యా - సూ ౪-౧-౧౯.

ఇంతే. మఱి, న్యాయదర్శన నిర్దిష్టమగు ముక్తితో ఈశ్వరుని కేమియు సంబంధములేదు. పైన వర్ణింపబడిన షోడశపదార్థముల జ్ఞానము కలిగినచో ముక్తి అనివార్యము.

౨

న్యాయవైశేషికదర్శనము లొకే శ్రేణికి జెందినవని పైన చెప్పియుంటిమి. వైశేషికదర్శనసూత్రముల రచించినది మహర్షి కణాదుడు. ఈ సూత్రములు పది అధ్యాయముల గ్రంథము. ప్రతి అధ్యాయము రెండు ఆహ్నికములుగ విభజింపఁబడినది. మొత్తము సూత్రముల సంఖ్య మూడువందలడెబ్బది. ప్రశస్తపాదాచార్యుల 'పదార్థధర్మ సంగ్రహము' ఈ సూత్రములకు భాష్యము వంటిది. ఉదయనాచార్యుని 'కిరణావళి', శ్రీధరాచార్యుని 'న్యాయకందళి' ఈ భాష్యమునకు టీకలు. శంకరమిశ్రుని వైశేషిక 'సూత్రోపస్కారము' అనుభాష్యమింకొకటి ఈ సూత్రములపై వ్రాయబడినది.

వైశేషికమతమునగూడ సంసారము దుఃఖమయము. దుఃఖము యొక్క ఆత్యంతికనివృత్తియే పరమ పురుషార్థము. ఉపాయము; తత్వ జ్ఞానము; ద్రవ్య, గుణ, కర్మ, సామాన్య, విశేష, సమవాయములను పదార్థముల సాధర్మ్యవైధర్మ్యజ్ఞానమునుండి కలిగిన తత్వజ్ఞానమే వైశేషికులు వాంఛించునది. తరువాత వచ్చిన ఆచార్యులు అభావమను పదార్థము నొకదానిని గ్రహించి, ఈ దర్శనమున జేర్చిరి. బహుశః, ప్రశస్తపాదుడే ఇందులకు కారణమై యుండవచ్చును. గ్రీకుల (Categories) తో ఈ పదార్థములకు పోలిక యున్నది.

ద్రవ్యము తొమ్మిదివిధములు. క్షితి, నీరు, తేజస్సు, వాయువు, ఆకాశము, కాలము, దిక్కు, ఆత్మ, మనస్సులనునవి ఈ నవవిధ ద్రవ్యములు క్షితి అప్పులు, తేజస్సు, వాయువు – ఇవి నిత్య, అనిత్య భేదములు కలవిగా వైశేషికులు పరిగణింతురు. ఇవి పరమాణు రూపమున నిత్యములు, కార్యరూపమున అనిత్యములు. ఈ చతుర్విధ పరమాణువులు, మిగిలిన పంచద్రవ్యములు నిత్యములు. ఆత్మజ్ఞానము యొక్క ఆశ్రయము మానసప్రత్యక్షము. ఆత్మవిభువనగా సర్వ వ్యాపి. ప్రతిదేహమున భిన్నమై యొప్పుచున్నది. మనస్సు అణుపరిణామము కలదైయున్నది. మనస్సు ఆత్మయొక్కయు సుఖదుఃఖాదుల యొక్కయు ప్రత్యక్షమునకు దోడ్పడు కరణము. ద్రవ్యము గుణాశ్రయము. గుణవిరహితమై ద్రవ్య ముండనేరదు.

వైశేషికులు ఇరువదినాలుగు గుణముల నొప్పుకొందురు. అవి రూప, రస, గంధ, స్పర్శ, సంఖ్య, పరిమాణ, పృథక్త్వ, సంయోగ, విభాగ, పరత్వ, అపరత్వ, బుద్ధి, సుఖ, దు:ఖ, ఇచ్ఛా, ద్వేష, ప్రయత్న, గురుత్వ, ద్రవత్వ, స్నేహ, సంస్కార, అదృష్ట, శబ్దములనునవి. ఇందలి మొదటి పదునేడింటిని మాత్రమే సూత్రకారుడు నిర్వచించియున్నాడు. ప్రశస్తపాదుడు చివరి ఏడింటిని కల్పి ఇరువదినాలుగు గుణముల ప్రస్తావించినాడు.

కర్మ, ఉత్క్షేపణ, అపక్షేపణ, ఆకుంచన, ప్రసారణ, గమనములను పంచ విధముల విభజింపబడినది.

సామాన్యము లేక జాతి, పరాపరాభేదముల ద్వివిధము. మను ష్యత్వ, అశ్వత్వ, గోత్వాదులు అపరాజాతి; వీటికి సంబంధించిన ప్రాణిత్వజాతి పర.

విశేషమన ఏయసాధారణ ధర్మమువలన నిరవయువ పదార్థ ముల పరస్పరభేదము సిద్ధించునో అయ్యది.

తంతువు – వస్త్రము, గుణము – గుణి, క్రియ – ద్రవ్యము, జాతి – వ్యక్తి వీటికిగల సంబంధమే సమవాయ సంబంధము.

అభావము, సంసర్గాభావము, అన్యోన్యాభావము అని రెండు విధములు. సంసర్గాభావము, మరల ప్రాగభావము, ప్రధ్వంసాభావము, అత్యంతాభావము అను మూడు విధముల విభజింపబడినది.

ఈ పదార్థముల తత్వజ్ఞానము వలననే ముక్తి లభించునని వైశేషికు లందురు.

వైశేషిక దర్శనమున ద్వితీయాధ్యాయమున ఈశ్వర ప్రసంగ మున్నది. 'సంజ్ఞాకర్మ తస్మాద్విశిష్టానాం లింగమ్' (వై. సూ. ౨. ౧–౧౮) 'ప్రత్యక్ష ప్రవృత్తత్వాత్ సంజ్ఞాకర్మణః' (వై. సూ. ౨. ౧–౧౯) అను సూత్రముల ఈశ్వరుని గురించి సూచింపబడినది. సంజ్ఞఅనగా నామము. కర్మ అనగా క్షిత్యాది కార్యములవలన మన కంటె అన్యులగు ఈశ్వరుని యొక్కయు, మహర్షుల యొక్కయు అస్తిత్వమును ప్రమాణీకరించుచున్నవి. ఘటపటాది నామములవలన ఆయావస్తువుల మన మెందులకు గ్రహించుచున్నాము ? ఈశ్వరుని సంకేతముకాన. క్షిత్యాదులు కార్యమగుటచేసి సకర్తృయముగ వాటి కొకకర్త యున్నాడు. అతడీశ్వరుడు. ఇదియే మూలగ్రంథమునందు మనకు గనపడు ఈశ్వర ప్రశంస.

వేదప్రమాణము నంగీకరించునప్పుడీశ్వరుని తత్కర్తగా పరి గ్రహించినారు. 'తద్వచనాత్ ఆమ్నాయస్య ప్రమాణమ్.'

నవ్యనైయాయికులు నవద్రవ్యముల గురించి విచారము సల్పుచు, ఆత్మను జీవాత్మ, పరమాత్మలను ద్వివిధభేదములు కలదిగ

నిర్వచించినారు. వీరు లెక్కలు వేసి ఈశ్వరునియందు జ్ఞాన, ఇచ్ఛా, ప్రయత్న, సంఖ్యాదులగు తొమ్మిదిగుణము లున్నవని నిర్ణయించినారు. కణాదుడిట్లు లెక్కపెట్ట సాహసింపలేదు.

ప్రశస్తపాదులు పదార్థముల తత్త్వజ్ఞానమే మోక్షకారణమని వచించుచు, 'తచ్చ ఈశ్వరనోదనాభివ్యక్తాత్ ధర్మాదేవ' — ఆతత్త్వజ్ఞానము ఈశ్వర ప్రేరిత ధర్మమునుండి జనించునది అని నుడివినారు. మూలసూత్రముల 'ధర్మవిశేషప్రసూత' అని మాత్రమే చెప్పబడినది. ఇచ్చటి ధర్మశబ్దమున కర్థము నిష్కామ కర్మమై యుండనోపును.

ప్రశస్తపాదులుపరమాణుప్రసంగసందర్భమున కూడ ఈశ్వరునిమాట తలపెట్టినారు. కాని మూలసూత్రములనిర్దానికి తావు కన్పడదు. కణాదుని సిద్ధాంతము, అణువులు సత్తు, నిత్యములు, అస్పృష్టములు. ఘటపటాదుల కారణ మివియే. వీటి కింకొకకారణము లేదు. ఉత్పత్తిలేదు వినాశములేదు. ఇట్టి రెండు పరమాణువుల సంయోగమున ద్వ్యణుకము జన్మించును. కొన్ని ద్వ్యణుకములు కలసి త్రసరేణువుత్పన్నమగును. ఇట్లే క్రమముగా స్థూలపదార్థము లేర్పడును.

ప్రశస్తపాదుని సిద్ధాంతము: మహేశ్వరునకు సంహారేచ్ఛ జనించినప్పుడు పరమాణుపుంజసంఘాతమున జనించిన శరీరేంద్రియాదులు క్రమముగా విశ్లిష్టమై, వినష్టమై పోవును. అప్పుడు చతుర్విధ పరమాణువులు మాత్రమే మిగిలియుండును. ప్రళయానంతరము జీవుని భోగాదృష్టములు పూరణమై మహేశ్వరునకు మరల సృష్టినొనర్ప ఇచ్ఛకలుగును. అప్పుడు మొట్టమొదట వాయుపరమాణువున అదృష్టవశతః స్పందనము కలుగును. అప్పుడు వాయుపరమాణువుల సంయోగమువలన వాయువుత్పన్నమై ఆకాశమున ప్రవహించుచుండును. ఇట్లే తైజస, జలీయ, పార్థివ, పరమాణువులనుండి స్థూలభూతములు జన్మించును. తరువాత మహేశ్వరుని సంకల్పవశమున బ్రహ్మాండము సృష్టమగును. బ్రహ్మ కూడ ఉద్భవించి మిగిలినసృష్టి నొనర్చును.

ఇయ్యది ప్రశస్తపాదుల సిద్ధాంతమని పైననుడివి యుంటిమి. మూలసూత్రముల దీనికి తగు ఇంగితమేమియు కన్పట్టదు.

వైశేషికులు సన్న్యాస, యోగాభ్యాస, సమాధులను సాధనాంగములుగ గ్రహించిరి.

---

# సాంఖ్య దర్శనము :

సాంఖ్యదర్శన ప్రథమాచార్యుడు కపిల మహర్షి. ఆసురి కపిలుని శిష్యుడు. పంచశిఖాచార్యుడు కపిలుని ప్రశిష్యుడు. ఈయన సాంఖ్యశాస్త్రమును విశదీకరించు పెక్కు గ్రంథములను విరచించెను. అవన్నియు కాలప్రవాహమునంబడి విస్మృతి తీరముం జేరుకొనినవి; కాలార్క భక్షితములై పోయినవి. అదియునుగాక ప్రథమాచార్యుడగు కపిలు డెప్పటివాడో, ఎవరో నిర్ణయించుటకైన దగిన సామగ్రి లేదు. శ్వేతాశ్వతరశ్రుత్యుక్త కపిలు డొకడు, విష్ణువుయొక్క అవతారమగు కపిలుడొకడు, అగ్నిదేవుని అవతారమగు కపిలుడొకడు; మొత్తము మీద ముగ్గురు కపిలులగపడుచున్నారు. శ్రుత్యుక్త కపిలుడు సాంఖ్యదర్శనాచార్యుడు కాజాలడని శంకరాచార్యులవారు సాంఖ్యస్మృతిః ఖండించు సందర్భములో తమసంశయమును వెలిపుచ్చియున్నారు. సాంఖ్యస్మృతి లేక దర్శనము శ్రుతివిరోధి యగుట వలన, శ్రుతిచే ప్రశంసింపబడిన కపిలుడే దర్శన రచయిత కాజాలడని ఆచార్యులవారి అభిమతము. విష్ణ్వవతారకపిలుని ప్రసంగము శ్రీమద్భాగవతములో కానవచ్చుచున్నది. కాని తత్కపిలోక్త తత్త్వమునకును ప్రచలిత సాంఖ్యతత్త్వమునకును విశేషప్రభేద మగుపడుచున్నది. అందువలన ఆ కపిలుడే సాంఖ్యశాస్త్ర ప్రణేత యని నుడువ నాలుక వెనుకాడుచున్నది. మఱి, అగ్న్యవతారమగు కపిలుడు సాంఖ్యదర్శనాచార్యుడా ?

ప్రస్తుతము మనకు లభించు సాంఖ్య శాస్త్రగ్రంథములన్నిం టిలో ప్రాచీనమైనది 'తత్త్వసమాస' యను సూత్రగ్రంథము. అనేకు లిద్దానిని కపిలోద్దిష్టమగు మూలగ్రంథముగా పరిగణింతురు. సాంఖ్య దర్శనాభిజ్ఞుడగు విజ్ఞానభిక్షు విట్లనుచున్నాడు :

> 'నన్వేవమపి తత్త్వసమాసాఖ్యసూత్రైః సహాస్యాః షడధ్యాయ్యాః పౌనరుక్త్య మితిచేత్? మైవమ్, సంక్షేప విస్తరరూపేణ ఉభయోరపి అపౌనరుక్త్యాత్.'
>
> —సాంఖ్యప్రవచన భాష్యభూమికా.

కాని సంక్షిప్తాతిసంక్షిప్తమగు ఈ గ్రంథమును మూలదర్శన గ్రంథముగా గ్రహింప వీలులేదు. 'తత్త్వసమాసను' ఒక గ్రంథమనుట కంటె విషయసూచిక యనజెల్లును. సువిశదమగు వృత్తియొకటి ఈ సూత్రగ్రంథముపై రచింపబడినది లభించుచున్నది. దీని కర్త ఆసురి.

కపిలోక్తముగ గ్రహింపబడు మఱియొక గ్రంథము 'సాంఖ్య ప్రవచనసూత్రము.' ఈ గ్రంథమునుద్దేశించుచు విజ్ఞానభిక్షువు 'శ్రుత్య విరోధినీరుపపత్తీః షడధ్యాయీరూపేణ వివేకశాస్త్రేణ కపిలమూర్తి ర్భగవాన్ ఉపదిదేశ' అని పల్కియున్నాడు. కాని ఇయ్యదియు కపిల విరచితము కాజాలదని వచింప సాహసించినందులకు ప్రాచీనపండి తులు మమ్ము క్షమింతురుగాక. ఈశ్వర కృష్ణవిరచితమగు సాంఖ్య కారికలనుండి గ్రైకొనంబడిన వాక్యములనేకములు యథాతథముగ తమ ఛందోరూపమును వీడకుండ ఈ సూత్రముల నిల్చియున్నవి. శంకరుడుగాని, మాధవాచార్యుల వారుగాని, వాచస్పతిమిశ్రుడుగాని ఈ సూత్రముల నామమునైన తడవియుండలేదు. ఇది వారికాలమున నుండిన ఇట్లు నిర్లక్షింతురా ? కొందఱనునట్లు విజ్ఞానభిక్షువే ఈ సూత్రముల కూర్చినాడని నిస్సందేహముగ చెప్పగల యోగశక్తి మాకు లేదు కాని, ప్రాచీనుడగు కపిలుడీసూత్రరచయిత కాడని నుడువగలము.

అనిరుద్ధునివృత్తి, విజ్ఞానభిక్షుని భాష్యము, ఈ సూత్రార్థముల విశదీకరించు రచనలు.

వీటి అన్నిటికంటె ప్రామాణికమగు గ్రంథము ఈశ్వరకృష్ణుని, 'సాంఖ్యకారికలు.' ఈ కారికలకు షడ్దర్శనవ్యాఖ్యాతయగు వాచస్పతి మిశ్రుడు, 'తత్త్వకౌముది,' యను టీకను విరచించెను. శంకరుని పరమ గురులగు గౌడపాదులు భాష్యమును రచించిరి. ఈశ్వరకృష్ణుడు తన్ను కపిలునినుండి ప్రవహించిన గురుశిష్యపరంపరకు జెందినవానిగ చెప్పి కొనినాడు. ఈ కారికలు క్రీ. శ. ౬ వ శతాబ్దమున చైనాభాషలోని కనువదింపబడినవి. ఆచార్యశంకరులు, సర్వదర్శనసంగ్రహకర్త యగు మాధవులు ఈ కారికలనే తమ గ్రంథముల నుదాహరించిరి.

కొందఱు, ఈకారికలు షష్టితంత్ర మనబడు ప్రవచనసూత్ర ముల ననుసరించియే వ్రాయబడినవని వచించుచు తమపక్షమును సమర్థించుకొనుటకుగాను, కారికల శేషభాగముననున్న, ఏతదర్థవ్యంజ కములగు శ్లోకద్వయమును చూపింతురు కాని, గౌడపాద భాష్య ప్రతియందీశ్లోకములు కానరావు.

వివాదగ్రస్తమును, సందిగ్ధమును నగు ఈ గ్రంథకర్తృత్వ చర్చ నింతటితో ముగించి, 'ప్రకృత మనుసరామః.'

ఇతర దర్శనములవలె సాంఖ్యదర్శనముకూడ దుఃఖవాద ముతో ప్రారంభ మగుచున్నది. జీవుడు మన్న రెండు మూడురోజులు దుఃఖములో కయ్యమునకు బొల్పడి దానిచే నాఘాతముల బడవలసి వచ్చుచున్నది. ఆ దుఃఖము మూడు తెఱగుల గానవచ్చుచున్నది. 'త్రివిధం దుఃఖమ్'. ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికనామముల నీ త్రివిధ దుఃఖము వ్యవహరింపబడుచున్నది. ఈ దుఃఖస్వరూప మెట్టిది ? రోగాదిరూపకమగు శారీర క్లేశములు, కామాదిరూపములగు మానసిక కష్టములు ఆధ్యాత్మిక దుఃఖము నాబడుచున్నవి. మను ష్యులు, పశువులు, స్థావరములు మున్నగు వానినుండి సంభవించు దుఃఖము ఆధిభౌతికము. శీత గ్రీష్మ వర్షాదులవలన కలుగు దుఃఖము ఆధిదైవికము. శరీర మున్నంతవఱకు ఈదుఃఖము తప్పనిసరి. అయ్యది మనకు రుచింపదు; మన మద్దానిని గోరము. అందువలన నది

హేయము. మనము దానియొక్క అంతమును, లేక హానిని గోరుదుము. ఈశ్వర కృష్ణు డనుచున్నాడుకదా,

'తత్రజరామరణకృతం దుఃఖం ప్రాప్నోతి చేతనః పురుషః,
లింగస్యావినివృత్తేః. తస్మా ద్దుఃఖం స్వభావేన.'

—సాం. కా. ౫౫.

గీతలలోగూడ భగవాను డీజగత్తును పునర్జన్మ దుఃఖాలయ మనియు, అశాశ్వతమనియు, అనిత్యమనియు వచించి దుఃఖ స్వరూప మును సూచించియున్నాఁడు.౧

ప్రపంచమునందు సుఖము బొత్తిగా లేదనికాదు. ఎప్పుడో ఒకప్పుడు ఒకానొకనికి భాగ్యవశముననొకింతసుఖము లభించును. అదియు దుఃఖమిశ్రితము అగుటచేసి దానిని కూడ దుఃఖమనియే ఎన్నఁగును.౨ కాన పైన వర్ణింపబడిన త్రివిధాత్మక దుఃఖ నివృత్తియే వాంఛనీయము. ఈదుఃఖనివారణోపాయమును సూచించుటకే దర్శన శాస్త్రములు జనిమించినవి. కాని, ఈ నివృత్తి తాత్కాలికమైన లాభము లేదు. ఆత్యంతిక నివృత్తి అయిన మేలు. ఇదియే పరమ పురుషార్థము. 'అథ త్రివిధదుఃఖాత్యన్త నివృత్తిరత్యన్తపురుషార్థః' (సా. సూ. ౧. ౧)

ఈ ఆత్యంతికనివృత్తి ఎట్లు సిద్ధించును? లౌకికోపాయముల వలన సిద్ధింపదనుసంగతి సర్వజనవిదితము. ఔషధసేవలవలనగాని ఇష్టప్రాప్తివలనగాని అగు దుఃఖనివృత్తి తాత్కాలికము. అవ్యభి చారియుగాదు. పిదప, వైదికోపాయమునననుసరించి స్వర్గలోకమున కరిగి దుఃఖమును తప్పించుకొంద మన్నను వీలుపడుటలేదు. ఏలయన, ఒనర్చిన యాజ్ఞాది క్రియల ఎచ్చుతగ్గుల ననుసరించి, పొందెడి

౧. సమానం జరామరణాదిజం దుఃఖం—సాం.కా.౩_౫౩. ఊర్ధ్వాధోగతానాం బ్రహ్మాదిస్థావరాం తానాం సర్వేషాం ఏవ జరామరణాదిజం దుఃఖం సాధారణం.

—విజ్ఞానభిక్షువు.

౨. కుత్రాపి కోఽపి సుఖీతి. సా. సూ. ౧_౬.
తదపి దుఃఖశబలమ్. సా. సూ. ౧_౮
ఇతి దుఃఖపక్షే నిక్షిపన్తివివేచకాః. సా. సూ. ౧_౭.

సుఖములలో భేదము కల్గును. అందువలన స్వర్గవాసుల నడుమ ఉత్కర్షాపకర్షలవలన దుఃఖ మనివార్యమై వాటిల్లును. అదియును గాక యజ్ఞాదిక్రియలు హింసాబహుళములు. హింసవలన సంభవించు పాపమును అనుభవింపవలెను. అందువలన దుఃఖము తప్పుటలేదు. మఱియు, ఈలోకములు నిత్యములు కావు. పుణ్యభోగానంతరము మనుష్యలోకమున జన్మనెత్తవలెను. కనుక లౌకికవైదికోపాయములు రెండు దుఃఖనివృత్తికి తోడ్పడలేవు. అగుచో, నుపాయ మేమి?

ఈ ఉపాయనిర్ధారణార్థమే సాంఖ్యదర్శనావతరణము.

సాంఖ్యదర్శనానుసారము దుఃఖనివృత్తికగు ఉపాయము జ్ఞానము. 'జ్ఞానాన్ముక్తిః' (సా. సూ. 3-23) జ్ఞానమనగా నెద్దాని జ్ఞానము? ప్రకృతిపురుషుల భేదజ్ఞానము.[3] ఈజ్ఞానము. ప్రకృతి, వికృతి, పురుషుల గుఱించి లెస్సగా తెలుసుకొనుటవలన లభించును. (ఈ మూడింటిని 'అవ్యక్త, వ్యక్త, జ్ఞ' అనియు సాంఖ్యులు వ్యవహరింతురు.) వీటి తత్త్వమును మాటిమాటికి పర్యాలోచన మొనర్చిన భ్రమరహితమును, సంశయ విహీనమును, పరమపవిత్రమును అగు జ్ఞానము లభించును. ఈ జ్ఞానలాభానంతరము మనుజుడు జీవన్ముక్తుడై ప్రారబ్ధకర్మలు క్షీణము లగువఱకు శరీరము నాశ్రయించుకొని యుండును. ఆజీవన్ముక్తవ్యక్తి తన్ను కర్తృత్వ భోక్తృత్వరహితుడగు చిన్మాత్రునిగా తెలిసికొనును. అట్టి నిర్మమనిరహంకార పురుషునిపట్ల ధర్మాధర్మ బీజములు నిష్ఫలములు; జననమరణస్రోతమునం ద్రోయజాలవు. సలిలసిక్తమగు క్షేత్రముననే బీజములంకురించును. నిదాఘ సూర్యకిరణముల జలములింకి పోయినచో నా మరుభూమియందు మొలక మొలుచునా? జ్ఞానమువలన అవివేకము దూరీకరింపబడిన చిత్తమున కర్మబీజములు అంకురింపజాలవు. జీవన్ముక్తపురుషుని శరీరము నాశనమైనప్పుడు, ప్రకృతి అంతటితో నివృత్తమైపోవును.

---

3. వివేకఖ్యాతిరవిప్లవా హానోపాయః (సాధన. పా. ౨౬ సూ.) అను సూత్రమున పతంజలి ఈ విషయమునంగీకరించినాడు. గీతలలో ౧౩-వ అధ్యాయము ౨ వ శ్లోకములో నీయంశము సమర్థింపబడినది.

ఆపురుషుడు ఆత్యంతిక కైవల్యమును బొందును. సుఖదుఃఖములంత ర్హితము లగును.౪

ఇట్టి తత్త్వజ్ఞానిని ప్రశంసించు శ్లోకము నొకదానిని గౌడపాదు లుదాహరించినారు. అది :

> 'పంచవింశతితత్త్వజ్ఞో యత్రతత్రాశ్రమే వసేత్,
> జటీ ముండీ శిఖీ వాపి ముచ్యతే నాత్ర సంశయః.'

పైశ్లోకమున వాకొనబడిన పంచవింశతి (౨౫) తత్త్వములు ఏవేవి ?

సత్త్వరజస్తమములను త్రిగుణముల సామ్యావస్థయగు మూల ప్రకృతియు, దాని వికారమగు మహత్తత్త్వమును, దాని వికారమగు అహంకారమును, దాని వికారమగు పంచతన్మాత్రలు, ఏకాదశేంద్రియములును, పంచతన్మాత్రల వికారములగు పంచమహాభూతములును, పురుషుడును గలసి పంచ వింశతి తత్త్వములు. వాటినే 'తత్త్వ సమాస' అష్టప్రకృతులు, షోడశవికారములు, పురుషుడు అని పేర్కొను చున్నది.౫

సామాన్యముగా ప్రకృతియనిన మూల ప్రకృతియే. కాని బుద్ధి, అహంకారము, పంచతన్మాత్రలుకూడ గౌణభావమున ప్రకృతి యని పేర్కొనబడుచుండును.

పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, మనస్సు, పృథ్వ్యప్తేజోవాయ్వాకాశములను పంచమహాభూతములు కలసి షోడశవికారము లనబడుచున్నవి. ఇవి కాని వాడు పురుషుడు. ఇతడు ప్రకృతియు కాదు, వికృతియుకాదు.

ప్రకృతి యన నేమి ? జగత్సృష్టి కగు ఉపాదానము. 'ప్రకరోతి ఇతి ప్రకృతిః' అపరిచ్ఛిన్నమును, నిర్విశేషమును అగు మూలో

---

౪. నోభయం చ తత్త్వాఖ్యానే —సాం. సూ. ౧. ౧౦౭.

౫. చూడుడు. సాం. సూ. ౧౦–౩.

చూడుడు. గర్భోపనిషత్తు. ౩.

పాదానమే సాంఖ్యులు సూచించునది. దీని కాద్యంతములు లేవు. అతిసూక్ష్మము, లింగరహితము, నిరవయవము, దీనిపరిణామమే ఈ విచిత్రజగత్తు. ప్రకృతియొక్క అన్యనామము అవ్యక్తము. సృష్టికి పూర్వము జగత్తు అవ్యక్తమై (Unmanifested) యుండును. దీని యొక్క వ్యక్తావస్థనే సృష్టియందుము. ప్రళయాంతమున అవ్యక్తము నుండి వ్యక్తజగత్తు ఆవిర్భవించును. మరల సృష్ట్యవసానమున వ్యక్త జగత్తు అవ్యక్త ప్రకృతిలో లీనమగును. ౬ ఈ అనులోమ విలోమ ములను 'తత్వసమాస' సూత్రకారుడు సంచార ప్రతి సంచారము లనినాడు.

ప్రకృతి నాశరహితమను సిద్ధాంతమును పాశ్చాత్యదార్శనికులు కూడ ఒప్పుకొనుచున్నారు.౭ శ్వేతాశ్వతరశ్రుతి 'అజ' అనియు 'లోహితశుక్లకృష్ణవర్ణ' అనియు ప్రకృతిని వర్ణించినది. 'లోహితశుక్ల కృష్ణవర్ణ' యనగా త్రిగుణమయి యని. ఈ గుణముల నామములు సత్వరజస్తమములు. ౮ ప్రకాశము, ప్రవృత్తి, ఆవరణములు వీటి స్వభావములు. మానవ దేహమున కఫవాతపిత్తములకు సంగ్రామము నిరంతరము జరుగుచుండునట్లు మూల ప్రకృతియందీగుణములు సదా ఒకదానినొకటి అతిక్రమించిపోవుటకు యత్నించుచుండునని సాంఖ్యులు వచింతురు. ప్రకాశగుణియగు సత్వము జయమందిన సుఖముత్పన్న మగును. ప్రవృత్తిస్వభావయగు రజస్సు విజయమందిన ప్రవృత్తి, దుఃఖము, చాంచల్యములు జన్మించును. జడరూపియగు తమోగుణము గెలుపందిన మోహముకలుగుచున్నది. ప్రళయకాలమున ఈ పోరాట ముండదు.

ప్రకృతియొక్క స్వభావమే పరిణామము. ఇయ్యది సాంఖ్యుల భాషలో 'ప్రసవధర్మి', అందువలననే సృష్టి. అగుచో ప్రళయకాల మున ప్రకృతి స్థిరత్వమును దాల్చి యెట్లుండగలదు? అని ప్రశ్నించిన

---

౬. చూ. గీత. ౮-౧౮

౭. చూ. Herbert Spencer's 'First Principles.,

౮. సత్వరజస్తమాంసీతి త్రైగుణ్యమ్.

'సదృశ పరిణామము' ప్రకృతియందప్పుడు వర్తిల్లుచుండునని సాంఖ్యులు వచింతురు. అనగా, గుణములు వాటివాటి రూపముల నందుచుండును. సృష్టికాలీన ప్రకృతి పరిణామమును 'విసదృశ పరిణామము' అని వ్యవహరింతురు.

సాంఖ్యులు ఈశ్వరుని అంగీకరింపరు. 'తత్వసమాస' గ్రంథమున ఈశ్వర ప్రసంగమే లేదు. సాంఖ్యసూత్రమున అనేకసూత్రములు ఈశ్వరాసిద్ధికొఱకు వెచ్చింపబడినవి. అందువలననే ఈ శాస్త్రమునకు నిరీశ్వరసాంఖ్యమను పేరు రూఢమైనది. ప్రకృతి దానియంతట అదే పురుషుని భోగాపవర్గముల కొఱకుగాను పరిణతి నందుననియు, ఈశ్వర సాహాయ్యము నపేక్షింపదనియు సాంఖ్యుల ప్రతిపాదన. ఉష్ట్రము పరార్థమై కుంకుమమును మోయురీతి ప్రకృతియొక్క పరిణామము పురుషుని భోగాపవర్గముల కొఱకు. అచేతనయగు ప్రకృతియందుకృతి ఎట్లు సంభవించును అని ప్రశ్నించిన: పాలు స్వతస్సిద్ధముగనే పెరుగగునట్లు, ఋతువులొకదానిపిదప మరొకటి పరివర్తనమగునట్లు, అయస్కాంత సన్నిధిని లోహము చలించునట్లు, నీరు పల్లమునకు పారునట్లు, వత్సవివృద్ధినిమిత్తము క్షీరము ప్రవహించునట్లు పురుషుని భోగాపవర్గార్థము ప్రకృతి సహజముగనే పరిణమించుచున్నదని సాంఖ్యులు పల్కుదురు. అప్పుడు మహత్తత్వము, అహంకారతత్వము, పంచతన్మాత్రలు కలుగుచున్నవి. వానినుండి స్థూలభూతములు, ఏకాదశేంద్రియములు జనించుచున్నవి.

అహంకార తత్వమున తమోగుణము ప్రబలమైన పంచతన్మాత్రలు, సత్వగుణము ప్రబలమైన ఏకాదశేంద్రియములు ఉత్పన్నమగుచున్నవి. పంచ తన్మాత్రలనుండి పంచభూతములు ఇంద్రియముల కుపభోగములగు విషయములు జనించుచున్నవి. ఈ విషయములు సుఖదాయకములు, దుఃఖకరములు, మోహాత్మకములును అగుటంజేసి శాంత ఘోర మూఢ నామములంజేర్కొనంబడు చున్నవి. ఇయ్యది సాంఖ్యుల ప్రకృతి స్వరూపము.

ఇక పురుషుడు నిత్యుడు, అపరిచ్ఛిన్నుడు, నిష్క్రియుడు, స్వతంత్రుడు, లింగహీనుడు, నిరవయవి, చేతనుడు, పరిణామ రహితుడు, ద్రష్ట, కూటస్థుడు, కేవలుడు, అసంగుడు అని వర్ణింప బడినాడు. ఇతని భోగాపవర్గముల కొఱకే ప్రకృతి పతివ్రతవలె చరించు చున్నది. ప్రకృతి ఒక్కటియే. కాని పురుషు లనేకులు. అందఱును సర్వవ్యాపులు.

సృష్టికాలమున ప్రకృతిపురుషులిద్దరును సంయుక్తులైయుందురు. కనుకనే ఒకరి గుణము లింకొకరికి ఆరోపింపబడును. ఫలతః, అచేతనమగు ప్రకృతి చేతనముగాను, అకర్తయగు పురుషుడు కర్తగాను తోచుదురు.

సద్గురుని ఆశ్రయించి శ్రవణమనననిదిధ్యాసనల నొనర్చి ప్రకృతినుండి పురుషుడు తన్ను వేరుగా తెలుసుకొనవలయును. (సాంఖ్యుల సాధనకు పతంజలిసాధనకు భేద మంతగా లేదు.)

నర్తకి ప్రేక్షకులకు తన నాట్యమును జూపి అదృశ్య యగు నట్లు, ప్రకృతియు పురుషునకు తన రూపమును జూపి అదృశ్యమగును. ప్రకృతి అసూర్యంపశ్య యగు రమణివంటిది. పురుషు డొకసారి వీక్షించిన మరల వాని కన్నులం బడదు.

ఇట్లు ప్రకృతి పురుషునకు తన రూపమును దర్శింపజేసి, కైవల్యమునందించును.

*అజా మేకాం లోహితశుక్లకృష్ణాం - బహ్వీః ప్రజాః సృజ్యమానాం నమామః
అజాయేతాం జానమానాం భజంతే - జహాత్యేనాం భుక్తభోగాం నమస్తాన్.

—తత్త్వకౌముది.

# యోగదర్శనము:

యస్త్యక్త్వా రూపమాద్యం ప్రభవతి - జగతో ఽ నేకధా ఽ నుగ్రహాయ
ప్రక్షీణక్లేశరాశిర్విషమవిష - ధరో ఽ నేకవక్త్రః సుభోగీ,
సర్వజ్ఞానప్రసూతిర్భుజగపరికరః - ప్రీతయే యస్య నిత్యం
దేవో ఽ హీశః స వో ఽ వ్యాత్సితవి - మలతనుర్యోగదో యోగయుక్తః.

— వ్యా. భా.

౧

యోగదర్శన (సూత్ర) ప్రణేత భగవాన్ పతంజలి ; ప్రణేత అనుటకంటె అనుశాసకుడు అనుట మేలు. ఏలయన, యోగము శివ ప్రోక్తమనియు, హిరణ్యగర్భ ప్రోక్తమనియు రెండు తెఱగులుగ నున్నది. అందు, శివప్రోక్తయోగము మరల మంత్ర, హఠ, లయ, శివశక్తి యోగములను నాలుగుభాగములుగ విభజింపబడినది. మంత్ర యోగముయొక్క వివరణ నారాయణోపనిషదాది గ్రంథములలోను, హఠయోగముయొక్క రీతి ఘేరండ సంహితాది గ్రంథములలోను గాననగును. 'రసోవై సః' (తై. ఉ.) అను శ్రుతివాక్యమునకు పెడ అర్థము లాగి, ఈ హఠయోగము పొందిన విపరీతపరిణతియే 'రసేశ్వర దర్శనము.' నిద్రయందు మనస్సును లయమొనర్చునట్లు, ఇష్టదేవత యందు మనస్సును లయమొనర్చుటయే లయయోగము. షట్చక్ర భేదన మొనర్చి కుండలినీశక్తిని సహస్రారమునకు గొనిపోవుటయే శివశక్తియోగ మనంబడుచున్నది. ఈ రెండుయోగములు మహానిర్వాణాది తంత్రగ్రంథముల వివరింపబడియున్నవి. ఈ తంత్రముల సంఖ్య అరువదినాల్గు అని ప్రసిద్ధి. ఔర్వ, జమదగ్ని, భృగు, కశ్యప, ప్రచేతస, దధీచి, మార్కండేయాదులు ఈ యోగప్రచారకులుగ చెప్పబడుచున్నారు.

ఇక హిరణ్యగర్భప్రోక్త మగు యోగము 'రాజయోగము' అనంబడుచున్నది. దీనిని, దత్తాత్రేయులు ప్రచార మొనర్చినట్లు

శాస్త్రముల గానబడుచున్నది. 'రాజ' శబ్దము శ్రేష్ఠార్థద్యోతక మగుట వలన ఈయోగ మన్నిటికంటె శ్రేష్ఠముగ నెన్నబడుచున్నది. ఇయ్యది, కాలవశమున వినష్టమైపోవ, పరమకరుణామయుడగు పతంజలి దీనిని ఉద్ధరించి అనుశాసించినాడు; అందువలననే పతంజలిని 'ప్రణేత' యనక 'అనుశాసకుడు' అనుట మేలంటిమి.

ఈ సూత్రములకు వేదవ్యాసుడొక భాష్యమును రచించినాడు; కాని, రచయిత వ్యాసుడేయను విషయము నిర్వివాదము కాదు. ఏలయన, భాష్యాంత గద్యయందు వ్యాసునిపేరు కానవచ్చుట లేదు. అయినను పూర్వికులందరు ఈ విషయమునంగీకరించియుండిరి. సర్వతంత్రస్వతంత్రుడగు వాచస్పతిమిశ్రుడు ఈభాష్యమునకు 'తత్త్వవైశారది' అను టీక నొకదానిని రచించినాడు. అందు, 'వేదవ్యాసేన భాషితే సంక్షిప్తస్పష్టబహ్వర్థే భాష్యే' అని నుడివి, భాష్యము వైయాసిక మగుటను దృఢపరచినాడు.

'ఏతేన యోగః ప్రత్యుక్తః'—(వే. సూ. ౨-౧-౩) అని యోగమును ఖండించిన వ్యాసుడు మరల దానికే భాష్యమును వ్రాయుటా? — అసంభవము. అని నుడువుచో, దాని కియ్యది ప్రత్యుక్తి:—

ప్రతిశాస్త్రమున ప్రతిపాద్య విషయములు ముఖ్యములనియు గౌణములనియు ద్వివిధముగనుండును. గౌణవిషయముల స్పృశించు దోషములు ముఖ్యవిషయముల సంకటజాలవనుట సర్వవాదిసమ్మతము; ముఖ్యవిషయముననే శాస్త్రతాత్పర్యము జోడింపబడి యుండును. ఇక, యోగదర్శన ముఖ్యప్రతిపాద్యవిషయము, 'యోగము' అని, 'అథ యోగానుశాసనమ్' (యో. సూ. ౧. ౧) అను సూత్రమువలన మనకుదెలియవచ్చుచున్నది. వేదాంతసూత్రముల 'యోగః ప్రత్యుక్తః' అనుచోట ఖండింపబడినది 'యోగము' కాదు; సాంఖ్యుల ననుసరించి జగదుపాదానకారణము ప్రకృతియని యోగులు వచించు విషయము. ఈ సంగతి ఒకింత పూర్వాపరములు విచారించి చూచిన స్పష్టమవ గలదు. 'త్రిరున్నతం స్థాప్య శరీరమ్', 'తాం యోగ మితిమన్యతే' అను శ్రుతివాక్యములవలనను, 'ఆసీనః సంభవాత్' (వే. సూ.) ఇత్యాది

న్యాయములవలనను 'యోగము' అంగీకరింపబడినది గాని ఖండింప బడలేదని తెలియగలము. మఱియు ;

'గుణానాం పరమంరూపం న దృష్టిపథమృచ్ఛతి
యత్తుదృష్టిపథం ప్రాప్తం తన్మాయేవ సుతుచ్ఛకమ్'

అను వార్షగణ్యకారికవలన సాంఖ్యోక్తపదార్థముల యోగుల కంతగా శ్రద్ధలేదనియు, నిరాలంబమున యోగమొనర్పవలెనుగాన, ఆపదార్థములు గ్రహింపబడినవనియు, అవి తుచ్ఛములనియు తేలు చున్నది. అందువలన యోగదర్శన ముఖ్యప్రతిపాద్య విషయమగు 'యోగమును', తత్సాధనను వ్యాసు డంగీకరించుటలో దోషములేదు. అందువలన, పూర్వోక్త భాష్యము ఏతత్కృత మనుట అసమంజసము కానేరదు.[1]

ధారాధీశ్వరుడగు భోజుడు ఈ సూత్రముల కొకవృత్తిని రచించినాడు. అందు, పతంజలి లోకులయెడ అనుగ్రహమును వహించి, వైద్య, వ్యాకరణ, యోగ గ్రంథములను రచించి, జనుల శారీరక, వాచిక, మానసిక మలముల బాపినాడని ప్రశంసించినాడు. ఈ పతంజలి శేషుని అవతారమని పండితుల నమ్మకము. 'ఫణాధిపతిః కృతస్సూత్రేషు వృత్తిం వ్యధాత్' అని రాజమార్తాండటీక పతంజలిని ఫణాధిపతిగ పేర్కొను చున్నది.

ఇట పేర్కొనబడిన వ్యాకరణము ఫణిభాష్య మనబడు మహాభాష్యము — పాణిని సూత్రములకు కాత్యాయనుడు రచించిన వృత్తికి విశదీకరణము. వైద్యగ్రంథము చరకము. (గాథ) చారుని వలె శేషుడు భూలోకమున కరుదెంచి, జనులు రోగపీడితులై యుంట గాంచి, మునిపుత్రుడై జన్మించి దయగొని ఈ గ్రంథమును వ్రాసినాడని పూర్వికుల మతము. మూడవది, యోగదర్శనము లేక సూత్రములు.

1. వ్యాసు డొక్కడే యనకేల, భారతదేశమునందలి దార్శనికులందరును పతంజలి నుడివిన యోగసాధనను, తదవాంతర ఫలములగు విభూతులను పరమఫలమగు కైవల్యమును అంగీకరించినారు.

అయితే ఈ ముగ్గురును ఒకరే అను విషయమున ప్రాచీనులును వారి పదాంకానువర్తులగు అస్మద్దేశీయ పండితులకును వాదు లేదు. వారుచూపు ఉపపత్తి శేషుడే విభిన్న సమయముల మువ్మూర్తుల దాల్చి విభిన్న గ్రంథముల రచించియుండుట అసంభవము కాదు; లేక, మహాయోగియగు పతంజలి దీర్ఘకాలము మని, దేశకాలపరిస్థితుల ననుసరించి, ఆయా గ్రంథములను లిఖించి యుండవచ్చును.

ఇక పాశ్చాత్యపండితులును వారి పదానుసరణ మొనర్చు భారతీయ విద్వాంసులును, పై విషయములను నమ్మక మువ్వురకు విభిన్న సమయములను[2] నిర్దేశించు చున్నారు. భోజుడు పతంజలిని ప్రశంసించిన శ్లోకము పెక్కు ప్రతులలో గానవచ్చుట లేదనియు, అసలాటీక భోజకృతమో కాదో యనియు తమ సందియమును వెల్లడించుచున్నారు.

మేము ఈ ద్వివిధాభిప్రాయములను ప్రదర్శించి నిగమన భారము పాఠకులకు వదలివైచి, ప్రకృత మనుసరించుచున్నారము.

౨

పాతంజలదర్శనమున మొత్తము ౧౯౫ సూత్రములు ఉన్నవి; నాలుగు పాదములుగ విభజింపబడినవి. వాటి నామములు క్రమముగ : సమాధి, సాధన, విభూతి, కైవల్యపాదములు. కొందఱి అభిప్రాయమును అనుసరించి మొదటి మూడుపాదములు మాత్రమే పతంజలి విరచితములు ; నాల్గవది తరువాత చేర్చబడినది. దీనికి గల కారణము తృతీయపాదాంతసూత్రము 'ఇతి' అను సమాపకవచనమున ముగియుటే! కాని, ప్రాచీనులకు ఈ సందియము తట్టలేదు.

2. చరకుడు క్రీ. శ. ౧_వ శతాబ్దమునను, వైయాకరణ పతంజలి క్రీ. పూ. ౨వ_శతాబ్దమునను, యోగపతంజలి క్రీ. పూ. ౩_వ శతాబ్దమునను ఉన్నట్లు పాశ్చాత్య పండితులభిప్రాయపడుచున్నారు.

ప్రథమపాదమున యోగముయొక్క ఉద్దేశము, లక్షణము, వృత్తుల లక్షణము, యోగోపాయములు, యోగభేదములును వర్ణింపబడినవి.

రెండవపాదమున క్రియాయోగము, క్లేశములు, కర్మవిపాకము, దాని దుఃఖస్వరూపము, చతుర్వ్యూహములు పేర్కొనబడినవి

తృతీయపాదమున, అంతరంగ – అంగములు, పరిణామములు, సంయమభేదములు, విభూతి, వివేక జ్ఞానములు, ప్రస్తావింపబడినవి.

నాల్గవపాదమున ముక్తి యోగ్యమగు చిత్తము, పరలోకసిద్ధి, బాహ్యార్థసిద్ధి, ఆత్మసిద్ధి, ధర్మమేఘసమాధి, జీవన్ముక్తి, విదేహ కైవల్యములు ప్రసంగింపబడినవి.

## 3

పతంజలి సాంఖ్యుల పంచవింశతితత్త్వముల నంగీకరించి, పైపెచ్చు వారు ఖండించిన ఈశ్వరునిగూడ గ్రహించినాడు. అందువలన పతంజలితత్త్వములు మొత్తము ఇరువదిఆరు అగుచున్నవి. ఈ ఈశ్వర గ్రహణము, తనదర్శనమును వ్యాపకమునకు గొనివచ్చుటకే యని కొందరు తలచుచున్నారు.

ఈ ఈశ్వరు డెవడు ? 'అథ ప్రధానపురుషవ్యతిరిక్తః కోయం ఈశ్వరో నామ ?' అను ప్రశ్నకు పతంజలి,

క్లేశకర్మవిపాకాశయైరపరామృష్టః పురుష విశేష ఈశ్వరః. (యో. సూ. ౧–౨౪) తత్ర నిరతిశయం సర్వజ్ఞబీజం (యో. సూ. ౧–౨౫) స ఏషపూర్వేషామపి గురుః కాలేన అనవచ్ఛేదాత్ (యో. సూ. ౧–౨౬) అను సూత్రముల ఈశ్వరతత్త్వమును పతంజలి వర్ణించినాడు.

ఏ పురుషవిశేషమున క్లేశ, కర్మ, విపాక, ఆశయముల సంపర్కము లేదో, ఆతడే ఈశ్వరుడు. ఆతడు జ్ఞానముయొక్క పరమో

త్కర్ష. సర్వజ్ఞుడు. అతడు పూర్వాచార్యులకుగూడ గురువు, కాల నాము. అతడు కాలాతీతుడు.

సాధారణమానవు లందఱు పైనచెప్పబడిన క్లేశాదియుక్తులు ఈ క్లేశము లైదు తెఱగులు_అవిద్య, అస్మిత, రాగ, ద్వేష, అభి నివేశములను పేరిట నియ్యవి వ్యవహృతము.

అవిద్య యనగా మిథ్యాజ్ఞానము. అనాత్మవస్తువులగు శరీ రాదులయందు ఆత్మభావన దీని కుదాహరణ. అస్మితయన విభిన్న వస్తువు అభేదప్రతీతి. రాగమన అనురాగము. ద్వేషమన అనిష్ట వస్తువులయెడ విరాగము. అభినివేశమన మరణభయము.

కర్మ నాలువిధములు — కృష్ణ, శుక్లకృష్ణ, శుక్ల, అశుక్లా కృష్ణ యని. అత్యంతము పాపకర్మ కృష్ణకర్మ. బహిరంగములగు సాధనములతో నొనర్పబడు యజ్ఞయాగాదులు శుక్లకృష్ణకర్మలు తపస్స్వాధ్యాయధ్యానాది కర్మలు శుక్లములు. యోగానుష్ఠానము అశుక్లాకృష్ణ.

విపాకము అనగా కర్మఫలము; జాత్యాదిజన్మ, ఆయు భోగము లని త్రివిధము.

ఈ విపాకానుగుణమగు సంస్కారమే ఆశయము; ఈ సంస్కా రము లేనిచో భోగమే లేదు.

అందువలన, ఈ పంచవిధక్లేశముల సంపర్కము లేనివాడును జ్ఞాననిధియును, కాలాతీతుడును, నిత్యముక్తుడును, అద్వితీయుడును అగు పరమపురుషుడే ఈశ్వరుడని అవగమ్యము. ఈయనతప్ప తక్కిన వారందరును యోగాంగముల నభ్యసించి, కైవల్యమును బొందవలె ననుటయే పతంజలి అభిమతము. అందువలన యోగమునుగూర్చి ఒకింత ప్రసంగింతము.

3. సత్త్వపురుషయోః శుద్ధిసామ్యే కైవల్యమితి—యో. సూ. 3_౫.

4. See Sir S. Radhakrishnan's Indian Philosophy Vol II.

౪

వైద్యశాస్త్రమున రోగము, రోగహేతువు, ఆరోగ్యము, భైషజ్యము అను నాల్గుప్రకరణములున్నట్లే, యోగశాస్త్రమున గూడ నాల్గు ప్రకరణము లున్నవి. అవి: హేయము, హేయ హేతువు, హానము, హానోపాయములు. సంసారము దుఃఖమయము; అందువలన నియ్యది హేయము.[5] దీనికి కారణమేమి? ప్రకృతి పురుషుల సంయోగము.[6] ఈ సంయోగమును వియోగ మొనర్పవచ్చును. ఇదియే హానము.[7] దీని కగు ఉపాయమేమి? ప్రకృతిపురుషుల భేదజ్ఞానము.[8]

౫

'యోగ'శ్చిత్తవృత్తినిరోధః యో. సూ. ౧. ౧. అను సూత్రమున పతంజలి చిత్తవృత్తుల నిరోధమే యోగమని స్థిరీకరించి యున్నాడు. ఈ చిత్తము క్షిప్తము, మూఢము, విక్షిప్తము, ఏకాగ్రము, నిరుద్ధము అని పంచ విధములు. రజోగుణాధిక్యమున చంచలమైన క్షిప్తమనియు, తమోగుణాధిక్యమున మోహాచ్ఛన్నమైన మూఢ మనియు, సత్వగుణప్రాబల్యమున ఒకప్పుడు స్థిర మగుచు మరొకప్పుడు చంచలమైన విక్షిప్తమనియు, ధ్యేయవస్తువున ఏకతానతా ప్రవాహమైన ఏకాగ్రమనియు, వృత్తినిరోధమై వృత్తిజనిత సంస్కారము మాత్రమే మిగిలిన నిరుద్ధ మనియు అందురు. క్షిప్త, మూఢచిత్తముల యోగమసంభవము. విక్షిప్త చిత్తమున, యోగ మారంభ మగుచున్నది. ఇట్టి చిత్తమును 'క్రియాయోగము'[9] వలన ఏకాగ్ర మొనర్చిన యోగాధికారి అగును.

---

5. దుఃఖమేవ సర్వం వివేకినః. హేయం దుఃఖమనాగతమ్. యో.సూ.౨-౧౫-౧౬.
6. దృగ్-దృశ్యయోః సంయోగో హేయహేతుః యో. సూ. ౨-౧౭.
7. తదభావాత్ సంయోగాభావో హానమ్, యో. సూ. ౨-౨౫.
8. వివేకఖ్యాతిః అవిప్లవా హానోపాయః. యో. సూ. ౨-౨౬.
9. తపఃస్వాధ్యాయేశ్వరప్రణిధానాని క్రియాయోగః — సా. పా. ౧.

ఇక చిత్తవృత్తులు ప్రమాణ, విపర్యయ, వికల్ప, నిద్రా, స్మృతులని పంచవిధములు.

ప్రమాణ త్రైవిధ్యము ప్రత్యక్ష, అనుమాన, ఆగమ నామముల పేర్కొనబడుచున్నది. విపర్యయమన మిథ్యా జ్ఞానము: విషయము (Object) లేకపోయినను శబ్ద జ్ఞానమువలన నుత్పన్నమగు, ఆకాశ కుసుమ, నరశృంగ సంబంధము లగు వృత్తులు 'వికల్పము'. నిద్రయన సుషుప్తి. స్మృతి యన అనుభూత విషయ స్మరణ. చిత్తవృత్తు లన్నియు ఈ విభాగముననే చేరిపోవుచున్నవి. ఈ చిత్తవృత్తుల నన్నిటిని నిరోధింపవలెను. కారణము, కేవలుడును, నిర్గుణుడును అగు పురుషుడు చిత్తముతో కలయుటవలన, ఈ వృత్తులన్నియును అతని యందు ఉపచరింపబడి, దుఃఖమును కలిగించుచున్నవి. వీటిని నిరోధించిన పురుషునకు చిచ్ఛాయ తొలగి, నిజస్వరూపమున వెలయును.[10]

'అథ ఆసాం నిరోధే క ఉపాయ ఇతి'– వీటి నిరోధమునకగు ఉపాయ మేమి? అభ్యాస వైరాగ్యములని పతంజలి నుడివినాడు.[11] అభ్యాస మన, చిత్తవృత్తుల నేకాగ్రమొనర్పనొనర్పు యత్నము. శ్రద్ధా బ్రహ్మచర్య పూర్వకముగ నిరంతరము, దీర్ఘకాలము అనుష్ఠించిన, అభ్యాసము దృఢమగును. దృష్టాదృష్టవిషయ వితృష్ణ వైరాగ్యము. అభ్యాసము వలన వివేకమబ్బును. వైరాగ్యమున విషయవాసన నిర్వాపితమగును. అభ్యాసవైరాగ్యము లబ్బిన శ్రద్ధా, స్మృతి, ఉత్సాహ, ఏకాగ్రతలు కలిగి వైరాగ్యమువలన సంప్రజ్ఞాత సమాధియును; వైరాగ్యము సంపూర్ణమైన అసంప్రజ్ఞాత సమాధియును లభింపగలవు. మఱియు, తీవ్ర ప్రయత్నము గలవారికి 'సమాధి' కరతలామలకము.[12]

---

10. తదా ద్రష్టు స్వరూపే అవస్థానమ్, వృత్తిసారూప్యం ఇతరత్ర. యో. సూ. ౧. ౩ ౪.
11. అభ్యాసవైరాగ్యాభ్యాం తన్నిరోధః. యో. సూ. ౧-౧౨.
12. తీవ్రసంవేగానామాసన్నః—యో. సూ. ౧-౨౧.

సమాధికి ఈ అభ్యాస వైరాగ్యములుగాక మరేమైన ఉపాయ మున్నదా ? ఉన్నది. ఈశ్వర ప్రణిధానము, ఏకతత్త్వాభ్యాసము, చిత్తప్రసాదము, శ్వాసనిరోధము, చిత్తస్థైర్యము, జ్యోతిర్ధ్యానము, మహాత్ముల ధ్యానము, స్వప్న జ్ఞానావలంబనము, లేక యథాభిమత ధ్యానములలో నేదో యొకదానినైన అవలంబింపవచ్చును.

సాధనాకాలమున యోగికి కొన్ని అలౌకికశక్తులబ్బును. వీటిని, విభూతులనిగాని, సిద్ధులనిగాని అందురు. పాతంజలదర్శన తృతీయ పాదమున వీటి వివరణ మున్నది. ఇయ్యవి సమాధికి విఘ్నములు. పెరదారిని కొనిపోవును. అందువలన సాధకుడు వీటిని గర్హించి, నిర్జించి చరమస్థితియగు కైవల్యము నందవలెనని పతంజలి అభి మతము. [13]

౬

ఈ యోగమునకు ఎనిమిది అంగములు ఉన్నవి. అవి: యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణా, ధ్యాన, సమా ధులు. వీటి నభ్యసించిన చిత్తము శుద్ధమై, లయమౌ పోమైవును. అందు వలన వీటినిట వివరించుట అనవసరము కాదు.

అహింసా, సత్య, అస్తేయ, బ్రహ్మచర్య, అపరిగ్రహములు, యమ మనబడుచున్నవి.

సర్వత్ర, సర్వకాలముల, జాతిదేశకాలముల నపేక్షింపక అవ్యభిచారముగ నొనర్పబడు మహావ్రతము అహింస. మత్స్యాహారు లకు మత్స్యములయెడనున్న హింస జాతీయము; వారి కన్యత్ర ఉన్న అహింస జాత్యవచ్ఛిన్నము. 'తీర్థముల మత్స్యముల హింసింపవలదు' ఇది దేశావచ్ఛిన్నమగు అహింస. పర్వదినముల మత్స్యహింస నొనర్ప కుండుట కాలావచ్ఛిన్నము; దేవ బ్రాహ్మణార్థము మత్స్యముల

13. తే సమాధావుపసర్గా వ్యుత్థానే సిద్ధయః—యో. సూ. 3-37.

హింసించునది, అన్యత్ర వలదు—ఇది నియమావచ్ఛిన్నము. ఇట్లు జాతి దేశకాల సమయానవచ్ఛిన్నమును సార్వభౌమమును నగు మహావ్రతమే అహింస. దీనియందు ప్రతిష్ఠితుడైన సాధకుని సమీపమున హింస జరుగజాలదు. ఋష్యాశ్రమముల సింహములు, లేళ్ళు ఒక్కట నివసించుట విందుము. [14]

మనోవాక్కాయకర్మల యథార్థచింతన, కథన ఆచరణములే సత్యము. దీని నవలంబించిన అహింసావ్రతము పరిపూర్ణమగు; వచించినట్లగును. గ్రహతారకానిరపేక్షముగ మహర్షుల వాక్యములు ఫలించినట్లు పురాణములు వచించుచున్నవి.

అశాస్త్రీయముగ పరద్రవ్యాపహరణము నొనర్పకుండుటయే అస్తేయము. దీని నవలంబించిన సర్వరత్నములు వాటియంతట అవియే వచ్చును. [15]

అష్టవిధమైథునత్యాగపూర్వకముగ ఒనర్పబడు ఇంద్రియదమనము బ్రహ్మచర్యము. దీన వీర్యలాభమగును. 'మేధా' నాడి ఉత్పన్నమై సత్యగ్రహణశక్తిని బలవత్తర మొనర్చును.

విషయార్జనా రక్షణముల గల దోషముల బరిశీలించి, వాటిని బరిగ్రహింపకుండుటయే, అపరిగ్రహము. దీనివలన భూత భవిష్యద్వర్తమాన జన్మలను, అనగా, తత్ఫ్నితసంస్కారములను గ్రహించు శక్తి లభించును. సంస్కారముల గ్రహించిన వాటి నిర్మూలనము తేలిక యగును. శ్రీమద్భాగవతమున శ్రీకృష్ణుడు ముచికుందుని జాతిస్మరత్వమును బొంది, ముక్తుడవ ఆదేశించియుండుట, లక్షింపనగును.

శౌచ, సంతోష, తపః, స్వాధ్యాయ, ఈశ్వర ప్రణిధానములు నియమములు.

---

14. జాతిదేశకాలసమయానవచ్ఛిన్నాః సార్వభౌమా మహావ్రతం—యో. సూ. ౨-౩౧.

15. అహింసాప్రతిష్ఠాయాం తత్సన్నిధౌ వైరత్యాగః—యో. సూ. ౨-౩౫.

శౌచము, బాహ్యము, అభ్యంతరము అని ద్వివిధము. మృజ్జలముల, పవిత్రవస్తువుల నగు శౌచము బాహ్యము; చిత్తమలక్షాళనమాభ్యంతరికము. దీనివలన సర్వశరీరముల విరక్తి జనించును; అనగా అశుచిపదార్థముల శుచిత్వము రాదని మనస్సున ముద్రితమై శరీరాదులగు అనాత్మపదార్థముల ఆసక్తి దూరమగును. ఫలతః, సౌమనస్య, సత్త్వశుద్ధి, ఏకాగ్రతా, ఇంద్రియజయములు లభించి, ఆత్మదర్శనమునకు సాహాయ్యకరము లగును.

యదృచ్ఛాలాభముగ దొరకినవాటితో తృప్తినందియుండుటయే సంతోషము. దీనివలన లేనిసుఖ మొదగూరును. సహస్రాధికవత్సరభోగియగు యయాతి తుదకు సుఖము లన్నియునుగూడ, 'తృష్ణాత్యాగస్య కలాం నార్హంతి షోడశీమ్' అని నుడివినాడు. మనుష్యాది ఆనందముల నన్నిటిని ఒక్కట అభివర్ణించి, దానిని 'అకామహతుడగు శ్రోత్రియుని ఆనందము' తో సమాన మొనర్చినది తైత్తిరీయశ్రుతి.

శీతోష్ణ, సుఖదుఃఖాది రూపకమగు ద్వంద్వసహనమే తపస్సు. దీనివలన అజ్ఞానావరణ తొలగి, అణిమాదులును దూరశ్రవణదర్శనములును లభింపగలవు.

మోక్షశాస్త్రాధ్యయనము, స్వశాఖావేదాధ్యయనము ఈశ్వరస్తుతి, ప్రణవజపము, మంత్రజపములు స్వాధ్యాయ మనబడుచున్నవి. గీతాది సద్గ్రంథములను మోక్షశాస్త్రములుగ పరిగ్రహింపనగును. స్వశాఖాధ్యయనమును గురించిన విశేషప్రశంస తైత్తిరీయారణ్యకమున, శతపథ బ్రాహ్మణమున, గాననగును [16]

ఈశ్వరస్తుతి పురాణముల, చాటువుల ముఖరితము. నుధాతునిష్పన్నమగు ప్రణవశబ్దము నుతిపరము. దీనియందు, అకార,

---

16. యాంతి వా ఆపః ఏతి ఆదిత్యః ఏతి చంద్రమాః యాంతి నక్షత్రాణి, యథా హ వా ఏతా దేవతా నేయుర్న కుర్యుః, ఏవం హైవ తదహర్బ్రాహ్మణో భవతి యదహః స్వాధ్యాయం నాధీయతే, తస్మాత్ స్వాధ్యాయో అధ్యేతవ్యః.—ఇత్యాది.

ఉకార, మకారములను మూడుమాత్రల సంయోజన ఉన్నది. వీటి విశేషము మాండూక్యోపనిషత్తున గాననగును. మంత్రములు వైదిక తాంత్రికభేదముల ద్వివిధములు మరల, వైదికమంత్రములు ప్రగీతా ప్రగీతభేదముల నిరూపింపబడుచున్నవి. ప్రగీతములన, గాన మొనర్చ బడు సామములు; వీట మరల బృహద్రథంతరాది బహువిధభేదము లున్నవి. అప్రగీతములన, గానరహితములని పర్యవసానము; వీట ఛందో అఛందభేదమున్నది. ఛందోయుతములు ఋక్కులు; తద్ర హితము యజుస్సు. తాంత్రికమంత్రముల స్త్రీపుంనపుంసకభేదమున్నది. స్వాహాశబ్దప్రయుక్తములు స్త్రీజాతీయములు; నమశ్శబ్దయుతములు నపుంసకములు; మిగిలినవి పుమంతర్గతములు. వీటి మొత్తము సప్త కోటియని ప్రసిద్ధి. చతుఃషష్టి (౬౪) తంత్రముల వీటి సంస్కారవిధి ఉపదేశింపబడియున్నది. గురునికడ ఉపదేశమునంది జపించుట సంప్ర దాయకము. ఈజపము మరల, వాచిక, మానసిక, ఉపాంశు భేదముల నొప్పారుచున్నది వాచిక మన స్పష్టముగ, పరశ్రుత మగునట్లు ఉచ్చ రించుట. ఉపాంశువన ఓష్ఠస్పందన మొనర్చుచు, ధ్వని స్వకర్ణకుహర మున మాత్రమే ప్రవేశించునట్లు, ఉచ్చరించుట. మానసికమన ఓష్ఠాది స్పందనరహితముగ ఒనర్చునది. ఈ జపమును గురించియే గీతలలో భగవానుడు 'యజ్ఞానాం జపయజ్ఞో౽స్మి' అని నుడివినాడు.

ఈ స్వాధ్యాయాభ్యాసమున వివిధ దేవతాదర్శనము లభించును.

పరమగురుడగు పరమేశ్వరునకు సమస్తకర్మల నర్పించుటయే ఈశ్వరప్రణిధానము, ఆధునికభాషలో నిష్కామకర్మ.

నిశ్చలముగను సుఖముగను కూర్చుండుతీరు ఆసనము. పద్మ, భద్ర, వీరాది భేదములిందు ఎనుబదినాల్గు ఉన్నవి. దీనివలన ద్వంద్వ జయము లభించి, ధ్యానపథము సుగమమగును.

ప్రాణవాయు సంయమము ప్రాణాయామము. ఇందు రేచక పూరక కుంభకాది విధములున్నవి. దీని వివరణ గురుముఖముననే వినుట మంచిది. దీన, నాడీశుద్ధి, మనోనిగ్రహములు లభించును.

ఇంద్రియములను వాటివాటివిషయములనుండి మరలించుటయే ప్రత్యాహారము.

హృత్పద్మాదులగు అంతర విషయములగాని, చంద్రనక్షత్రాది బాహ్యవిషయములగాని చిత్తమును బంధించుటయే ధారణ.

నిర్దిష్టవస్తుముఖముగ అవిచ్ఛిన్న తైలధారవలె ప్రవహించు చిత్తప్రవాహమే ధ్యానము.

చిత్తము తదాకారాకారితమై, ధ్యేయవస్తు రూపమునుదాల్చి, స్వప్రత్యయరహితమగు స్థితినే 'సమాధి' అందురు.

ఇది సబీజము, నిర్బీజము అని రెండు తెఱగులు. సబీజసమాధి సవితర్క, నిర్వితర్క, సవిచార, నిర్విచారములని నాల్గువిధములు. ఇట ధ్యేయవిషయకమగు సాత్త్విక చిత్తవృత్తి యుండును. దీనిని పొందుటకు పూర్వము, మధుమతి, మధుప్రతీకా, విశోకా, సంస్కారశేషములను యోగభూమికల నధిరోహింపవలసి యున్నది. తత్పరము నిర్బీజసమాధి.

ఈ యోగాంగములలో మొదటి నాలిగింటిని బహిరంగ-అంగములనియు, మిగిలిన నాలుగింటిని అంతరంగ - అంగము లనియు వ్యవహరింతురు. ఒకసంగతి: ఈ ఎనిమిదింటిలో నేయొకదాని నవలంబించినను మిగిలినవి, వాటియంతట అవియేవచ్చి సాధకుని ఆశ్రయించునని మాయభిమతము. ఈశ్వరప్రణిధానము నొక్కదానినవలంబించిన చరమమగుయోగసిద్ధి లభింపగలదని, యోగసూత్ర - భాష్యప్రణేతయగు వ్యాసుని అభిప్రాయము; పతంజలిగూడ 'ఈశ్వర ప్రణిధానాద్వా' అని అంగీకరించినాడు. అపరిగ్రహవ్రతావలంబనముననే జన్మరాహిత్యమని తురీయానందుడు.

మహత్తమములగు యోగాంగములనుగుఱించి, వ్యాసవిస్తృతి భయమున దిఙ్మాత్రముగ సూచించితిమి. అన్యత్ర ఇలోధికముగ ప్రసంగించు ఇచ్ఛతో, ప్రస్తుత ముపక్రమించుచున్నారము.

౭

ఈ యోగమునకు వ్యాధి, స్త్యాన, సంశయ, ప్రమాద, ఆలస్య, అవిరతి, భ్రాంతిదర్శన, అలబ్ధభూమికత్వ, అనవస్థితత్వములను విఘ్నము లున్నవి. వాత పిత్త శ్లేష్మధాతువుల వైషమ్యము వ్యాధి; చిత్తము యొక్క జడత స్త్యానము. అనిశ్చిత జ్ఞానము సంశయము. సాధన యత్నాభావము ప్రమాదము. కఫాది జనిత శరీరగురుత్వమునను, తమోజనితమగు మానసిక గురుత్వమునను అగు అప్రవృత్తి ఆలస్యము. భ్రాంతి దర్శన మన విపర్యయజ్ఞానము. సమాధియోగ్య మగు చిత్తభూమికను ప్రాపింపకుండుట అలబ్ధభూమికత్వము. దీనిని బొందియు పోగొట్టుకొనుట అనవస్థితత్వము.

ఇవిగాక, దుఃఖ, దౌర్మనస్య, అంగమేజయత్వ, శ్వాస ప్రశ్వాసలుగూడ చిత్తవిక్షేపకరములు.

పైన ప్రదర్శింపబడిన వ్యాధి స్త్యానాదులవలన నగు ఫలితము, దుఃఖము. ఇచ్ఛ ఫలింపకుండుటవలన గలుగు క్షోభ దౌర్మనస్యము. అంగమేజయత్వమన శరీరాంగకంపము. ఇచ్ఛావ్యతిక్రమముగ ప్రాణ వాయువు లోపలికి ప్రవేశించుట, వెలికి వచ్చుట శ్వాసప్రశ్వాసలు.

ఈ విఘ్నములు దొలగుటకు ఉపాయము — యథాభిమత ధ్యానము. లేక, ప్రణవజప, తదర్థభావనల గూడ నాశ్రయింపవచ్చును.

౮

పై ఉపాయముల నవలంభించి నిర్బీజ సమాధి నందిన పురుషుడు, ప్రకృతినుండి విడివడి, స్వస్వరూపమున స్థితుడగును — ఇట్లు పురుషుడు శుద్ధముక్త స్వభావుడై వెలయును; ఇదియే కైవల్యము.[17]

17. సత్త్వపురుషయోః శుద్ధిసామ్యే కైవల్యమితి — యో. సూ. ౩-౩౫.

దీని ఫలితముగ అవిద్య నివృత్తమగును; పంచక్లేశములు బాసిపోవును. క్లేశనివృత్తియైన కర్మఫలము శుష్కమగును. ప్రయోజనసిద్ధి యగుటవలన మఱి ప్రకృతి కంటబడదు. అప్పుడు పురుషుడు కేవలుడై, నిర్మలజ్యోతిస్స్వరూపమున వెలయును.

౬

పతంజలి మతము ననుసరించి కారణములు తొమ్మిది విధములుగ బేర్కొనబడుచున్నవి. అవి; ఉత్పత్తికారణము, స్థితికారణము, అభివ్యక్తికారణము, వికారకారణము, ప్రత్యయకారణము, ప్రాప్తికారణము, అన్యత్వకారణము, ధృతికారణము లనునవి.

జ్ఞానోత్పత్తికారణము మనస్సు. మనస్సుయొక్క స్థితికారణము పురుషార్థము. శరీరస్థితికారణము ఆహారము. వెలుగు రూపముయొక్క అభివ్యక్తి కారణము. విషయాంతరము మనస్సుయొక్క వికారకారణము, ఋషులకు అప్సరోదర్శనాదులు. పాకవస్తువులకు వికారకారణము అగ్ని. ధూమజ్ఞానము అగ్నికి, ప్రత్యయకారణము. యోగాంగానుష్ఠానము వివేకఖ్యాతికి, ప్రాప్తికారణము. కమసాలి స్వర్ణమునకు అన్యత్వకారణము. అతఁడు దానిని ఆభరణాదికముగ మార్చుచున్నాఁడు. శరీరము ఇంద్రియములకు ధృతికారణము. మనుష్యుఁడు ఫలమూలాదుల భక్షించును; అవి వానికి ధృతికారణము. ఈ శరీరమే మరల వ్యాఘ్రభక్షితమైన దానికి ధృతికారణమగుచున్నది అందువలన సమస్తవస్తువుల సమస్తశక్తి యున్నది; సమస్తవస్తువులు సమస్తాత్మకములు.

కాని, ఒక్కొక్క దానియందు ఒక్కొక్కశక్తి విశేషముగ ప్రస్ఫురించుచున్నది; అందువలన వీటియం దితరశక్తులు లేవని తలపకూడదు. అన్నియును కారణాత్మకములు. అనగా, మూలశక్తియందిమిడియున్నవి. దీనిపరిణామమే ఈ విచిత్రజగత్తు; పరిణామ మన అవస్థాంతరప్రాప్తి. ఇయ్యది ధర్మ, లక్షణ, అవస్థాపరిణామములను త్రివిధ నామముల బేర్కొనబడుచున్నది.

---

# పూర్వమీమాంసాదర్శనము

శబ్దబ్రహ్మ యదేకం యచ్చైతన్యం సర్వభూతానాం,
యత్పరిణామస్త్రిభువనమఖిలం ఇదం జయతిసావాణీ.

## ౧

మీమాంసాదర్శనము వేదసంబంధియము. అందువలన వేదముల గురించి, ఒకింత ముందుగ ప్రస్తావించుట అనవసరము కాదు. వేద మన నేమి?

> 'ధర్మబ్రహ్మప్రతిపాదకం అపౌరుషేయం స్వతః
> ప్రమాణవాక్యం వేదః ఇష్టప్రాప్తి - అనిష్టపరి
> హారయోః అలౌకికం ఉపాయం యో గ్రంథో
> వేదయతి స వేదః, స హి అజ్ఞాతార్థజ్ఞాపకః'

అని తజ్ఞులు పలుకుచున్నారు.

'ధర్మము అనగా యజ్ఞయాగాది కర్మలను, పరమతత్త్వమగు బ్రహ్మమును ప్రతిపాదించుచు, ఇతరత్ర ప్రత్యక్ష అనుమానాది ప్రమాణములకు అనవగమ్యమును, ఇష్టానిష్టప్రాప్తిపరిహారకరమును నగు ఉపాయమును దెల్పు గ్రంథము వేదము' అని ఫలితాంశము.

ఇయ్యది మంత్రబ్రాహ్మణములుగ ద్విధావిభక్తము. 'మంత్రబ్రాహ్మణయోర్వేదనామధేయః'. సంహితా, బ్రాహ్మణ, ఆరణ్యక, ఉపనిషత్తులని మఱియొక విభజన. సంహితను మూలమొనర్చుకొని తక్కిన వన్నియు, ప్రతిసంహితకును బ్రాహ్మణ, ఆరణ్యక, ఉపనిషత్తులున్నవి. యథా: యజుస్సంహిత, యజుర్వేద బ్రాహ్మణము, యజురారణ్యకము, తైత్తిరీయ లేక నారాయణోపనిషత్తు. ఇట్లే తదితర సంహితలపట్ల కూడ అవగమ్యము.

వేదమంత్రములు చతుర్విధములు. అర్థానుసారము పాదములుగ విభజింపబడినవానిని 'ఋక్కు' లందురు. 'తేషాం ఋక్ యత్రార్థవశేన పాదవ్యవస్థా' (జై. సూ. ౨-౧-౩౫)

ఇవి గానసాపేక్షములైన సామములు—'గీతిషు సామాఖ్యా' (జై. సూ. ౨-౧-౩౬); మిగిలినవి అనగా గద్యాత్మకములు యజుస్సు. 'శేషే యజుఃశబ్దః' (జై. సూ. ౨-౧-౩౭) 'వృత్త - గీతవర్జితత్వేన ప్రశ్లిష్టపఠితాః, మంత్రా యజూంషి' వీటియందు పాదవిభజనగాని, గానవశ్యతగాని లేదు. మొదటివి ఛందోపూర్వకములగు మంత్రములు, రెండవవి గానపూర్వకములగు స్తవములు. మూడవవి యజ్ఞయాగాదుల వినియోజ్యములు, కాన, నిరుక్తకారుడు 'మంత్రా మననాత్, ఛందాంసి ఛాదనాత్, స్తోమః స్తవనాత్, యజుర్యజతేరితి' (ని.౭.౧౨) అని నిర్వచించి యున్నాడు. ఇవి యజ్ఞసమయమున ఋత్విక్, ఉద్గాత, అధ్వర్యులకు అవశ్యపఠనీయములు.

బహువిస్తృతమైన ఈ వేదరాశిని ఏ ఒక్కరును పఠింపజాలకున్నందువలన వ్యాసమహర్షి 'ఉద్ధృత్యావర్గశః చతస్రః సంహితాశ్చక్రే' ఫలతః, వేదవ్యాసనామమాయనకు ఆ చంద్రతారకముగ నిలచినది. ఆయన ఈ నాల్గుభాగములను పైల, వైశంపాయన, జైమిని, సుమంతులను శిష్యుల కొసంగెను. శిష్యపరంపరగ ఈ వేదము విభిన్నశాఖలను, పాఠభేదములను దాల్చినది. ఋక్కునకు ఇరువది యొక్కటి, యజుస్సునకు నూరు, సామమునకు వెయ్యి, అథర్వవేదమునకు తొమ్మిది శాఖలు నిలచినవి. అష్టాదశ మహాపురాణములకు ఉపపురాణములు, కొసరుగ స్థలపురాణములు వెలయునట్లు, ధనుః, పశు, గాంధర్వ, ఆయుర్వేదములను ఉపవేదములును, మహాభారతమను పంచమవేదము నిరూఢముగ ఒప్పుచున్నవి. యజుర్వేదము శుక్లకృష్ణములని ద్వివిధము. శుక్లయజుర్వేదమునకు కాణ్వశాఖ, మాధ్యందినశాఖ అను రెండు శాఖలున్నవి.

యజుర్వేదోత్పత్తి ఒకింత విచిత్రము. విద్యాగర్వితుడును, ప్రగల్భుడును అగు యాజ్ఞవల్క్యుని గాంచి, గురుడు తనకడ గ్రహించిన వేదముల ఇచ్చివేయుమనెనట. యాజ్ఞవల్క్యుడు వమనమొనర్చి వెడలగొట్టెను. అంత మహర్షులు వేదముల ఈ శోచనీయ

స్థితిని గాంచి తిత్తిరిపక్షుల రూపమును దాల్చి వాటిని గ్రహించిరి. అదియే కృష్ణయజుర్వేద తైత్తిరీయశాఖ. పిదప, యాజ్ఞవల్క్యుడు,

యోఽనధీత్య ద్విజో వేదా నన్యత్ర కురుతే శ్రమమ్,
స జీవన్నేవ శూద్రత్వ మాశు గచ్ఛతి సాన్వయః.

అని యుండుటవలన, వేదప్రాప్తికై సూర్యుని ప్రార్థించెను. ఆయన అశ్వరూపమును ధరించి యాజ్ఞవల్క్యునకు వేదమును జెప్పెను. ఇదియే శుక్లయజుర్వేద వాజసనేయసంహిత. ఇట్లే ప్రతి వేద భాగముయొక్క ఆవిష్కృతిని గురించి సాయనాచార్యులవారు తమ వేదార్థ ప్రకాశికయను భాష్యమున కథల నుదాహరించిరి.

అందు కృష్ణయజుః తైత్తిరీయ సంహితా, శుక్లయజుర్వేద కాణ్వ సంహితా, ఋక్సంహితా, అథర్వసంహితా, తైత్తిరీయ బ్రాహ్మణ, ఆరణ్యక, ఐతరేయ బ్రాహ్మణ, ఆరణ్యకములకును, సామవేద సంహితా, తత్సంయుక్తములగు తాండ్య, షడ్వింశ, సామ విధాన, ఆర్షేయ, దేవతాధ్యాయ, ఉపనిషద్ సంహితోపనిషద్, వంశబ్రాహ్మణములకును, శుక్ల యజుర్వేదాంతర్గతమగు శతపథ బ్రాహ్మణమునకును, సాయనాచార్యులవారు భాష్య మొనర్చి వేదార్థమును బ్రకాశితమొనర్చిరి. ఉవ్వట, మహీధరులనువారు శుక్ల యజుస్సంహితకు భాష్యమునుగూర్చిరి. వీరుగాక, వేదభాష్య కర్తలగు మాధవులు ముగ్గు రగుపడుచున్నారు. వారిభాష్యములు అల్పములు, అసమగ్రములు, అప్రసిద్ధములు.

ఇఁక లబ్ధములగు ఉపనిషత్తు లన్నిటిపైని – ఇవి ప్రాయికముగ నూట పదునెనిమిది – శ్రీ ఉపనిషద్బ్రహ్మయోగీంద్రులవారు విరచించియున్నారు; ఆంశికముగ శంకరానంద నారాయణయతీంద్రులు. ముఖ్యములగు దశోపనిషత్తులపై త్రిమతాచార్యులగు శంకర, రామానుజ, మాధ్వ ఆచార్యులభాష్యములు, తచ్ఛిష్య ప్రశిష్య విరచితములగు టీకా, వివరణ వార్తికములును వెలయుచు గీర్వాణ వాణిని పుష్టి నొందించుచున్నవి. వీటి కన్నింటికిని ఆంగ్ల, జర్మన్,

ఫ్రెంచిమున్నగు విదేశభాషలలోను, హిందీ, వంగ కేరళాది స్వదేశ భాషలలోను — తెలుగున తప్ప — అనువాదములు వెలయుచున్నవి.

౨

వేదము సంహితా, బ్రాహ్మణ, అరణ్యక, ఉపనిషదాత్మక మని పైని నుడివియుంటిని. సంహితయందు సూక్తము లనబడు మంత్ర సమిష్టు లున్నవి. ప్రతిమంత్రమునకు ఋషి, దేవత, ఛందస్సులున్నవి. ఋషియన ఆవిష్కరించిన ఆయన, ప్రణేత కాదు. ఈ మంత్రముల నెప్పు డేవిధముగ ప్రయోగింపవలసినది తెల్పునది బ్రాహ్మణము. ఇయ్యది ఇతిహాస, పురాణ, విద్యా, ఉపనిషద్ శ్లోక, సూత్ర అను వాఖ్యాన వ్యాఖ్యానమని అష్టధాభిన్నము.

'భృగుర్వై ర్వాణి' ఇత్యాదులు ఇతిహాసము. ఇట కథ చెప్పబడుచున్నది. 'యతో వా ఇమాని' అనుతీరుగ నుండు సృష్టి ప్రతిపాదక వాక్యములు పురాణము. 'య ఏవమేతా మహాసంహితావ్యాఖ్యాతా వేద' ఇత్యాది ఉపాసనలు విద్య. రహస్యార్థ బోధకములు ఉపనిషత్తులు. శ్లోకములు అచ్చటచ్చట ఉదాహరింప బడినవి, 'ఏతే శ్లోకా భవంతి' అనుచు. 'బ్రహ్మవిదాప్నోతి పరం' — ఇయ్యది సూత్రము. 'సత్యంజ్ఞానం బ్రహ్మ' అనునది అనువాఖ్యానము: సూత్రకథితమగు బ్రహ్మమును నిర్వచించుచున్నది. ఈ అర్థమును స్పష్టీకరించుటయే వ్యాఖ్యానము.

ఆరణ్యకములందు ఉపాసనలును, ఉపనిషత్తుల జ్ఞానమును, సంహితా బ్రాహ్మణముల కర్మలును జెప్పబడియున్నవి. అందువలన వేదము కర్మ, ఉపాసనా, జ్ఞానకాండలను పేరిటగూడ త్రిధావిభక్తము. ఇట కర్మ యన ఇంద్రాదిదేవతల నుద్దేశించి అగ్నియందు పురోడాశాదుల, మంత్రోచ్చారణ పూర్వకముగ నర్పించుట. అది పదమున, నర, పశు ద్రవ్యములు గ్రాహ్యములు. జీవ, బ్రహ్మముల పరస్పర ఉపాసక ఉపాస్యభావదర్శనము, ఉపాసన. ఉభయుల అభేద

బుద్ధి, జ్ఞానము. ఈ వేదరాశిని గ్రహింప, శిక్షా, కల్ప, వ్యాకరణ, నిరుక్త, ఛందో జ్యోతిషము లను షడంగములు అవసరము.

శిక్షయన ఉచ్చారణ. కల్పమన యజ్ఞాదిప్రయోగ వివరణము లగు సూత్రగ్రంథములు. ఇవి శ్రౌత, గృహ్యధర్మ, సూత్రములను అత్యంత విస్తృత వాఙ్మయము; వాటి ననుసరించియే తర్వాత ఛందోబద్ధములగు మనుస్మృత్యాది గ్రంథములు నిర్మింపఁబడినవి. వ్యాకరణము భాషాన్వయ బోధకము; ఇది లౌకిక వ్యాకరణముకంటె అన్యము. 'ప్రతిసఖ్యము' అనుపేరిట ప్రతివేదశాఖ కొక్కొక్క వ్యాకరణ మున్నది. నిరుక్తమన నిఘంటువు. ఛందస్సు గణాదిపరము. జ్యోతిషము ఏఏ కర్మల, ఏఏ తిథినక్షత్రముల నాచరింపవలసినది నిర్దేశించునది.

ఈ వేదరాశియొక్క అర్థ పరిష్కృతియే మీమాంసా దర్శనము. ఇది ఇరువది అధ్యాయములతో నొప్పుబృహచ్ఛాస్త్రము. అందు, ద్వాదశ లక్షణి యనంబడు పూర్వ మీమాంసయందు పది రెండు అధ్యాయములు కర్మకాండాపరములు. సంకర్షణకాండ అనబడు ఉపాసనాకాండ సంబంధీయమగు 'మధ్య - మీమాంస' అధునా విలుప్తము. జ్ఞానకాండను సమన్వయించు ఉత్తర - మీమాంస అను వేదాంత సూత్రములు నాలుగు అధ్యాయముల గ్రంథము.

3

ప్రస్తుత మీవ్యాస విషయమైన పూర్వ మీమాంసను గుఱించి, ఆలోచింతును.

పూర్వమీమాంసాసూత్ర ప్రణేత మహర్షి జైమిని. ఇందు ౧౨ అధ్యాయములు, ౬౦ పాదములు, ౯౯౭ అధికరణములు, ౨౭౩౫ సూత్రములు ఉన్నవి.

సూత్ర మన:—

'స్వల్పాక్షరమసందిగ్ధం సారవత్ సర్వతో ముఖమ్,
అస్తోభమనవద్యంచ సూత్రం సూత్రవిదో విదుః'

అని నిర్వచనము. కాని, స్వల్పాక్షరయుతముగనొనర్చుట యందే సూత్రకారులు సామాన్యముగ తమశక్తిని జూపి, బహువిధ భేద కారణములగు భాష్యములకు గారకులైరి.

అధికరణ మన:—

' విషయో విషయశ్చైవ పూర్వపక్షస్తథోత్తరః,
సిద్ధాంతశ్చ ఇతి పంచాంగం శాస్త్రేధికరణం స్మృతమ్ '

ఈ జైమినీయసూత్రములపై పాణిని గురువగు ఉపవర్షాచార్యులు 'వృత్తి' ని విలిఖించెనని వినికి. కాని ప్రస్తుత మది అలబ్ధము. శబర - భాష్యము అత్యంతప్రామాణికమగు గ్రంథము. మఱియు, కుమారిల భట్టు విరచితములగు శ్లోక, తంత్ర వార్తికములను గ్రంథములును సాయనాచార్యప్రోక్తమగు 'న్యాయమాల' అను గ్రంథమును, పార్థసారథి మిశ్రవిరచితమగు 'శాస్త్రదీపిక' అను గ్రంథమును పండిత సమాజమున విశేష సమాదరమును బడయుచున్నవి. ఆపదేవవిరచితమగు న్యాయప్రకాశము, లౌగాక్షిభాస్కరవిరచితమగు అర్థసంగ్రహము అను గ్రంథమును ఈ శాస్త్రమునకు అనుక్రమణికలు. ఈ గ్రంథములన్నింటిపైని ఏకాధికముగ టీకలున్నవి,

జైమినీయసూత్రములు పదిరెండు అధ్యాయముల గ్రంథమనికదా చెప్పియుంటిని. ప్రథమాధ్యాయమున విద్యాదుల ప్రమాణము నిరూపితము ద్వితీయాధ్యాయమున కర్మభేదములును తర్వాత క్రమముగ కర్మల అంగాంగిభావము, హోమపదార్థముల పరిమాణము, అనుష్ఠానవిధానము, కర్మఫల భోక్తృత్వ విధానము, ప్రకృతి వికృతుల అతిదేశము, విశేషాతిదేశము, అధ్యాహారము, వికృతి బాధలు, ప్రకృత్యనుష్ఠానమున వికృతిఫలప్రాప్తి, ఉపకార్యోపకారక భావములు చర్చింపబడినవి. ఇవన్నియును క్రియాపరములు.

వేదవాక్యములు, విధి, మంత్ర, నామధేయ, నిషేధ, అర్థవాదములని పంచవిధములు,

౪

అందు అజ్ఞాతార్థజ్ఞాపక మగునది విధి. ఇది ప్రత్యక్ష అనుమాన ప్రమాణానవగమ్యము. స్వర్గకాంక్షికి 'అగ్నిహోత్రం జుహుయాత్స్వర్గ కామః' అను విధివినా గత్యంతరము లేదు. ఇతరత్ర అప్రాప్తము. ఈ విధి కర్మబోధకము. అన్యత్ర కర్మ గ్రాహ్యమైన పిదప గానవచ్చు 'దధ్నాజుహోతి' ఇత్యాదులు గుణపరము లనంబడుచున్నవి. హోమ పదార్థబోధకములగు 'సోమేన యజేత' ఇత్యాది విధులు విశిష్టములనంబడు చున్నవి

ఈ విధి ఉత్పత్తివిధి, వినియోగవిధి, అధికారవిధి, ప్రయోగ విధి అని నాల్గువిధములు.

అందు కేవలము కర్మ స్వరూపమాత్ర బోధకములు ఉత్పత్తి విధులు. 'అగ్నిహోత్రమును ఒనరించునది' ఇత్యాదులు.

యజ్ఞాంగములగు ద్రవ్యదేవతాదులను ప్రధానముగ నుడువు నది 'వినియోగవిధి'. యథా 'దధ్నాజుహోతి'. ఇట 'దధితో హోమమొనర్చునది' అనియుంటజేసి ఏద్రవ్యము యజ్ఞాంగమైనదియు తెలియుచున్నది.

ఈ వినియోగవిధికి సహకారభూతము లైన ప్రమాణములు ఆరు. అవి : శ్రుతి, లింగ, వాక్య, ప్రకరణ, స్థాన, సమాఖ్యలు.

అందు ప్రమాణాంతర నిరపేక్షమగు శబ్దము శ్రుతి. ఇయ్యది మరల విధాత్రి, అభిధాత్రి, వినియోక్త్రి అని త్రివిధము. మొదటి దానియందు 'యజేత' ఇత్యాది రూపకమగు 'లింగ్' ప్రత్యయ ముండును రెండవదానియందు యజ్ఞాంగ ద్రవ్యములగు వ్రీహియ వాదుల ఉల్లేఖ ముండును. మూడవ దానియందు వినియోజ్య వినియోజకభావముండును. చివరిదగు 'వినియోక్త్రి శ్రుతి' విభక్తి రూపము, ఏకాభిదానరూపము, ఏకపదరూపము అని మూడువిధ ములు. 'వ్రీహిభిర్యజేత' అనునదివిభక్తి – శ్రుతి. ఇటనున్న

తృతీయావిభక్తి యాగాంగత్వమును సూచించుచున్నది. 'పశునా యజేత' అనునది ఏకాభిధానము. 'యజేత' అనునది ఏకపదరూపము.

శబ్దసామర్థ్యము లింగము. సమభివ్యవహారము వాక్యము. ఆకాంక్షాయుతమగునది ప్రకరణము. ఇయ్యది మహాప్రకరణము అవాంతరప్రకరణము అని ద్వివిధము. దేశసామాన్యము స్థానము; ఇయ్యది పాఠసాదేశ్య, అనుష్ఠాన సాదేశ్యమని రెండువిధములు. సన్నిధిపాఠము సంఖ్యపాఠమని కూడ రెండురీతులు దీనికున్నవి. సమాఖ్యయన యౌగికశబ్దము; ఇయ్యది వైదికము, లౌకికమని ద్వివిధము.

ఇట్లు శ్రుత్యాది షట్ప్రమాణములతో నొప్పువినియోగవిధికి సిద్ధిరూపము, అసిద్ధిరూపము అను రెండు అంగములున్నవి.

ప్రయోగమును చక్కగ తెల్పునది ప్రయోగవిధి. దీనికికూడ శ్రుతి, అర్థ, పాఠ, స్థాన, ముఖ్య, ప్రవృత్తులను ఆరుప్రమాణము లున్నవి.

కర్మఫలాధికారిని దెల్పునది 'అధికారవిధి' యథా: 'స్వర్గ కామో అగ్ని హోత్రం జుహుయాత్' ఇత్యాదులు. ఇట అగ్ని హోత్ర యాగాధికారి నిర్వచన మున్నది.

స్థూలముగ జెప్పవలసిన పైనజెప్పబడిన విభజన శాబ్దికము. అర్థానుసారము విధి అపూర్వ విధి, నియమవిధి, పరిసంఖ్యావిధి అని త్రివిధము.

ప్రమాణాంతర అప్రాప్తమగునది 'అపూర్వవిధి'. 'వ్రీహీన వహంతి' అనునది నియమవిధి. తండులార్థము వ్రీహిధాన్యములను దంపవలె ననునది లోకప్రాప్తము; అందఱికిని దెలిసియేయున్నది. కాని అయా యాగసాపేక్షముగ ఈవిషయమును చెప్పిన 'నియమవిధి' యగుచున్నది. 'పంచపంచనఖాభక్ష్యాః' అనునది పరిసంఖ్యావిధి. మాంసభక్షణము రాగతః లోకప్రాప్తము; ఈభక్షణాసక్తిని కొంత మట్టుకు నియమించి, హ్రాస్వీకరించునది పరిసంఖ్యావిధి. మాంసమును

సంపూర్ణముగ వలజాలకున్న పంచనఖయుతములగు శశకాది పంచనఖజంతువుల మాంసమును భక్షింప ఈశ్రుతి ఆదేశించుచున్నది.

౫

యాగనామమును సూచించునది నామధేయము. 'ఉద్భిధా యజేత - ఇచ్చట ఉద్భిద్యాగనామము లభ్యమగుచున్నది.

'న కలంజం భక్షయేత్' ఇత్యాది నివర్తకవాక్యములు నిషేధములనంబడుచున్నవి. కలంజమును భక్షింప గూడదను సంగతి ఒక్క వేదమువలననే తెలియనగును.

నిందాప్రశస్త పరములగు వాక్యములు అర్థవాదములు; ఇవి విధిశేషము, నిషేధశేషము అని రెండు విధములు. వాయవీయ యాగమున 'వాయవీయం పశుమాలభేత' వాయవీయ పశువును సంపాదించునది అని చెప్పబడియున్నది. ఇట వాయువును ప్రశంసించుచు, ప్రరోచనార్థము జెప్పబడు వాక్యము 'వాయుర్వై క్షేపిష్ఠా దేవతా' అనునది విధిశేషము. 'వాయవీయం పశుమాలభేత' అనునది విధివాక్యమని అవగంతవ్యము. 'న బర్హిషి రజతం దేయం' - బర్హి అను యజ్ఞపాత్రయందు రజతమునుంపవలదు - ఈ వాక్యము నిషేధ రూపకమగు విధి. నిషేధితకర్మను నివారింప, నిందించు 'సోఽరోదీద్యదరోదీత్తద్రుద్రస్య రుద్రత్వమ్' - రుద్రుడు రజతము నుంచి రోదించి, రుద్రుడైనాడు అనువాక్యము నిషేధశేషము.

ఈ అర్థవాదము గుణవాదము, అనువాదము, భూతార్థవాదము అని మూడు తెఱగులు.

ప్రమాణాంతర విరోధమగు అర్థవాదము 'గుణవాదము' 'ఆదిత్యోయూపః' యూపము ఆదిత్యుడు. యూపమన బలినొసగబడు పశువును బంధించు ఖదిర కాష్ఠము; ఇది ఆదిత్యుడని జెప్పబడుచున్నది. ఖదిర కాష్ఠము సూర్యుడు కాదే! అయినను దాని మహాత్మ్య

సూచకముగ, లోకసత్యవిరుద్ధమైనను చెప్పబడినది. ఇట్టివాక్యములు గుణవాదము లనంబడును.

ప్రమాణాంతర - అర్థబోధకమగునది అనువాదము. 'అగ్నిర్హిమస్య భేషజమ్' - ఇట అగ్నిమంచుకు విరుగుడు అని చెప్పబడినది. ఇది మన నిత్యానుభవమే కదా; చలిని దీర్చుకొన నిప్పుకడకు బోని వాడెవఁడు ? ఈ విషయము లోకముననే దెలియబడుచున్నది. దీనిని దెల్ప, వేదముయొక్క అవసరము లేదు. ఇట్టి ప్రాప్తానువాద వాక్యములను 'అనువాదమందురు'.

ప్రమాణాంతర - విరోధరహితమగునది 'భూతార్థవాదము.' 'వజ్రహస్తః పురందరః' ఇంద్రుడు వజ్రహస్తుడు. ఈ విషయమును, మనము అన్యప్రమాణమువలన నిరాకరింపజాలము. ఏలయన, ఇంద్రునిచేత వజ్రమున్నది లేనిది మనము చూడలేదు. నిరాకరించుటకుముందు చూడవలెను గదా; చూచి వచ్చువఱకు ఇది అబాధితము. ఇట్టి వాక్యములు భూతార్థవాదములు.

ఇది మీమాంసకుల వేద విభజన.

౬

పూర్వ మీమాంసకులు నిత్య - ప్రళయమగు సుషుప్తినిగాక ఇతర విధములగు నైమిత్తిక, అవాంతర, మహాప్రళయముల నంగీకరింపరు. అందువలన వీరికి సృష్ట్యాది, సృష్టి ధ్వంసము అనునవి లేవు. ఫలతః జగత్తునిత్యము. మంత్రములు గాక వేరొక ఈశ్వరునిగాని దేవతనుగాని ఒప్పుకొనరు. మంత్రమే దేవత. కాకున్న, ఇంద్రుని ఘటమున ఆహ్వానించినప్పుడు ఐరావతయుతముగ వాస్తవముగ అతడరుదెంచిన, ఘటము ముక్కలు చెక్కలు కావలసివచ్చును. వీరు శరీరసహితులైన విభిన్నస్థానముల ఒకే సమయమున సల్పు యజ్ఞముల ఆహుతిని గ్రహింప అశక్యము. ఇవి వారు చూపు ఉపపత్తులు. ఇది సనాతన - మీమాంసకులమాట. తరువాతివారు 'యత్కారోషి యద

శ్నాసి' అను గీతా శ్లోకము నుదాహరించుచు, భగవత్పరముగ కర్మల నొనర్చ ఆదేశించి యున్నారు. బహుశః కర్మమయమును జడవాదమును నగు ఈదర్శనము విలుప్తము కాకుండ నుంచుటకే ఈ ఈశ్వర గ్రహణము అని తోచుచున్నది.

ఈశ్వరుని ఒప్పుకొనకపోయినను వారు ఆస్తికులే. ఆ కాలమున నాస్తికుడన వేదమును, పరలోకమును ఒప్పుకొననివాడు. తక్కినవారు ఆస్తికులు. ఈ విభజన ననుసరించి, ఈశ్వరరహితములగు సాంఖ్య, మీమాంసాదర్శనములు ఆస్తికదర్శనములు. బౌద్ధజైన్యాది వేదనిందక దర్శనములు నాస్తికములు. ఇచ్చట వేదము, పరలోకములపై విశ్వాసమే ముఖ్యమని గమనించునది. కాని, ప్రస్తుతము మన ఆస్తిక నాస్తికత్వములు ఈశ్వరగ్రహణాగ్రహణములపై నిర్భర పడుచున్నవి.

వీరి 'అపూర్వము' ఒక అపూర్వవస్తువు. యజ్ఞాది కర్మల నొనర్చ, తయారగు పుణ్యమే ఇయ్యది. దీనివలన, కర్మి ఇహమునగాని, పరమునగాని సుఖమునందును.

వీరి మతమున నిత్యనైమిత్తిక కర్మలు అవశ్యమాచరణీయములు. ఆచరింపకున్న ప్రత్యవాయమగును. ప్రత్యవాయ మన, స్థూలముగ పాపము. ఆచరించిన పుణ్యములేదు. నిషిద్ధకర్మాచరణమున పాపము కల్గును. ప్రాయశ్చిత్త కర్మల పాపక్షయమగును. కామ్య కర్మ ఇచ్ఛ ననుసరించి.

కర్మత్యాగమును వీరు ఒప్పరు. నిషిద్ధకర్మల గాక తక్కిన నిత్యాదికర్మల మరణ పర్యంతము ఆచరించుచుండుటయే వీ రొసగు ఉపదేశము.

వీరు పొందగోరునది, వైదిక కర్మల చరమలక్ష్యమగు బ్రహ్మలోక మనబడు ముక్తి. ఇట బ్రహ్మలోక మన పురాణ వర్ణితమగు, బ్రహ్మలోకము కాదు; సుఖవిశేషము. ఇదియే వారి అమృతత్వము, 'అపామసోమ అమృతాబభూమ'.

వీరు ప్రత్యక్ష, అనుమాన, శబ్ద, ఉపమాన, అర్థాపత్తి, అనుపలబ్ధి ప్రమాణముల గ్రహించిరి. ఈ దార్శనికుల నడుమ భాట్ట, ప్రభాకరుల మతములు రెండున్నవి. భాట్టులు అనుపలబ్ధిని అంగీకరింపరు. వీటిలో శబ్దప్రమాణము అనగా వేదమే ముఖ్యము.

వేదముయొక్క నిత్యత్వమును, శబ్దముయొక్క నిత్యత్వమును స్థాపింప వీరు జూపిన ప్రతిభ అత్యంత విస్మయకరము. వీరి వేద విభజన ప్రణాళిక ననుసరించియే ఎల్లయెడల వేదము అధ్యయన మొనర్పబడుచున్నది. ఈ విభజనపట్లగూడ వీరి ఓపిక, బుద్ధినైశిత్యము, భయావహములు. వేదాంతులు, తదితర దార్శనికులు ఈ ప్రణాళి ననుసరించియే వేదముల నర్థమొనర్చి, తమతమ మతముల స్థాపింప యత్నించిరి. ఈ దర్శనముయొక్క చరమ సిద్ధాంతములు అందఱకు నచ్చకపోయిన నచ్చకపోవచ్చును గాని, వీరికి పరమ పూజ్యమగు వేదమెట్లు వీరి సమాజమును కాపాడినది గమనింపదగి యున్నది.

యస్య నిశ్వసితం వేదా యో వేదేభ్యోఽఖిలం జగత్,
నిర్మమే తమహం వందే విద్యాతీర్థమహేశ్వరమ్.

---

# వేదాంత దర్శనము : అద్వైతవాదము

## (శాంకరమతము)

'నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే' —గీత, 3-౪౨

### ౧

ప్రస్థానత్రయాంతర్గతమగు న్యాయప్రస్థానమునకు జెందిన వేదాంతదర్శనము (సూత్రము)ను రచించినది వ్యాసుడు. దశోపనిషత్తులు, గీతలు, వేదాంత - సూత్రములు గలసి ప్రస్థానత్రయమనంబడుచున్నవి. ఉపనిషత్తులు శ్రుతిప్రస్థానము, గీతస్మృతిప్రస్థానము, వేదాంత-సూత్రములు న్యాయప్రస్థానము. జీవుడు వీటి సాయమున ఇహలోకమునుండి ప్రస్థానమొనర్చునుకాన ఈ సంజ్ఞ.

ఈ సూత్రగ్రంథమున నాల్గు అధ్యాయములు, పదునారు పాదములు, ౫౫౫ సూత్రములు ఉన్నవి. అందు మొదటి అధ్యాయమున పరస్పర-విరుద్ధములగు శ్రుతులు సమన్వయింపబడినవి. రెండవ అధ్యాయము పరమతఖండనమునకు ఉపయోగింపబడినది. తృతీయాధ్యాయమున సాధనోపదేశము; చతుర్థాధ్యాయమున తత్ఫలమగు ముక్తి వర్ణింపఁబడినది.[౧]

వ్యాసశబ్దము తటస్థమైన అన్నితావుల వాఙ్మయ-చారిత్రకులు ఇదమిత్థమని నిర్ణయింపజాలకున్నారు. వ్యాసకర్తృకములని ఎన్న బడు గ్రంథము లన్నియును కర్తృత్వవిషయమున వివాదాస్పదములు. వ్యాసుడొకడా? లేక పలువురా? ఒకడే యగుచో పరస్పర విరుద్ధము

---

౧. ఈ సూత్రము లన్నిటియొక్క-సారము నెరుగగోరువారు భారతీతీర్థకృతమగు 'వైయాసిక న్యాయమాల' అను గ్రంథమును గాంచనగును.

లగు ఇన్ని గ్రంథములను వ్రాయుట సంభవమా? కానిచో, ఎవరు ఏ గ్రంథమును ఎప్పుడు వ్రాసినారు? అను ప్రశ్న లనివార్యములు. వ్యాసనామము ఏ ఒక్కరిదియు కాదనియు, 'శంకరస్వామి' 'హామ్లెట్ లారియెట్' మున్నగు శబ్దములవలె వ్యాపకపద మనియు చాలమంది అభిప్రాయము. యోగవాసిష్ఠకారుడు కూడ వ్యాసులు పెక్కుమంది అని పేర్కొను చున్నాడు.[౩] బాదరాయణవ్యాసుడే సూత్రరచయిత యని చాలమంది అభిప్రాయ పడుచున్నారు.

వేదాంతశబ్దమునకు (వేద + అంత) వేదముల తుదిభాగ మని అర్థము. తుదిభాగము అన ఉపనిషత్తులు. ఈ ఉపనిషత్తులలో ఇతస్తతముగ చెప్పబడిన విషయములను సమన్వయపరచుటకై వేదాంత - సూత్రములు యత్నించుచున్నవి.

వ్యాసునకు పూర్వము జైమిని, అశ్మరథ్య (విశిష్టాద్వైతి), బాదరి (అద్వైతి), బాదరాయణ, ఔడులోమి (భేదాభేదవాది), కాశకృత్స్న (అద్వైతవాది) కార్ష్ణాజిని, (అద్వైతవాది) ఆత్రేయ (పూర్వమీమాంసకుడు) లను ఆచార్యులిట్టియత్నమునే సల్పియుండిరని వేదాంతసూత్రముల వలన దెలియవచ్చుచున్నది. కాని వారి గ్రంథము లెవ్వియును గానరావు. ఉపవర్ష, ద్రమిడ, బోధాయనాదులవృత్తు లున్నట్లుగూడ వినికి; ఇవి ప్రస్తుత మలబ్ధములు.

---

౨. వ్యాసుని గ్రంథములు : (౧) వేదవిభజన (౨) వేదాంత-సూత్రములు (౩) మహా-భారతము. (౪) ౧. బ్రహ్మ ౨. పద్మ ౩. విష్ణు ౪. శివ. ౫. భాగవత ౬. బృహన్నారదీయ ౭. మార్కండేయ ౮. అగ్ని ౯. భవిష్యత్ ౧౦. బ్రహ్మ-వైవర్త ౧౧. లింగ ౧౨ వరాహ ౧౩. స్కాంద ౧౪. వామన ౧౫. కూర్మ ౧౬. మత్స్య ౧౭. గరుడ ౧౮. బ్రహ్మాండాది పురాణములు, (౫) ౧. నందికేశ్వర ౨. శుక్ర ౩. వసిష్ఠ ౪. దేవీభాగవత ౫. మను ౬. వాయు ౭. మహేశ ౮. కల్కి ౯. శైవ ౧౦. ఆదిత్య ౧౧. ఆది ౧౨. శంభు ౧౩. వసిష్ఠలింగ ౧౪. బృహద్ధర్మ ౧౫. ధర్మ ౧౬. గౌరి ౧౭. గణేశ ౧౮. నీల ౧౯. కాళీ ౨౦. దేవీయను ఉపపురాణములు. ౬. యోగసూత్రభాష్యము ౭. వ్యాస-స్మృతి.

౩. చూడుడు యోగవాసిష్ఠ - ముముక్షు వ్యవహార ప్రకరణము. సర్గ ౩ శ్లో. ౨౧ మదనూదిత వ్యాసాశ్రమ సంస్కరణము. పుట. ౧౮౫.

౨

భారతదేశమునం దంతటను ఈ గ్రంథము నిర్వివాదముగ ప్రామాణికముగ అంగీకరింపబడినది. సూత్రములు సంక్షిప్తములును, అస్పష్టార్థములును అగుటవలన తరువాతివారగు ఆచార్యులందరును తమ తమ మతముల సమర్థించుకొనుచు, వేర్వేరుభాష్యముల వ్రాసి, అసలు వ్యాసుని అభిప్రాయ మేమైనదీ కనుగొన వీలులేకుండజేసిరి. అయినను, దీని మీద అనేకములగు భాష్యములు, వార్తికములు, టీకలు, టీకలపై టీకలు, ప్రకరణగ్రంథములు ఉండి, 'వేదాంత సూత్ర - వాఙ్మయము' అని వేరుగ పేర్కొనబడదగినంత విస్తృత సాహిత్యమును సృష్టించి, గీర్వాణవాణి కంగపుష్టిని గలిగించుచున్నవి. దీనినవలంబించి ఏర్పడిన, ముఖ్యములగు సంప్రదాయములు పదిరెండు. అవి ఏవన: ౧. ఆచార్యశంకరుని కేవలాద్వైతము ౨. ఆచార్య రామానుజుని విశిష్టాద్వైతవాదము 3. మధ్వాచార్యుని ద్వైతవాదము ౪. శ్రీకంఠశివాచార్యుని శైవ విశిష్టాద్వైతవాదము ౫. వల్లభాచార్యుని శుద్ధాద్వైతవాదము ౬. నింబార్కుని ద్వైతాద్వైతవాదము ౭. విజ్ఞానభిక్షుని సమన్వయవాదము ౮. అభినవగుప్తుని స్పందవాదము ౯. బలదేవవిద్యాభూషణుని అచింత్యభేదాభేదవాదము ౧౦. భాస్కరాచార్యుని భేదాభేదవాదము ౧౧. శ్రీకరాచార్యుని శైవాద్వైతవాదము ౧౨. నీలకంఠుని శైవవిశిష్టాద్వైత వాదములు.

కాని వీటినన్నిటిని నాల్గు ముఖ్యభాగములక్రింద చేర్పవచ్చును. ౧. కేవలాద్వైతము (Non-Dualism) ౨. విశిష్టాద్వైతము (Qualified Monism) 3. ద్వైతవాదము (Dualism) ౪. ద్వైతాద్వైతవాదము (Dualism in Non-Dualism). అందు, శంకరునిది కేవలాద్వైతవాదమనియు, రామానుజ, శ్రీకంఠ, నీలకంఠ, శ్రీకర, అభినవగుప్త, వల్లభులవి విశిష్టాద్వైతము లనియు, మధ్వ, బలదేవులవి ద్వైతవాదము లనియు, భాస్కర, నింబార్క, విజ్ఞాన భిక్షులవి ద్వైతాద్వైతవాదము లనియు గ్రహింపనగును.

నవీనులలో రాజారామమోహన్‌రాయి, బ్రహ్మ సూత్రము లను తాను స్థాపించిన బ్రహ్మసమాజ మతపరముగ వ్యాఖ్యాన మొనర్చినట్లు వినికి. మఱియొక అత్యంతాధునికభాష్యము వెలువడి నది. దానిపేరు శక్తిభాష్యము; శక్తిపరమగు అన్వయము. రచయిత: వంగదేశమందలి భట్టుపల్లి నివాసియగు పంచానన తర్కరత్న మహా శయులు.

భారతి, పురి, సరస్వతి, గిరి, వన, అరణ్య తీర్థ మున్నగు దశవిధనామధారులై, 'దశనామి' సంప్రదాయ మనబడు సన్యాసులు, తదితరజ్ఞానులు శంకరుని అనుసరించుచున్నారు. బ్రహ్మసంప్రదాయ మనబడు మధ్వసంప్రదాయము ననుసరించువారు పెక్కుమంది కన్నడ దేశమున నున్నారు. ఏతత్-సంప్రదాయాంతర్గతమును, భగవాన్ శ్రీకృష్ణచైతన్య ప్రవర్తితమును నగు గౌడీయ-వైష్ణవమతము ననుస రించువారు బంగాళా, ఒరిస్సా దేశమున నున్నారు. శ్రీ సంప్రదాయ మనబడు వైష్ణవ-మతము ననుసరించు వారు పెక్కుమంది దక్షిణ దేశమున నున్నారు. సనకాది సంప్రదాయమనబడు నింబార్క - వైష్ణవమతస్థులు బృందావనప్రాంతముల నున్నారు. మఱి, గుజరాత్- బొంబాయి ప్రాంతముల రుద్రాదిసంప్రదాయమనబడు వల్లభమతస్థు లున్నారు. దక్షిణదేశమందలి శైవులలో శ్రీకంఠ, నీలకంఠ, శ్రీకరు (వీరశైవులు)ల ననుసరించువా రున్నారు. కాశ్మీరమునందలి జ్ఞాన మార్గులు, అభినవగుప్తుని అనుసరించుచున్నారు - వీరిది కాశ్మీర శైవమత మనబడుచున్నది.

భాషావిషయికముగ జెప్పబూనికొనిన; శంకరుడు మళయాళ దేశస్థుడు. రామానుజుడు తమిళనాటివాడు. మధ్వాచార్యులు కన్నడి. నింబార్క, వల్లభులు ఆంధ్రులు. బలదేవుడు వంగీయుడు. శ్రీకంఠ, నీలకంఠ, శ్రీకరులు తెలుగువారో లేక కన్నడులో అయియుందురు.

# 3

ఈ వ్యాసమున శంకరుని అద్వైత - వాదము వివరింపబడు చున్నది. తదితరవాదములు అన్యత్ర ప్రసంగింపబడును; తారతమ్యములుగూడ జూపగలము.

సూత్రకారుని అనంతరము వినవచ్చు ప్రధాన ఆచార్యుని నామము గౌడపాదుడు. ఆయన శిష్యుడు గోవిందపాదుడు. తరువాతివాడు జగత్ప్రసిద్ధుని గన్న శంకరుడు.

ఈయన కేరళదేశమందలి కాలడియను గ్రామమున జన్మించి, స్వల్పకాలముననే శాస్త్రముల నన్నింటిని సమగ్రముగ గ్రహించి, లోకసంగ్రహార్థమై సన్యసించి, అద్వైతవాదమును భారతదేశమునందంతటను వ్యాపింపజేసెను. ఈయన క్రీ. శ. ౭౮౮ లో జన్మించి, క్రీ. శ. ౮౨౦ లో తిరోభావము నందెను. ఈయన జీవితమున కీసంక్షిప్త ప్రబంధమున తావుచాలదు. కాని, ఆయనను గురించి సోదరి నివేదిత వచించిన పలుకుల జూపుచున్నాను. *

శంకరుడు మనినది స్వల్పకాలమే యైనను, ఆసేతుహిమాచలము పరిభ్రమించి, అవైదిక మతముల ఖండించి, అద్వైతమును స్థాపించినాడు. ఏతన్మత ప్రచారార్థము దక్షిణమున శృంగేరియందు

---

*' Western people can hardly imagine a personality such as that of Sankara. In the course of so few years, to have nominated the founders of no less than ten great religious orders, of which four have fully retained their prestige to the present day; to have acquired such a mass of Sanskrit learning as to create a distinct philosophy, and impress himself on the scholarly imagination of India in a prominence that twelve hundred years have not sufficed to shake to have written poems whose grandeur makes them unmistakable even to the foreign and unlearned ear; and at the same time to have lived with his disciples in all the radiant joy and simple path of the saints—that is greatness we may appreciate, but cannot understand. We contemplate with wonder and delight the devotion of Francis of Assisi, the intellect of Abelard, the force and freedom of Martin Luther, and the political efficiancy of Ignatius Layola; but who could imagine all these united in one person ?'

శారదా మఠమును, పూరీ జగన్నాథమున గోవర్ధన మఠమును హిమాలయములందలి కేదారనాథమున జ్యోతి (జ్యోషి) మఠమును, ద్వారకయందు సరస్వతీ మఠమును స్థాపించెను. ఈ మఠములందలి సన్యాసుల పూర్వోక్తములగు దశవిధనామముల ధరింపజేసి, వేద మత రక్షణార్థము పాటుపడెను. ఈ ఉదారపురుషుడు ఏ ఒక్కరి మతమును (Religion) ఖండింపలేదు; కాని దర్శనభాగము వేద విరుద్ధమైన తుదివెట్టినాడు అందువలన ఈయనకు 'షణ్మత' స్థాపనాచార్యుడను బిరుదము లభించినది.

౪

ఈయన విరచించిన గ్రంథము లనేకములు. వాటిని భాష్య, ప్రకరణ, స్తోత్రము లని మూడు భాగములుగ విభజింపవచ్చును. అందు సమధిక ప్రసిద్ధిని గన్నగ్రంథము సూత్రభాష్యము. దీనిపై ఆనందగిరి 'న్యాయవివరణ' మను టీకయు, గోవిందానందుల 'రత్న ప్రభయను' మఱియొక టీకయు నున్నవి. ఈ రెంటికంటె జటిలమును పాండిత్యబహుళమును అగు టీక వాచస్పతిమిశ్రుల 'భామతి'; దీనికి కల్పతరువు అను టీక, మరల ఈ టీకకు పరిమళమను మఱియొక టీక, పరిమళమునకు ఆభోగమను మఱియొక టీక వెలయుచున్నవి. ఈ టీకలన్నిటితోడను మూలభాష్యమును 'నిర్ణయసాగర్' వారు ప్రకటించి యున్నారు ఇవి శంకరుని శిష్యుడగు సురేశ్వరాచార్యుని అనుసరించుచు వ్రాయబడినవి. పద్మపాదుడను మఱియొక శిష్యుడు భాష్యమునకు 'పంచపాదిక' అను టీకను వ్రాసినాడు. దానికి 'వివరణ' మను టీకను ప్రకాశాత్మయతి విరచించెను. ఈ వివరణము యొక్క సారమును సమకూర్చి విద్యారణ్యులు 'వివరణప్రమేయ సంగ్రహ' మను గ్రంథమును వ్రాసెను. ఇవి, 'కాశీ విజయనగరం సీరీస్' నుండి వెలువడినవి. ఇవిగాక, వైయాసికన్యాయమాల, శాస్త్రదర్పణము,

సంక్షేప - శారీరకము మున్నగు ప్రకరణ గ్రంథములు, వృత్తులు పెక్కుగ నున్నవి. ఇవి న్యాయప్రస్థానాంతర్గతములు. ౪

ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, ఐతరేయ, తైత్తిరీయ, ఛాందోగ్య, బృహదారణ్యములను ఉపనిషత్తులకుగూడ శంకరుడు భాష్యమును వ్రాసినాడు. వీటిఅన్నిటికిని ఆనందగిరి టీకయున్నది. పూనా 'ఆనందాశ్రమము' వారు వెలువరించినారు. తైత్తిరీయ, బృహదారణ్యక భాష్యములపై సురేశ్వరాచార్యుని వార్తికమును, దానిపై ఆనందగిరిటీకయు నున్నవి. ఇవియు పూనా నుండి అచ్చయి వెలువడినవి. ౫

శ్వేతాశ్వతర, నృసింహతాపినీ ఉపనిషత్తులకుగూడ శాంకర-భాష్య మున్నదికాని, ఈ భాష్యము తద్రచితమని సర్వజనాంగీకృతము కాదు. ఇవన్నియును శ్రుతిప్రస్థానాంతర్గతములు.

గీతా, విష్ణుసహస్రనామ, లలితాత్రిశతీ, సనత్సుజాతీయ భాష్యములు స్మృతిప్రస్థానాంతర్గతములు. గీతాభాష్యముపై ఆనందగిరి టీక యున్నది; ఈ భాష్యము ననుసరించి పెక్కాధికముగ వ్రాయబడిన టీకలున్నవి. ఇందు, విష్ణుసహస్రనామ భాష్యము శంకరుని సర్వప్రథమగ్రంథమనియు, గీతాభాష్యము తుట్టతుది గ్రంథమనియు

---

౪. ఆంధ్రమున సూత్రభాష్యమునకు మూడుఅనువాదములు ఉన్నవి. ఒకటి, వల్లూరి జగన్నాధరావుగారిది; అత్యంతప్రాచీనము. రెండవది, వావిళ్ళవారిది, చదలువాడ సుందరరామశాస్త్రిగారిది, మూడవది. పురాణపండ మల్లయ్యశాస్త్రిగారిది, ఆంధ్రపత్రిక కార్యాలయమునుండి వెలువడినది. కాని, మూడును సామాన్యపాఠకునికి దుర్జ్ఞేయములు. సులువైనది ఒకటి అవసరము. ఇంగ్లీషు అనువాదము Max Mullar Edition ఉన్నది.

౫. ఈశ, కేన......తైత్తిరీయముల భాష్యసారములో వావిళ్ళవారు ప్రకటించినారు. సంపూర్ణ భాష్యానువాదము కాదు. ఆంగ్ల, వంగ, హిందీభాషలలో సంపూర్ణ అనువాదము లున్నవి.

పలువురి అభిప్రాయము. ౬ ఇవికూడ దేవనాగరిలిపిలో అచ్చయి వెలువడియున్నవి. సనత్సుజాతీయ భాష్యముపై 'కాలికా' అను టీక యున్నది.

వివేక చూడామణి, ఉపదేశ సహస్రి, అపరోక్షానుభూతి, వాక్యవృత్తి, ఆత్మనిరూపణ, ఆత్మబోధ, శతశ్లోకి, సర్వవేదాంత సిద్ధాంత సంగ్రహము, సర్వవేదాంతసారసంగ్రహము, ప్రబోధ సుధాకరము, మనీషాపంచకము, దశశ్లోకి, అజ్ఞానబోధిని, మోహ ముద్గరము, వాక్యసుధ, పంచీకరణము అనునవి శంకరుని ప్రకరణ గ్రంథములు.

అందు, ఉపదేశసహస్రి పద్యభాగమునకు 'బోధనిధి' యను టీకయు, గద్యభాగమునకు రామతీర్థయతి 'పదయోజనిక' అను టీకయు ఉన్నవి. అపరోక్షానుభూతి పై విద్యారణ్యులటీక లభ్యము. 'శతశ్లోకి'కి ఆనందగిరి ఒకటీకను వ్రాసినాడు. దశశ్లోకికి మధుసూదన సరస్వతి 'సిద్ధాంతబిందు' అను విపులమును పాండిత్య పూర్ణమును అగు టీకను వ్రాసినాడు. దీనిపై మరల బ్రహ్మానందయతి టీక యొకటి ఉన్నది. వాక్యసుధకు గూడ బ్రహ్మానందసరస్వతి విరచిత టీక యున్నది. పంచీకరణమునకు సురేశ్వరభాష్య మున్నది. ఆత్మబోధకు విశ్వేశ్వర పండితుని 'దీపిక' యను టీక యున్నది మనీషాపంచకమునకు గోపాలబాలయతి 'మధుమంజరి' అను టీక యున్నది. ౭

---

౬. గీతాభాష్యము ను 'మహాదేవశాస్త్రి' అనువారు ఆంగ్లీకరించిరి; వావిళ్ళవారు ప్రకటించిరి. భాష్యసారమును దెల్పు వావిళ్ళవారిప్రతి యున్నది. శ్రీ కల్యాణానంద భారతీవారి సంస్కరణ మొకటి ఆంధ్రాక్షరముల ఉన్నదికాని, దానిఅనువాదములేదు.

౭. వివేకచూడామణి, అపరోక్షానుభూతి, వాక్యవృత్తుల ఆంగ్లానువాదమును మాయావతి అద్వైతాశ్రమమునుండి వెలువడినది. ఈ ప్రకరణగ్రంథములకు వావిళ్ళవారి సంస్కరణము అనువాదముతోగూడినది తెలుగున నున్నది.

ఇవిగాక, ఆనందలహరి, శివానందలహరి, మున్నగు స్తోత్ర గ్రంథములు, శంకర విరచితములు సుమారు ౭౫ యున్నవి. ౧ కేవలము దక్షిణామూర్తి స్తోత్రముపై టీక దొరకుచున్నది. శివ పంచాక్షర స్తోత్రమునకు పద్మపాదభాష్య మున్నది.

ఈ గ్రంథముల నన్నిటిని గలిపి (మూలము మాత్రము) శ్రీరంగం, శ్రీ వాణీవిలాస ప్రెస్ వారు ఇరువది సురమ్యములగు సంపుటములలో వెలువరించియున్నారు.

## ౫

శాంకర దర్శనసారమును గ్రహింపవలెనన్న అనుబంధ చతుష్టయము, ప్రమాణములు, అధ్యాత్మ - మీమాంస, బ్రహ్మ వాదము, జగత్తు, మన స్వత్వము, సాధన, ముక్తి అను ఎనిమిది విషయముల గ్రహించిన జాలును.

అనుబంధ - చతుష్టయ మన నేమి? అధికారి, విషయము, సంబంధము, ప్రయోజనము అనునవి అనగా, వేదాంతదర్శన అధికారి ఎవరు? ఇందు ఆలోచ్యవిషయ మేమి? ఆలోచనయొక్క ప్రయోజనము, ఆలోచ్యవిషయము ప్రయోజనములయొక్క సంబంధ మేమి? అని గ్రహింపనగును.

నిత్యానిత్యవస్తువివేకము, ఇహాముత్రార్థఫలభోగ విరాగము, శమ, దమాదిషట్క-సంపత్తి, ముముక్షుత్వములను గుణములు గల వాడు అధికారి.

ఆత్మయొక్కటియే నిత్యవస్తువు — తదితరములు అనిత్యములు అను వివేకము నిత్యానిత్యవస్తువివేకము. ఈ విషయమునే వివరించుచు ఆచార్యపాదులు వివేక చూడామణి యను గ్రంథమును వ్రాసినారు.

---

౧. ఆనందలహరికి, 'Wave of bliss' అను ఆంగ్లానువాదము ఉన్నది. ఆంధ్రమున దుమ్మలపల్లివారి పద్యానువాద మున్నది. శివానందలహరికిగూడ, బలిజేపల్లి వారి పద్యానువాదమున్నది. ఆంగ్లవచనానువాద మొకటి మలియాళదేశమునుండి వెలువడినది.

వైరాగ్య మన శరీరధారణమునకు ముఖ్యావసరములగు పదార్థములుగాక, తదితరములగు స్రక్చందన వనితాదిభోగములప్రతి వైముఖ్యము. దానినే భర్తృహరి తన వైరాగ్యశతకమున ప్రవచించి యున్నాడు.

శమ, దమ, ఉపరతి, తితీక్ష, సమాధానము, శ్రద్ధ అనునవి శమాదిషట్క సంపత్తి. శమమన బహిరింద్రియనిగ్రహము. దమమన అంతరింద్రియదమనము. ఉపరతి యన, నిగ్రహించిన ఇంద్రియముల అటునిటు పోకుండ నిలిపియుంచుట. తితీక్ష యన శీతోష్ణములు, కష్ట సుఖములు మున్నగు ద్వంద్వముల అప్రతీకార పూర్వకముగ సహించుట. సమాధాన మన, బ్రహ్మమున బుద్ధిని స్థాపించుట. శ్రద్ధ యన శాస్త్ర ,గురువాక్యముల సత్యబుద్ధి. ముముక్షుత్వ మన మోక్షేచ్ఛ. ఈ గుణములు గల్గిన ప్రతివాడును వేదాంతశాస్త్రమును బఠింప నర్హుడు.

కాని, తదితర సంప్రదాయస్థులు వేదాంత దర్శనమునకు పూర్వము, పూర్వ మీమాంస పఠనీయ మందురు. శంకరు డీవిష యమును ఒప్పడు. ఈ రెండును విభిన్నశాస్త్రములు. లక్ష్యము వేరు. ఒకదాని విషయము ధర్మజిజ్ఞాస—ఫలము అభ్యుదయము. ఇంకొక దాని విషయము బ్రహ్మము—ఫలము నిశ్శ్రేయస్సు. ఒకటి అనుష్ఠాన-సాపేక్షము, ఫలము ఉత్పాద్యము. మఱియొకటి సిద్ధవస్తువు, ఫలము నిత్యసిద్ధము. కనుక, శంకరుడు ప్రథమ మతమును అంగీకరించుట లేదు.

బ్రహ్మైక్యస్థాపనయే వేదాంతముయొక్క ఆలోచ్య విషయము. ప్రయోజనము దుఃఖనివృత్తి పూర్వకమగు ముక్తి. సంబంధము ప్రతిపాద్యవస్తు ప్రతిపాదన.

ఈ శాస్త్రమున 'బ్రహ్మము' నిషేధముఖమున ప్రస్తావింప బడినది. కారణము, అయ్యది అవాఙ్మానస గోచరము.' బ్రహ్మమే అందఱియొక్క ఆత్మస్వరూపమైన, తద స్తిత్వమున ఎవ్వరికిని సందేహము లేదు. అందువలన ఈ శాస్త్రారంభమే వ్యర్థము, అన—ఆత్మయొక్క

వాస్తవస్వరూపమును గురించి బహు విధములగు భేదవాదము లున్నవి. కొందఱు శరీరమే ఆత్మ యనియు; కొందఱు మనస్సు లేక బుద్ధి ఆత్మయనియు పల్కుచున్నారు. ఈ భ్రాంతిమతముల ఖండించి, సత్యమును ప్రదర్శించుట కీశాస్త్రము అవసరమగుచున్నది.

౬

ప్రమ అనగా యథార్థజ్ఞానమును గలిగించు కరణమే (Instrument) ప్రమాణము. అది ప్రత్యక్ష, శబ్ద, అనుమానములని మూడు తెఱగులు. అర్వాచీనులు ఉపమానము, అర్థాపత్తి, అనుపలబ్ధి అను ప్రమాణముల గూడ గ్రహించినారు.

శబ్ద మన శ్రుతిస్మృతులు. బ్రహ్మము అవాఙ్మానసగోచరము. అగుచో శాస్త్రమెట్లు బ్రహ్మమును దెల్పగల దనిన:

'అవిద్యాకల్పితభేదనివృత్తిపరత్వాత్ శాస్త్రస్య, న హి శాస్త్ర మిదంతయా విషయీభూతం బ్రహ్మ ప్రతిపిపాదయిషతి. కిం తర్హి? ప్రత్యగాత్మత్వేన అవిషయతయా ప్రతిపాదయత్ అవిద్యాకల్పితం వేద్యవేదితృవేదనాదిభేదం అపనయతి' [వే. సూ. భా. ౧. ౧. ౪.] అని జవాబు.

ప్రత్యక్ష శబ్దమును శంకరుడు కొన్ని తావుల శ్రుతిపరముగ ప్రయోగించినాడు. [వే సూ. భా. ౧. ౩. ౨౮] ఏలయన, శ్రుతి మహర్షుల అనుభూతి లేక ప్రత్యక్ష దర్శనము. మఱికొన్ని తావుల అర్థబోధపరముగ వాడినాడు. [వే. సూ. భా. ౧. ౪. ౧౪] ఈదర్శన మేమి ? జ్ఞాతృ, జ్ఞేయ, జ్ఞానముల భేద మంతరించి ఒకానొక సమరస తత్త్వానుభూతి.

అనుమానము ఈ దర్శనమునకు ఉపయోగపడునంతమాత్రమే గ్రహణీయము. లేనిచో, దీని విస్తృతి నిరంకుశమై (Ad infinitum) సత్యవస్తూపలబ్ధికి ఉపకరింపదు.

తదితర ఆస్తికవాదుల ఖండించునప్పుడు శంకరుడు శబ్ద [వేద] ప్రమాణమును గ్రహించినాడు. వేదప్రామాణ్యము నంగీకరింపని నాస్తికులగు బౌద్ధ, జైనాదివాదుల దూచునప్పుడు అనుమానమును గ్రహించినాడు. సూత్రములు ఈ రెండు ప్రమాణముల ప్రసంగమే వినవచ్చుచున్నది. సామాన్యముగ మొదట తర్కమునర్చి, తరువాత అనుకూలములగు శ్రుతి స్మృతులనుదాహరించుట శంకరునిరీతి.

౭

శాంకరదర్శనముయొక్క విశేషత్వము బ్రహ్మ వాదము. 'బ్రహ్మ సత్యం జగన్మిథ్యా' అను శివపురాణ సనత్కుమార సంహితా శ్లోకభాగము, అత్యంతప్రసిద్ధము. మహామహులు అనుభూతమగు జగత్తు లేదని, బ్రహ్మము సత్యమనుటెట్లు? భూతభవిష్యద్వర్తమానముల ఉండునదే పరమార్థసత్యము (Absolute Reality). బ్రహ్మ జ్ఞానానంతరము ఇయ్యది విలోపమునందును. త్రైకాలిక అస్తిత్వమున్నది. బ్రహ్మ మొక్కటియే. ఇప్పు డుదయించు ప్రశ్న : ఒకానొకనికి ఈ జ్ఞానము లభించి, తత్ప్రసాదమున జగత్తు విలోపమునంద వచ్చును. తదితరులకడ అట్లే యున్నదే? దీనికి మువ్విధములగు జవాబు : ౧. అందరికిని క్రమముగ బ్రహ్మజ్ఞానము లభించిన, జగత్తు ఉండదు. జీవులు, ఎంత ఎక్కువమంది అనిపించుచున్నను మితి (Limit) యున్నదని గ్రహింపనగును. ౨ ఉత్పత్తి యున్నచో, వినాశము తప్పనిసరి; ఇయ్యది విప్రతిషేధరహితమగు విషయము. అగుచో, జగత్తు ఉండుటెట్లు? 3. కాంటుయొక్క విజ్ఞానవాదము (Idealistic theory) ననుసరించి, మనజ్ఞాన మంతయు దేశ (space) కాలాది (Time) పదార్థము (Categories)ల నుండియే కలుగుచున్నది. వాస్తవవస్తువును (Thing-in-itself) గ్రహింపలేకున్నారము. జీవజగత్తులసత్త మన అశంకజ్ఞానముపై ప్రతిష్ఠితము. పూర్ణజ్ఞానము లేక అపరోక్షానుభూతి లభించిన జగత్తు సూర్యోదయమైన మంచు వలె విచ్చిపోవును.

జీవజగత్తుల వాస్తవ స్వరూపమేమి? పరిణామ, వికార, వివర్తములని క్రమముగ విశిష్టాద్వైత, ద్వైత, అద్వైతులు చెప్పుచున్నారు. పరిణామ మన దుగ్ధము దధిగ పరిణమించురీతి; పరతత్త్వము కూడ జగదాకారమున పరిణతి నొందుట. మృత్తికయొక్క వికారము ఘటాదులు; అట్లే బ్రహ్మము జగత్తుగ మారుచున్నదని పలుకుట. సూక్ష్మముగ విచారించిన ఇందనేక దోషములు దొరకగలవు కనుక శంకరుడు వివర్తవాద సమాశ్రితమగు మాయావాదమును గ్రహించినాడు. మాయయన 'మిథ్య' కాదు; సామాన్యముగ మిథ్యామాయా శబ్దములు వర్తమాన వాఙ్మయమున, శూన్యార్థమున ప్రయోగింపబడుచున్నవి. ఈ తీరుగ శంకరుని మిథ్యామాయాశబ్దముల గ్రహింప కూడదు.

వేదాంతులు 'మిథ్యా'శబ్దమును బహువిధార్థ ద్యోతనమునకై ప్రయోగించినారు. వంధ్యాపుత్ర ఆకాశకుసుమాదికములు సంపూర్ణముగ మిథ్యలు—అత్యంతతుచ్ఛములగు అలీకపదార్థములు. కొంతగ విషయసాపేక్షమై, ఎడారియందగపడు ఎండమావికూడ మిథ్యయే; ఇది అసద్వస్తువు, అలీకము కాదు. రజ్జుసర్ప భ్రాంతి; ఇదికూడ మిథ్యయే కాని, ఇట 'అతస్మిన్ తస్మిన్ బుద్ధి' అగుటకు బాహ్యము ఈ రెండు పదార్థముల జ్ఞానమున్నది. కనుకనే, రజ్జు — సర్పదర్శనమునకు బాహ్యము మన జ్ఞానమున ప్రాతిభాసిక సర్ప ముదయించుచున్నది. అందువలన ఈ సర్పమునకు ప్రాతిభాసిక – సత్తయున్నది. కాని, ఇది కూడ మిథ్యయే. జగత్తు, ఈ మూడింటిలో నేయొక్క శ్రేణికిని చెందదు. దానిసత్త, వ్యావహారికసత్త—ఇయ్యది మాయాకల్పితము. ఈమాయ సద్వస్తువు కాదు, బ్రహ్మజ్ఞానమైన నుండదు; అసత్తును కాదు. జీవజగత్తులు దీనినుండియే కలిగినవి అందువలన నియ్యది అనిర్వచనీయ మనబడును. పరమార్థదృష్టితో పరికించిన, బ్రహ్మమున మాయవలన జీవజగత్తులు ఆరోపింపబడుచున్నవి; ప్రాతిభాసికములు. వ్యావహారిక దృష్టికి జీవజగత్తు లున్నవి. మాయ యున్నది. పరమార్థ దృష్టికి మిథ్య లేక మాయ లేక అజ్ఞాన మనబడునదికూడ మిథ్యయే.

౫

బ్రహ్మము, సత్, చిత్, ఆనందస్వరూపము; నిర్గుణము; నిర్వికల్పము, నిష్క్రియము, నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావము. జీవబ్రహ్మముల కభేదము. ఈ బ్రహ్మము మాయతో గూడిన సగుణ బ్రహ్మ మనబడు చున్నది — ఈశ్వరశబ్దమున వ్యవహృతమగు చున్నది. పరమార్థదృష్టికి, ఈ రెండును ఒక్కటియే; సగుణ బ్రహ్మమైనవస్తువే నిర్గుణబ్రహ్మము. ఈశ్వరుడు మాయాయుక్తుడైనను, మాయకు వశీభూతుడుగాడు, మాయాధీశ్వరుడు. మాయను లోబరచుకొని సృష్టి నొనర్చుచున్నాడు. కాని, జీవుడు మాయకు వశీభూతుడు. దార్శనికభాషలో జెప్పవలెనన్న సమష్ట్యుపాధ్యుపహితమగు బ్రహ్మము (చైతన్యము) ఈశ్వరుడు. వ్యష్ట్యుపాధ్యుపహితమగు చైతన్యము జీవుడు. ఈ ఇర్వురును పరబ్రహ్మమునకు ప్రతిబింబము వంటివారు.

౬

వ్యావహారిక సత్యమగు ఈ జగత్తునకు ఈశ్వరుడు నిమిత్తకారణము, ఉపాదానకారణముగూడ. ఘటనిర్మాణమున కుంభకారుడు, ఘటమునకు నిమిత్తకారణము. ఉపాదానకారణము మృత్తిక. నైయాయికులు ఈశ్వరుని కేవలము నిమిత్తకారణముగను, పరమాణ్వాదులను ఉపాదానకారణముగను గ్రహించి యున్నారు; వారిసృష్టికీశ్వరునికి సంపూర్ణ కర్తృత్వము లేదు. 'ఊర్ణనాభి'వలె ఈశ్వరుడు తనయందుండి ఈ జగత్తును సృష్టించుచున్నాడు. ఈ జగత్తున నున్న వైషమ్యనైర్ఘృణ్యాదోషములు ఆయన కంటవు మేఘునివలె ఆయన నిర్లిప్తుడు; మేఘుడు వర్షింప ఆ జలము కొన్నిచోట్ల పడి ఏమియును ఫలించుటలేదు, భూమి సారహీన మగుటచేసి. మఱి, వేర్వేరుతావుల కట్వామ్లాది భేదములతో గూడిన ఫలములు గలుగుచున్నవి. దీన, మేఘుని దోష మేమి? అట్లే జీవుల కర్మ-ఫలముల నీశ్వరుడు ఆయా జీవులకు ఒసగుచున్నాడు. ఈ జగత్తు లేక సృష్టి అనాది. కల్పాంత

మున ఈశ్వరునియందు బీజాకృతిని అణగియుండి, మరల తదనంతర కల్పసృష్టికి గారణ మగుచుండును; కనుక, ఈ జగత్తు అనాది. కాని సాంతము, బ్రహ్మజ్ఞానము లభించిన లయమగును.

జగత్తనిన కేవల మీ సౌరజగత్తు ఒక్కటియే కాదు. భూర్భువరాదిసప్త ఊర్ధ్వలోకములు, తలాతలాది సప్త అధోలోకములు గూడ ఈమూడును గలసి బ్రహ్మాండ మనంబడుచున్నవి. ఇట్టి బ్రహ్మాండములు అసంఖ్యాకములు. ఇవన్నియును గలసి జగత్తు.

## ౧౦

మనుష్యుని స్థూలశరీరము క్షిత్యాది పంచభూతాత్మకము. మనోబుద్ధ్యహంకార సమన్విత మగునది సూక్ష్మశరీరము. మనస్సు సంకల్ప వికల్పాత్మకము. బుద్ధి నిశ్చయాత్మిక. అనుసంధానాత్మకము చిత్తము. అభిమానాత్మకము అహంకారము. తరువాతిది కారణ శరీరము. సూక్ష్మశరీర-దర్పణమున బ్రహ్మ-భానుడు ప్రతిబింబింప, మరల దాని ప్రతిఫలమగు సూర్యుడే జీవాత్మ. ఇతడే కారణశరీరాంతర్గతుడు. అందువలన జీవుడు బ్రహ్మముయొక్క అంశ. మనుష్యుని ప్రతి కార్యము ఈ సూక్ష్మశరీరమున ఒక సంస్కారమును ముద్రించుచున్నది. ఈ సంస్కారముల సమిష్టియే అదృష్టము. ఈ అదృష్టవశముననే ఉత్కృష్ట, నికృష్ట జన్మలు. పాపము పుణ్యమువలన ఖండింపబడదు; రెంటిని వేర్వేరుగ అనుభవింపవలెను. స్థావరజంగమాది జీవజాలమున కంతటికిని సూక్ష్మ, కారణశరీరము లున్నవి, కాని అనభివ్యక్తములు. అంతఃసంజ్ఞ, సుఖదుఃఖములు వాటికిగూడ నున్నవి. స్థూలశరీరము పైతొడుగు. మృత్యువనిన దీనిమార్పు. బ్రహ్మజ్ఞానము లభింపనంత వఱకు జననమరణములు తప్పనిసరి. పుణ్యపాపఫలములను స్వర్గనరకముల అనుభవించి భూలోకమున లేక భువర్లోకమున జన్మ నెత్తవలసియుండును. సగుణబ్రహ్మోపాసన యొనర్చిన, సత్య, తప, జన, మహః, సువర్లోకముల కేగిన మరల జన్మలేదు. అట నిర్గుణ బ్రహ్మజ్ఞానమును బడసి ముక్తిని బొందును.

౧౧

నిష్కామ కర్మలవలన చిత్తశుద్ధియును తద్ద్వారమున జ్ఞానమును లభించును; చిత్తశుద్ధ్యనంతరము ఉపాసన అవసరము. ఇయ్యది అంగాంగబద్ధము, ప్రతీకము, అహంగ్రహము అని మూడువిధములు. యజ్ఞాంగముల బ్రహ్మబుద్ధి అంగాంగబద్ధోపాసన. ఆదిత్యాది విషయముల అవలంబించి బ్రహ్మమును భావించుట ప్రతీకోపాసన. కేవల మాత్మచింతన అహంగ్రహోపాసన. ఈ ఉపాసనలవలన చిత్తైకాగ్రత చేకూరును. పిదప, సన్న్యాసపూర్వకముగ గురుముఖమున శ్రవణ మొనర్ప వలెను. 'మహావాక్యము' లేక వేదశాస్త్రముల గురుముఖమున వినుట శ్రవణము. అనుకూలతర్కము మననము. ధ్యేయవస్తువున నిరవచ్ఛిన్న తైలధారవలె చిత్తము ప్రవహించుట నిదిధ్యాసనము. దీనివలన బ్రహ్మాత్మైక్యము ఒనగూడును.

౧౨

ఇట్లు, బ్రహ్మాత్మైక్యమును నిర్గుణ ఉపాసన వలన బొందుట జీవన్ముక్తి. ఇట్టి ముక్తుడే జ్ఞాని వర్తమాన శరీర-అనంతరము మరల జన్మ లేదు. సగుణ బ్రహ్మ ఉపాసకులు దేవయానమార్గమున సగుణ బ్రహ్మలోకమున కరిగి, అట ఆకల్పాంతము మని, నిర్గుణధ్యానసిద్ధులై ముక్తి నందుదురు. జీవన్ముక్తు లీమర్త్యమున ప్రారబ్ధకర్మలు క్షయమగునంతవఱకు వసించి, లోకసంగ్రహార్థము ఉపకరింతురు. బ్రహ్మజ్ఞానమున సంచిత ఆగామికర్మలు క్షయమగును; ప్రారబ్ధము అనుభవింపకే తొలగదు. ఈ జీవన్ముక్తులవలననే గురుశిష్య పరంపర నిలబడుచున్నది. వీరు విధినిషేధముల కతీతులు.

> సంసారాధ్వని తాపభానుకిరణ । ప్రోద్భూతదాహవ్యథా
> ఖిన్నానాం జలకాంక్షయా మరుభువి । భ్రాంత్యా పరిభ్రామ్యతామ్,
> అత్యాసన్న సుధాంబుధిం సుఖకరం । బ్రహ్మాద్వయం దర్శయ
> త్యేషా శాంకరభారతీ విజయతే । నిర్వాణ సంధాయినీ.

---

# వేదాంత దర్శనము : విశిష్టాద్వైతవాదము

## ( రామానుజమతము )

అఖిలభువన జన్మస్థేమభంగాదిలీలే
వినతవివిధభూతవ్రాత రక్షైకదీక్షే,
శ్రుతిశిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే
భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా.

### ప్రవేశిక

వైష్ణవ ఆళ్వారుల సాధన, నాథముని యామునాచార్యుల ఆశ, విశిష్టాద్వైతవాద సంస్థాపకుడగు శ్రీ రామానుజుని మనోమయ శరీరమునకు ఉపాదానములు. వారి మానసికవ్యగ్రతయే ఇట్లు రూపెత్తినది.

ప్రతిదేశమున, జ్ఞానమును శుష్కతర్కముగ నెంచువారు చాలమంది. వీరికి భావోచ్ఛ్వాసము మెండు. ఉపాస్యవస్తువు లేనిదో వారు మనజాలరు; ఆ వస్తువుతో ఒకానొక నిర్ణీతసంబంధము గూడ అవసరము.

శంకరుని పరబ్రహ్మము దుర్దర్శము. దత్తాత్రేయ, జడభరతులు దానిని గాంచి మూగలైరి. శుకదేవుడు కేవలము స్పర్శించెను. శివుడు ఆ సాగర జలముల నొక గండూషపరిమాణము పానమొనర్చి, శవమయ్యెను. వైభవసముజ్జ్వలమగు దివ్యభవనము సామాన్యపాంథున కగమ్యమగునట్లు పరబ్రహ్మముకూడ. దైనందిన సుఖదుఃఖతరంగముల తెలియాడు, నికృష్ట మనుష్యుని ప్రార్థనల కయ్యది బధిరము. 'సంసారాధ్వశ్రమార్తైరుపవన మివ' సేవితము కాదగు వస్తువొకటి అవసరము. దీనిని ప్రసాదించినది శేషుని అవతారమగు లక్ష్మణ—రామానుజుడు. శంకరుడు కేవలము శ్రుతినే ఆధారమొనర్చుకొనెను. రామానుజుని మనస్సాగరమున పురాణ, ఆగమ, ద్రావిడప్రబంధాది నదులుగూడ మిళితములై, సార్థకత నందెను.

## జీవితచరిత్రలు

అముదన్ విరచిత ద్రావిడగ్రంథము, ఆంధ్రపూర్ణుని యతిరాజవైభవము, వేంకటనాథుని యతిరాజ సప్తతి, ప్రపన్నామృతము, Ramanuja and His life and Times అను గ్రంథములు పై తదాచార్యుని జీవితము నెఱుంగుటకు ముఖ్యాధారములు. మన గ్రంథముల 'అతిశయోక్తి'కి ఆదరము నొందు. ఇదియే గురువును గుఱించి శిష్యుడు చెప్పవలసిన 'అతి - అతిశయోక్తి' అగుటకు అటంకము లేదు. ఈ జీవితచరిత్రకారులు, రామానుజుని జన్మకాలమును అభివర్ణింపబోయి, శంకరమత - పతనమును ఒక విషయముగ గ్రహించిరి. లేకున్న, 'ధర్మ - సంస్థాపన' రామానుజుని అవతార తత్వములు పొసగవు. శాంకరమతము పతితమైన, రామానుజున కంతి నైపుణ్యమునుజూపి, తన్మతమును ఖండింప నవసరము లేదు. మూడు వందల ఏండ్లు ముగియకుండనే శాంకరమత - పరమాయువు ముగిసిన దనుట విచారాసహము. ఐతిహాసికముగ (Historical) చూచిన భామతి, పంచపాదికా వివరణము మున్నగు ఉత్కృష్ట అద్వైత వేదాంత - గ్రంథము లీ ప్రాంతములలోనివే. కాని, శంకరుని ప్రతిపక్షు లందఱిలోను రామానుజుడు శ్రేష్ఠుడనుమాట నిర్వివాదము.

### జీవితము.

శ్రీ పెరుంబూదూరు గ్రామమున క్రీ. శ. ౧౦౧౭ లో అసూరి కేశవభట్టు కాంతిమతుల గర్భమున ఇలయ పెరుమాళ్ అనబడు లక్ష్మణ - రామానుజుడు జన్మించెను. ఉపయుక్తవయస్సున కాంచీ నగరమున గోవిందుడను సహాధ్యాయునితో గలసి, యాదవప్రకాశుని కడ శాస్త్రముల బఠింపసాగెను. ఈ గురుశిష్యసంబంధము రామ - రావణ సంబంధము కాగా రామానుజుడు గురువును వీడెను. గురువు కూడ రామానుజుని హత్య యొనర్పనెంచెను. కాని, దైవికముగ రామానుజుడు తప్పించుకొనెను. పదునారవయేట వివాహమయ్యెను; తండ్రి దివంగతుడయ్యెను.

శ్రీరామానుజుడు యామునాచార్యుని 'స్తోత్రరత్న' శ్లోకముల మాధుర్యమున కానందించి, నంబియను తదనుచరునితో వారిని దర్శింప శ్రీరంగమున కరిగెను. అప్పుడు యామునాచార్యుని జీవన ప్రదీపము నిర్వాపితము; శవముయొక్క హస్తాంగుళీత్రయము ముష్టిబద్ధము. అపూర్ణమగు ఆ కార్యత్రయమును సూచించుచు, యామునాచార్యులు దివి కరిగెను. అవి: బ్రహ్మసూత్రభాష్యరచన, ద్రావిడ వేద ప్రచారము, పరాశరశఠకోప నామకరణములు. రామానుజుడు వీటిని పూర్ణమొనర్ప ప్రతిజ్ఞాబద్ధుడగుడు, వ్రేళ్ళు మరల విప్పారెను.

పిదప కాంచీనగరమున, దేవరాజు సేవలో నిమగ్నుడయ్యెను. ప్రత్యాదేశమును బడసి శ్రీరంగమునకు పోవుచు, పథమధ్యమున మధురాంతకమున రామచంద్రుని పూజింపనాగెను. అటకు మహాపూర్ణుడు (నంబి) అరుదెంచి మంత్రోపదేశ మొసగెను. పిదప వారిర్వురును కలసి కాంచీనగరమున కరుదెంచి, ఒక్కట నివసింపసాగిరి. రామానుజుని వివాహిత జీవితమంత సుఖకరముకాదు కాంచీపూర్ణుడు (తిరుకచ్చినంబి) అను శూద్రుడు కూర్చొనిన తావును కడుగుట, భిక్షుకుని తఱుముట, మహాపూర్ణుని (నంబి) భార్యతో కలహించుట అను మూడు విషయములవలన, భార్యయనిన రామానుజునకు ఏవ పుట్టెను. ఆమెను నేర్పుతో పుట్టింటికి పంపి, సన్యసించెను. క్రమముగ రామానుజుని శిష్యులసంఖ్య పెరుగసాగెను.

యామున శిష్యకోటివలన నాహూతుడై రామానుజుడు శ్రీరంగమునకరిగి, వారి నాయకత్వమును గ్రహించెను. అట, గోష్ఠీపూర్ణునికడ 'మంత్ర రహస్యము'ను దెలిసికొనెను; ఆయతడవలు నిరాకరించి పిదప, రామానుజునిభక్తికి సంతోషించి, గోష్ఠీపూర్ణుడు గోప్యమగు మంత్రార్థము నిచ్చెను. కాని, రామానుజుడు వెంటనే మందిరగోపురము నెక్కి అందఱికిని నరకోత్తారకమగు ఆ మంత్రమును జెప్పెను. 'అనంత నరకదమగు ఇక్కార్యము నేల యొనర్చితి' వని గురుడు ప్రశ్నింప, 'అంతమంది స్వర్గమున కరుగ నేనొక్కడ నరకమున కరుగుట ఏమి కష్ట'మని వచించెను. గురుడు సంతోషించి

ఇటనుండి 'విశిష్టాద్వైతము రామానుజ దర్శన' మనంబడును అని ఆదే శించెను. తరువాత మాలాధర, గోష్ఠనంబి అనువారి శుశ్రూషను రామానుజుడు సల్పెను ఈ సమయమున మరల శ్రీరంగ దేవాల యార్చకుడు రామానుజుని ప్రాణముల వినాశ మొనర్ప యత్నించెను. కాని, కొనసాగ లేదు.

పిదప, బోధాయన బ్రహ్మసూత్ర-వృత్తిని కాశ్మీరమునుండి సంగ్రహించి శ్రీభాష్యమును విరచించి, ప్రథమ ప్రతిజ్ఞను నిర్వ హించెను. ఇట్లే ద్రావిడ వేదప్రచారము, నామకరణములగూడ గావిం చెను. తిరుపతిని వైష్ణవప్రధానక్షేత్ర మొనర్చెను. శైవుడగు కులో త్తుంగ చోళదేవుడు రామానుజుని జంప యత్నింప, మైసూరునకు పారిపోయెను. హొయిసాలరాజు ఆదరమును బడసి, అతని శిష్యుని గావించుకొనెను. అట మేలుకోటలో నారాయణమందిర సంస్కార మును గావించెను. హొయిసాలరాజగు ఈ విష్ణువర్ధనుడే శిల్పకళా సీమలగు బేలూరు మందిరముల నిర్మించినవాడు (౧౧౧౭. క్రీ. శ.)

తరువాత ౧౧౧౮. క్రీ. శ. న కులోత్తుంగుడు చనిపోవ శ్రీరంగ మున కరుదెంచెను. ఈతడవ ప్రతిబంధరహితమగు ఆధిపత్యమును రామానుజుడు సంపాదించెను 'అధ్యయనోత్సవము' ఆళ్వారులపూజ, ఆండాళ్ పూజ తిరుపతియందు గోవిందరాజు పునఃప్రతిష్ఠలను సల్పెను. పిదప, తాను తీర్థయాత్రలను సల్పి, శ్రీభాష్యమును రక్షించుభారము నలువురకొసగెను. పిళ్ళన్ అను వారికి ద్రావిడవేదమును రక్షించు భారమును, మఱి ౭౪ మందికి మతప్రచారభారమును నొసగెను.

ఇట్లు కులోత్తుంగచోళ, విక్రమచోళ ద్వితీయ కులోత్తుంగచోళ దేవుల రాజ్యకాలమున మతప్రచారమును సల్పి ౧౧౩౭ క్రీ. శ. మున, ౧౨౦-వ ఏట రామానుజుడు సాధనోచితమగు లోకమున కరిగె ను. శైవ, స్మార్త, యాదవ, భట్టభాస్కరమతములఖండించి, భాష్య కార, యతీంద్రనామములను బడసినఈ ఆచార్యుని జీవితము అనంత మహిమామయము. ఇలయపెరుమాళ్ లక్ష్మణ - రామానుజుని స్థానము భక్తులపంక్తిలో అగ్రగణ్యము.

## గ్రంథవివరణి.

'వేదాంతసారో వేదాంతదీపో వేదార్థసంగ్రహః,
గద్య - గీతాభాష్య - సూత్రభాష్య నిత్యగ్రమా ఇతి.'

అను శ్లోకమువలన రామానుజుని గ్రంథనామములు తెలియ వచ్చుచున్నవి. అందు వేదార్థసంగ్రహమున శ్రుతులు విశిష్టాద్వైత పరముగ వ్యాఖ్యాన మొనర్పబడినవి; దీనిమీద 'స్నేహాపూర్తి' యనుటీకయున్నది. తరువాత, శ్రీభాష్యమనబడు సూత్రభాష్యము; దీనికి సుదర్శనాచార్యుని 'శ్రుతప్రకాశిక' యనుటీకయు, వేదాంత దేశికుల 'అధికరణమాల' యును ఉన్నవి. ఇందు ముఖ్యముగ శంకర మతఖండనము, అద్వైతపరములగు విష్ణుపురాణాదిశ్లోకముల స్వమత వ్యాఖ్యయు ఒనర్పబడినవి. విచారబహుళమైనను, ఇందు శంకర భాష్యముయొక్క 'ప్రసన్నగంభీరత' లేదు. డాక్టరు థిబట్, ప్రొఫె సర్ రంగాచారియర్‌ల ఇంగ్లీషు అనువాదములున్నవి. వేదాంత దీపము బ్రహ్మసూత్రములకు టీకాస్థానీయము; ప్రమేయబహుళమగు శ్రీభాష్యపఠనాసమర్థులకు. వేదాంతసారముగూడ ఇట్టిదే. * గీతాభాష్యమునకు వేదాంతదేశికుని 'తాత్పర్యచంద్రిక' యను టీక కలదు. ఆంగ్లానువాదముకూడ నటేశన్ కంపెనీవారిది ఉన్నది. గద్య త్రయమున, శరణాగతి, శ్రీరంగ, వైకుంఠగద్య లనుమూడు భాగము లున్నవి. దీనిపైని వేంకటనాథుని భాష్యమొకటి యున్నది. భగవ దారాధనాక్రమ మనుగ్రంథమున ఉపాసనావిధానము వర్ణింపబడినది. ఈ గ్రంథముల నన్నిటిని శ్రీరంగం వాణీవిలాస ప్రెస్‌వారు దేవ నాగరి అక్షరములలో ముద్రించియున్నారు.

విశిష్టాద్వైతమతసారమును తెలియ గోరువారికి 'యతీంద్రమత దీపిక' అను గ్రంథము చాలగ తోడ్పడగలదు. ఈ విషయమున అద్వైతవాదమును ప్రపంచించు వేదాంతసారము (సదానంద) నకును

* (Rev. Johnson) ఇంగ్లీషు అనువాదము ఉన్నది. శ్రీభాష్య మొకటి బావిళ్లవారిది తెలుగునను గలదు.

దీనికిని పోలికయున్నది. కాని, వేదాంతసారముకంటేనిది పెద్దది. సాయనాచార్యుల సర్వదర్శన సంగ్రహమునగూడ వివరణయున్నది.

## ఆలోచ్య విషయములు.

ఆచార్య రామానుజుడు చిత్ (జీవులు) అచిత్ (జడము), ఈశ్వరుడు (పురుషోత్తముడు) అను మూడుపదార్థముల నొప్పుకొను చున్నాడు. అనంత సంఖ్యాకులగు జీవులును, ఈ జగత్తును కలసి ఈశ్వరుని శరీరము, ఈ జీవజగద్వ్యాత్మకమగు శరీరమునకు ఈశ్వరుడే ఆత్మ. + ఈ తత్త్వత్రయ సమర్థనార్థము రామానుజదర్శనమున, (౧) స్థూల సూక్ష్మచేతనాచేతన, బ్రహ్మముల ఏకత్వము, (౨) ద్వైతాద్వైత శ్రుతుల అవిరోధము, (౩) బ్రహ్మముయొక్క సగుణత్వ సవిశేషత్వ, విభుత్వములు (౪) బ్రహ్మముయొక్క నిర్గుణత్వ నిర్విశేషఖండనము, (౫) జీవుని అణుత్వ, బ్రహ్మస్వభావత్వ, దాసత్వములు, (౬) జీవుని బంధకారణమగు అవిద్య, (౭) మోక్షోపాయమగు విద్య (౮) భక్తియొక్క మోక్షకారణత్వ, శ్రేష్ఠతలు, (౯) బ్రహ్మైక్యనిరాసన, (౧౦) మాయావాద ఖండనము (౧౧) అనిర్వచనీయవాదఖండనము, (౧౨) జగత్తు యొక్క సత్యత్వస్థాపన, (౧౩) జీవజగత్తుల ఈశ్వర శరీరత్వము అను విషయములు ఆలోచింపబడినవి.

## ప దా ర్థ - వి భ జ న.

రామానుజమతమున పదార్థములన్నియు ప్రమాణ ప్రమేయ భేదముల ద్వివిధములు. అందు ప్రమాణములు ప్రత్యక్ష, అనుమాన, శబ్దము లని మూత్రేరంగులు. ప్రమేయము ద్రవ్యాద్రవ్యము లని రెండువిధములు; ద్రవ్యము జడాజడము లని మరల ద్వివిధము. జడమున ప్రకృతి, కాలము అను రెండు విభాగము లున్నవి. ప్రకృతి చతుర్వింశతి తత్త్వాత్మకము. కాలము భూత, భవిష్యద్, వర్తమాన

+ ఈ జీవజగద్విశిష్టమగు ఏకత్వ ప్రతిపాదనవలన, ఈ వాదము విశిష్టాద్వైతమనంబడుచున్నది.

రూపము. అజడము పరాక్, ప్రత్యక్ అని రెండువిధములు. ప్రత్యక్ జీవేశ్వర భేదముల ద్వివిధము. జీవులు నిత్య, బద్ధ, ముక్తులని మూడువిధముల నుందురు. అందు బద్ధులు బుభుక్షు, ముముక్షువులని రెండువిధములు. బుభుక్షులు అర్థకామ పరులు, ధర్మ (కామ) పరులు అను భేదముల వెలయు చున్నారు. ధర్మపరులలో దేవతాంతరపరులు, భగవత్ పరులు అను రెండుభేదము లున్నవి. ముముక్షువులు కైవల్యపరులు, మోక్షపరులు అని విభజింపబడుచున్నారు. భక్త, ప్రపన్నులని మోక్షపరులు రెండు తెఱగుల నున్నారు. ప్రపన్నులు మరల ఏకాంతిక, పరమైకాంతికభేదముల నెఱుంగబడుచున్నారు. పరమైకాంతికులు దృప్తులు ఆర్తులు అని రెండు విధములుగ నున్నారు. ఈశ్వరుడు పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చావతారములను ఐదు తెఱగుల వెలయుచున్నాడు. పరుడు నారాయణుడు. వ్యూహము వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధు లని చతుర్విధము; కేశవాదులు తదితర వ్యూహములు. మత్స్యాది అవతారములు విభవములనంబడును. అంతర్యామి ప్రతిశరీరమున వెలయుచున్నాడు. శ్రీరంగాది ఆలయములలో పూజింపబడు మూర్తి విశేషములు అర్చావతారములు. అద్రవ్యము సత్వ, రజః, తమః, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ, సంయోగ, శక్తు లని పదివిధములు.

## ప్రమేయనిరుక్తి.

యథావస్థిత వ్యవహారాను గుణ మగు జ్ఞానమే ప్రమ. అనగా, అన్యథాజ్ఞాన, విపరీతజ్ఞాన, మిథ్యాజ్ఞాన రహిత మని భావము. దీనికి సాధనమగునదియే ప్రమాణము. ఈ ప్రమాణము ప్రత్యక్ష, అనుమాన, శబ్దము లని త్రివిధము. ప్రత్యక్షము నిర్వికల్ప, సవికల్పము లని రెండు విధములు; ఈ రెండును విశిష్ట విషయకములు. నిర్విశేష మగు జ్ఞానము అసంభవము. స్మృతి, ప్రత్యభిజ్ఞ, భావాంతరరూపమగు అభావజ్ఞానము, యోగజ జ్ఞానము, ప్రత్యక్ష – అంతర్గతములు. భ్రమ, స్వప్నాది జ్ఞానములు కూడ జ్ఞానములే. కనుక, 'సర్వం జ్ఞానం సత్యం

సవిశేషవిషయం చ'. ఉపమానము, అర్థాపత్తులు అనుమానాంతర్గతములు. అపౌరుషేయము నిత్యము అగు వేదవాక్యమే శబ్దప్రమాణము. సిద్ధ బ్రహ్మ పరవాక్యములు ఉపాసనాపరములు. వేదము సంపూర్ణముగ ప్రమాణము

శంకరమతమున జ్ఞానము నిరపేక్షము; రామానుజ మతమున ఆపేక్షికము. అద్వైతులజ్ఞానము స్వప్రకాశము, నిర్విశేషము – జ్ఞానము కొంకర్క సవిశేషత్వే మాపాధికము. మఱియు, ఈ జ్ఞానము ప్రత్యగాత్మ స్వరూపము; రామానుజ మతమున జ్ఞానము సవిశేష విషయకము, నిర్విశేష వస్తుజ్ఞానము అసంభవము. నిర్విశేషవస్తువే జ్ఞానస్వరూపమని శాంకరమతము. జ్ఞానమునకు మరల జ్ఞానముండజాలదు; జ్ఞానము స్వప్రకాశము. శాంకరమతమున మాయ, అజ్ఞానములు ఒకటే పదార్థము; సంశయ, విపర్యయ, మిథ్యాజ్ఞానములు అజ్ఞానము. రామానుజమతమున మాయ భగవంతుని శక్తి; మాయ, అజ్ఞానములు విభిన్న పదార్థములు. మాయ భగవదాశ్రిత. అజ్ఞానము జీవాశ్రితమగు జ్ఞానాభావము. ఇది శాంకర రామానుజ దర్శనముల మూలపార్థక్యము. వ్యాసవిస్తృతి భయమున ఉభయపక్షములవారి యుక్తులు ప్రదర్శింపబడలేదు.

## అధికారి.

కర్మఫలానిత్యజ్ఞానమును బడసినవాడె బ్రహ్మ జిజ్ఞాసకు అధికారి. వేదాధ్యయనము, తత్ఫలముగ కర్మఫలానిత్యత్వజ్ఞానము, స్థిరఫలమగు మోక్షేచ్ఛ, బ్రహ్మజిజ్ఞాసకు క్రమద్వారములు. పూర్వమీమాంస, ఉత్తరమీమాంసలు ఒకటే శాస్త్రము. ధర్మానుష్ఠానానంతరము మోక్షేచ్ఛ. జ్ఞానకర్మలకు కార్యకారణ భావమున్నది. నిష్కామకర్మవలన చిత్తశుద్ధి లభించును; పిదప జ్ఞానోదయమగును. అందువలన జ్ఞానము సాధ్యము. కర్మము సాధకము. కర్మజ్ఞానము లేకున్న బ్రహ్మజిజ్ఞాస కధికారము లేదు. మఱియు, ఈ జ్ఞానము సర్వాశ్రమ ధర్మాపేక్షము.

శాంకర మతమున కర్మమీమాంస, బ్రహ్మమీమాంసలు వేర్వేరు శాస్త్రములు. కర్మజ్ఞానము లేకున్నను, సాధన చతుష్టయ సంపన్నుడైన, బ్రహ్మజ్ఞానాధికారము. కర్మలు చిత్తశుద్ధి కలిగించి, పారంపర్యముగ మోక్షకారణము లగుచున్నవే కాని, సాక్షాత్కారణ ములు గావు. జ్ఞానమే మోక్షకారణము. ఈ భేదమువలన విశిష్టా ద్వైతులు జ్ఞాన-కర్మసముచ్చయ వాదులనియు, అద్వైతులు కేవల జ్ఞానవాదులనియు చెప్పబడుచున్నారు.

## విషయము.

స్థూల సూక్ష్మ చేతనాచేతన విశిష్టమగు బ్రహ్మమే రామా నుజ దర్శన విషయము. ఆ బ్రహ్మమే పురుషోత్తముడనంబడు నారాయణుడు. ఆయన సగుణుడు, సవిశేషుడు. ఈ బ్రహ్మము శబ్దగమ్యమని చెప్పబడుట వలన,నిర్విశేషము కాజాలదు. ఈయన అశేష-కల్యాణ-గుణాకరుడు; సర్వజ్ఞత్వ, సత్యసంకల్పత్వ, సర్వాంత రత్వ, సర్వాధారత్వ, సర్వనియంతృత్వాది గుణవిభూషితుడు. నిర్విశేష వస్తువుగాని, ఏవంవిధమగు జ్ఞానముగాని లేదు. శబ్దసామర్థ్యము సవిశేష వస్తునిరూపణతోడనే పరిసమాప్తము. స్వాప, మద-మూర్ఛల లభించు జ్ఞానముగూడ సవికల్పకమే. నిర్గుణశ్రుతివాక్యములు హేయగుణనిషేధ పరములు; నిర్గుణ - బ్రహ్మప్రతిపాదకములు కావు.

శాంకరమతమున నిర్విశేష-చిన్మాత్ర బ్రహ్మమే ప్రతిపాద్యము. 'అవాఙ్మానస గోచర' మగుటవలన 'ఇదంతయా' నిరూపింపబడ జాలదు. అది, అశబ్దము, అస్పర్శము; ప్రత్యగాత్మ స్వరూపమగు జ్ఞాన స్వరూపము, జ్ఞేయము అనగా జ్ఞానవిషయము కాజాలదు. జ్ఞానవిష యములన్నియును జడములు; జ్ఞానము ప్రకాశకము జడము దృశ్యము, ప్రకాశ్యము. బ్రహ్మము జ్ఞానవిషయమైన జడత్వ, దృశ్యత్వాదోషములు పొసగును. బ్రహ్మము యొక్క సగుణత్వమునుగూడ శంకరుడొప్పు కొనును గాని, అయ్యది పారమార్థికము కాదు, వ్యావహారికము. ఫలతః మాయికము. బ్రహ్మము సర్వావస్థల నిర్విశేషము. ఆత్మ

స్వరూపమగుటవలన శూన్యముకాదు. బ్రహ్మము సవిశేషమైన మూర్తము (Limited) అగున; మూర్తమైన పరిణామవినాశము లనివార్యములు. కనుక, సర్వ-సమస్త ఉపాధికమును, నిత్యశుద్ధబుద్ధ ముక్తస్వభావమును నగు బ్రహ్మమునే అద్వైతులు ప్రతిపాదించు చున్నారు.

## సంబంధము.

రామానుజుడు శాస్త్రమును ప్రతిపాదకముగను, పురుషోత్త ముని ప్రతిపాద్యముగను తీర్కొనుచున్నాడు. శాస్త్రము సగుణ, సవిశేషబ్రహ్మమును ప్రతిపాదించుచున్నది. కేవలము, శాస్త్రప్రమా ణము వలననే బ్రహ్మమును మనము గ్రహింపవలెను బ్రహ్మము సశరీరియా లేక అశరీరియా?' కర్తయా లేక అకర్తయా ? ఇత్యాది విషయముల అనుమాన ప్రమాణమున నిర్ణయింపబూనుకొనిన అన వస్థా, సాధ్యవికలత్వాది దోషములు వచ్చును కనుక, శ్రుతితప్ప అన్యగతిలేదు.

శాంకరదర్శనమునగూడ, బ్రహ్మమే ప్రతిపాద్యము-శాస్త్రము ప్రతిపాదకము. అయితే, శాస్త్రము నిషేధముఖముననే బ్రహ్మమును నిరూపించుచున్నది. బ్రహ్మాత్మైకత్వబోధానంతరము, శ్రుతి నిరర్థక మగును. ప్రమాణ-ప్రమేయవ్యవహారము లన్నియును అవిద్యాంతర్గత ములు; పారమార్థికదృష్టికి శ్రుతిగూడ అవిద్యాంతర్గతమే! ముక్తునకు వేదముగూడ తృణసమానమగును. రామానుజమతమున శ్రుతి అన్ని అవస్థల అబాధితప్రమాణము.

## ప్రయోజనము.

రామానుజుడు అవిద్యానివృత్తియే ప్రయోజనమని నుడువు చున్నాడు. ఉపాసనాబలమున బ్రహ్మసాక్షాత్కారమైన జీవుని అవిద్య తొలగును. ముక్తుడు, ఈశ్వరదాసత్వరూపమున వెలయుచు, అపారమగు లీలానందమును ఆస్వాదించును.

శాంకరమతమున బ్రహ్మాత్మైకత్వమే ప్రయోజనము; ఈ ఐక్య బోధవలన అవిద్య ధ్వస్తమగును. అవిద్య తొలగిన, జీవుడు బ్రహ్మ స్వరూపమగు పరమానందస్వరూపమున వెలయును. రామానుజుని మతమున ఉపాసనవలన, అవిద్యనశించి మోక్షము లభించును. శాంకరమతమున ఉపాసనకు స్థానమున్నదికాని, అది కేవలము 'చిత్త శుద్ధి'కి తోడ్పడుచున్నది. అవిద్యా వినాశకశక్తి, దానికిలేదు. జ్ఞానము వలననే అవిద్య తొలగుచున్నది. ఈ అవిద్య తొలగుటయే మోక్షము. శాంకరమతమున అజ్ఞానము భావవస్తువు; రామానుజమతమున జ్ఞానా భావమే అజ్ఞానము. రామానుజుని ప్రతిపాద్యమగు ఈ బ్రహ్మము శాంకరదర్శనమునందలి కార్యబ్రహ్మము లేక సగుణబ్రహ్మము అనబడు ఈశ్వరునితో బోలియున్నది. ఈ బ్రహ్మముగూడ, అద్వైతుల దృష్టికి, అవిద్యాంతర్గతము, కాని, దీని నాశ్రయించుకొనినవారు 'క్రమ ముక్తి'ని బొందుదురు.

* * *

ఇవి వేదాంతదర్శనాలోచ్యములగు అధికారి, ప్రయోజన, సంబంధ, విషయము లనబడు అనుబంధ చతుష్టయము. ఇక మిగిలిన తత్త్వముల సంక్షేపముగా నాలోచింతము.

### బ్రహ్మము.

సగుణ - సవిశేష బ్రహ్మమనబడు ఈశ్వరుడే రామానుజుని పరమ - తత్త్వమనియు, మాయ తచ్ఛక్తి యనియు పేర్కొని యుంటిని. చిదచిత్ శరీరత్వాదు లతని లక్షణములు సూక్ష్మ చిదచిత్ వేషమున ఆయన జగత్తునకు నిమిత్తకారణము. సంకల్ప విశిష్టవేష మున ఉపాదానకారణము. కాలాదుల అంతర్యామిరూపమున సహ కారి కారణము. కార్యరూపమున వస్తువుల ఉపాదానము. జీవజగత్తులు ఈయన శరీరము. ఈయన తదధిష్ఠాతయగు ఆత్మ. కార్యకారణములు రెండును ఆయన్నయే. ఈయనగుణములకు సంఖ్య లేదు; దోషగంధము లేదు. ఈయన సృష్టికర్త, కర్మఫలప్రదాత, నియంత, సర్వాంతర్యామి,

సర్వవ్యాపి. ఈ సర్వవ్యాపిత్వము స్వరూప, ధర్మభూతజ్ఞాన, విగ్రహ రూపముల వెలయుచు, పరిచ్ఛేదరహితమై వెలయుచున్నది. సత్యత్వ, జ్ఞానత్వ, ఆనందత్వ, అనంతత్వాదులు ఈశ్వరుని స్వరూపధర్మములు; జ్ఞానశక్త్యాదులు విశేషధర్మములు. సర్వజ్ఞత్వాదులు సృష్ట్యుపయుక్త ధర్మములు. వాత్సల్య-సౌశీల్యాదులు ఆశ్రయణీయోపయుక్త ధర్మములు. కారుణ్యాదులు కరుణోపయుక్త ధర్మములు. ఇట్టి ఈశ్వరుడే సృష్టి, స్థితి, సంహారకారకుడు.

*     *     *

ఏవంగుణ విశిష్టుడగు ఈశ్వరునికి అద్వైతవాదమున చోటున్నది కాని, ఈయన పరబ్రహ్మము కాదు. ఈ గుణములలో కొన్నిటిని వారు, బ్రహ్మముయొక్క తటస్థలక్షణముగ అంగీకరించినారు. కాని, వారి జగత్తు, బ్రహ్మము లేక ఈశ్వరుని పరిణామము కాదు. పర-బ్రహ్మము నాశ్రయించి పెంపొందిన వివర్తము. కనుక, అద్వైతులు వివర్తవాదులనియు, విశిష్టాద్వైతులు, పరిణామవాదులనియు చెప్పబడుచున్నారు. అద్వైతులకీశ్వరుడుగూడ మాయాంతర్గతుడు; జీవులవలె బద్ధుడు కాడు, మాయాధీనుడు. నిర్గుణబ్రహ్మముయొక్క ప్రతిబింబము. పారమార్థిక దశయందు, శాస్త్రమువలె, ఈయన ఉనికిగూడ విలోపమందును.

## ఈశ్వరుడు - పరుడు.

రామానుజుని ఈశ్వరుడు పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చాభేదముల పంచవిధముల వెలయుచున్నాడు. శంఖ, చక్ర, గదా, పద్మధారి - చతుర్భుజుడు, శ్రీభూనీళావిశిష్టుడు, కిరీటాది భూషణ భూషితుడు, వైకుంఠవాసియగు నారాయణుడే పరుడు.

## వ్యూహము.

ఈయనయే సృష్ట్యాదుల నిమిత్తము వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధులను వ్యూహరూపమున వెలయుచున్నాడు.

వాసుదేవుడు షడ్గుణ – పరిపూర్ణుడు. సంకర్షణుడు జ్ఞానబలయుక్తుడు. ప్రద్యుమ్నుడు ఐశ్వర్య వీర్యయుతుడు, అనిరుద్ధుడు తేజశ్శక్తి, యుక్తుడు.

ఈ చతుర్విధవ్యూహములను, గుణముల లెక్కను శంకరు డొప్పుకొనలేదు; 'ఏకస్మిన్ అసంభవాత్' 'విప్రతిషేధాత్' అను సూత్రముల వ్యాఖ్య సల్పుచు ఖండించినాడు. ఆయన ప్రశ్నించునది, ఈశ్వరునకు ఈ నాల్గువ్యూహములనే కల్పించి, పరిమితిబద్ధునొనర్చ నేల? ఆబ్రహ్మస్తంబపర్యంతిము, 'స ఏకధా భవతి, బహుధా భవతి' అన్నట్లు ఆయనయేకదా! అయితే సాష్టాంగాదిరూపముస లెదర్చన కాటంక పెట్టుటలేదు. ఈ విషయమును గమనించిన శంకరుని విశాలదృష్టి తేటపడగలదు.

## విభవము.

సజాతీయరూపముగ ఆవిర్భావమే విభవము; ఈ ఆవిర్భావమే మత్స్యాది దశావతారములు. ఇందు ముఖ్య, గౌణ, పూర్ణ, అంశాది బహువిధ భేదములున్నవి. స్వేచ్ఛానుసారము ఇయ్యవి గ్రహింపబడుచున్నవి.

మాయకు వశీభూతుడైనట్లు తోచుచు, ఈశ్వరుడు అవతారమును గ్రహించుటను, అద్వైతులు అంగీకరింతురు.

## అంతర్యామి.

సర్వజీవుల హృదయస్థితుడే అంతర్యామి; ఈయన జీవులు స్వర్గనరకముల ననుభవించుపట్ల సుహృద్రూపమున వెలయుచున్నాడు. యోగులకు దర్శనీయుడు. జీవునితో నున్నను, తద్గతదోషములు స్పృశింపవు. ఈ అంతర్యామిని అంగీకరించుటకుగూడ అద్వైతుల కెట్టి ఆటంకమును లేదు.

## అర్చావతారము.

విభిన్న పుణ్యక్షేత్రముల పూజింపబడు విగ్రహమే అర్చావ

తారము. ఉపాసనాసాక్షాత్కారార్థము, అద్వైతులు అర్చావతారము సంగీకరింతురు; పతత్పూజాఫలము చిత్తశుద్ధి, జ్ఞానశక్తి మున్నగునవి.

## జగత్తు.

రామానుజుని మతమున జగత్తు జడము, మఱియు బ్రహ్మము యొక్క శరీరము. బ్రహ్మము జగద్రూపమున పరిణతమైనను అవికృతము. జగత్తు సత్ — మిథ్యకాదు. 'చిదంశః సదైకరూపతయా సర్వదా అస్తిశబ్దవాచ్యః. అచిదంశస్తు ప్రతిక్షణ పరిణామిత్వేనసర్వదా నాశిగర్భః. ఇతి సర్వదా నాస్తిశబ్ద — అభిధేయః. ఏవంరూప చిదచిదాత్మకం జగత్ వాసుదేవ శరీరమ్, తదాత్మక మితి జగత్ యాథాత్మ్యం సమ్యగుక్తమ్' అని ఆచార్యుని నిర్వచనము.

జగత్తు దృశ్యము జడ మను విషయమును అద్వైతు లంగీకరింతురు కాని, బ్రహ్మశరీరత్వ, సత్యత్వ, పరిణామత్వాదులు నిరాకృతములు. వీటినంగీకరించిన నిత్యత్వ, నిర్వికారత్వము లసంగతము లగునని అద్వైతుల ఆక్షేపము.

## జీవుడు.

జీవుడుకూడ బ్రహ్మముయొక్క శరీరము. జీవుడుకూడ చైతన్యస్వరూపుడే. కాని, అణుపరిమాణ — యుక్తుడు. బ్రహ్మము, జీవులకు సజాతీయ, విజాతీయ భేదములు లేవు; స్వగతభేద మున్నది. బ్రహ్మము పూర్ణము, జీవుడు అసంపూర్ణుడు. బ్రహ్మము ప్రభువు. జీవుడు దాసుడు. ఇరువురకును స్వయంప్రకాశత్వమున్నది, జ్ఞానాశ్రయత్వమున్నది. జీవుడు ప్రతిశరీరమున భిన్నుడు. అతని స్వరూపము సుఖస్వరూపమేయైనను, సంసారదశయందు దుఃఖమును బొందును. ఇతడు కర్త, భోక్త, శరీరి, శరీరము. ప్రకృతి నపేక్షించి శరీరి, ఈశ్వరు నపేక్షించి శరీరము.

అద్వైతులు సంపూర్ణముగ, ఈ విషయమున వ్యతిరేకాభిప్రాయులు. జీవుడు విభుడు, బ్రహ్మము యొక్క ప్రతిబింబము—కాదు—

బ్రహ్మమే. జీవభావము అవిద్యాకల్పితము. ఇతని స్వరూపము సచ్చిదానందమయము. జీవుని కార్యముగను, బ్రహ్మశరీరముగను అంగీకరించిన అనిత్యత్వదోషము, శరీరమునందున్న దుఃఖిత్వాదులు శరీరియగు బ్రహ్మమునకూడ ఉండుట అను దోషములు పొర్లగలవు. కాని, ఈ రెండువిషయములకు విశిష్టాద్వైతులు సరియైన సమాధానము నీయజాలకున్నారు.

## జీవభేదములు.

రామానుజదర్శనమున జీవులు బద్ధ, ముక్త, నిత్యులని మూడు విధముల చెప్పబడుచున్నారు. సంసార - నివృత్తిని బొందనివారు బద్ధులు; దేవ, మనుష్య, తిర్యక్, స్థావరములుగాగల జీవులందరును బద్ధులే. బద్ధులు శాస్త్రవశ్యులు, అవశ్యులు అని రెండు తెఱగులు. జ్ఞానమును సంపాదించు ఇంద్రియములు గలవారు శాస్త్రవశ్యులు; తిర్యక్స్థావరములు అవశ్యములు. శాస్త్రవశ్యులు బుభుక్షు, ముముక్షువులని రెండువిధముల విభజింపబడుచున్నారు. త్రివర్గనిష్ఠులు బుభుక్షువులు. వీరు మరల అర్థకామపరులు, ధర్మపరులని ద్వివిధముల వెలయుచున్నారు. దేహాత్మాభిమానపరులు, అర్థకామపరులనంబడుదురు. యజ్ఞ దాన తపో రూపమగు వైదికధర్మమునాశ్రయించినవారు ధర్మపరులు. ధర్మపరులు బ్రహ్మశివాది అన్యదేవతాపరులు, నారాయణాశ్రితపరులు అని రెండువిధముల వెలయుచున్నారు. అందు, నారాయణాశ్రితపరులలో మరల, ఆర్త, జిజ్ఞాసు, అర్థార్థులను త్రివిధ భేదము లున్నవి. ముముక్షువులు కైవల్యపరులు మోక్షపరులని రెండు తెఱగులనున్నారు. జ్ఞానయోగము వలన ప్రకృతినుండి స్వాత్మను వేఱుపరచుకొనినవాడు, కైవల్యపరుడు. మోక్షపరులలో భక్త, ప్రపన్నులను ద్వివిధభేదము లున్నవి. పూర్వమీమాంసా పఠన ఫలితముగ మోక్షమును గోరువారు భక్తులు. భక్తిమార్గమున త్రైవర్ణికులకు, దేవతలకు అధికార మున్నది. శూద్రులకు లేదు. సాధనభక్తినిష్ఠులు, సాధ్యభక్తినిష్ఠులని భక్తులు రెండు తెఱగుల నున్నారు. అకించినులును, అనన్యగతులునునై భగవంతుని ఆశ్రి

యించుకొనిన వారు ప్రపన్నులు. వీరియందు మరల త్రైవర్గికపర, మోక్షపర భేదము లున్నవి. ఏకాంతికి, పరమైకాంతికి అని మఱియొక విభజన. కేవలము నారాయణాశ్రితుడును, మోక్షకామియును నగువాడు ఏకాంతికి. భక్తిజ్ఞానములుగాక, ఇతరములగోరనివాడు పరమైకాంతికి.

## సాధన.

రామానుజుడు, ధ్యానము ఉపాసనల ముక్తిసాధనములుగ గ్రహించినాడు. భక్తియే మోక్షోపాయము; జ్ఞానము కాదు. బంధము పారమార్థిక మగుటవలన, పరమపురుషుని ప్రసాదమువలననే తొలగును. వేదనా, ధ్యాన ఉపాసనాశబ్దవాచ్యమగు నదియే భక్తి; దాని స్వరూపము తైలధారనుబోలు ధ్రువానుస్మృతి. ఇయ్యది, అశ్రయాది త్రివిధ దోషరహితమైన ఆహార శుద్ధ్యాదులవలన విశుద్ధతను బొందినవాని పక్షమున ప్రత్యక్షముగ పరిణమించును.

## ప్రపత్తి.

ప్రతికూల వర్జనమును, అనుకూల సంకల్పపూర్వకమును, సర్వతోభావమును నగు ఆత్మసమర్పణయే ప్రపత్తి యనబడు న్యాసవిద్య. దీనిని రామానుజు డిట్లు అభివర్ణించినాడు:

'సత్యకామ, సత్యసంకల్ప, పరబ్రహ్మభూత, పురుషోత్తమ, మహావిభూతే! **** అఖిలజగత్స్వామిన్, అస్మత్స్వామిన్, సత్యకామ సత్యసంకల్ప సకలేతర విలక్షణ! అర్థికల్పక! ఆపత్సఖ! శ్రీమన్నారాయణ! అనన్యశరణః త్వత్పాదారవిందయుగళం శరణ మహం ప్రపద్యే.

పితరం మాతరం దారాన్ పుత్రాన్ బంధూన్ సఖీన్ గురూన్,
రత్నాని ధనధాన్యాని క్షేత్రాణిచ గృహాణిచ.
సర్వధర్మాంశ్చ సంత్యజ్య సర్వకామాంశ్చ సాక్షరాన్,
లోకవిక్రాంతచరణౌ శరణం తేఽవ్రజం విభో!

—శరణాగతి గద్యమ్.

తక్కిన విభాగములమాట ఎట్లున్నను శాంకర దర్శనమునకు, బద్ధ, ముక్త, నిత్యులను త్రివిధభేదములను వ్యావహారికముగ నొప్పుకొనుటకు ఆటంకము లేదు. వాస్తవమున అందఱును ముక్తులే; బంధము భ్రమ. ఇది తొలగుటకు జ్ఞానముమాత్రమే అవ్యభిచారమగు ఉపాయము. ఈ జ్ఞానమునకు శూద్రులకుగూడ అధికార మున్నది. నిత్యజీవు లనబడు నారద విష్వక్సేనాదులు, అద్వైతుల 'ఆధికారిక పురుషుల'ను బోలియున్నారు. కర్మ, భక్తియోగములు పారంపర్యముగ మోక్షకారణములు. శంకరుని భక్తినిర్వచనము – ఆత్మానుసంధానము; జీవేశ్వరుల భేదబుద్ధి తొలగుట, దాసత్వము కాదు. శంకరుడు శూద్రులకుగూడ జ్ఞానాధికారమును ఒప్పుకొనువిషయమును గాంచిన, ఆయన విశాల దృష్టియు, ఔదార్యమును బోధపడగలవు. రామానుజుడు శూద్రాధికారమును నిషేధించుట, వారి గురుపరంపరలో కొందఱు శూద్రు లుండుట పరస్పర విరుద్ధములు, విస్మయకరములు.

## ఉత్క్రాంతి – ముక్తి.

ప్రాకృత దేహము తొలగి, అప్రాకృత దేహమున వైకుంఠమున కలిగి సమానభోగమును, నారాయణుని చిరదాసత్వమును బొందుటయే రామానుజుని అభిప్రేతమగు ముక్తి. ఆముక్తిని బొందుక్రమ మిట్టిది: ముక్తికి అర్హుడగు జీవుడు సుకృతములను హితులకును, దుష్కృతములను శత్రువులకును, సంపదను దాయాదులకును వదలి, వాక్కును మనస్సునను, మనస్సును హృదయమునను నిల్పి, ముక్తిద్వారమగు సుషుమ్నానాడియందు ప్రవేశించి, బ్రహ్మరంధ్రద్వారమున నిర్గతుడగును. పిదప, సూర్యకిరణముల నాశ్రయించి దిన, పక్ష, ఉత్తరాయణ సంవత్సరాభిమానులగు దేవతలవలన మార్గమున సత్కరింపబడి, సూర్యమండలమును భేదించుకొని సూర్యలోకమున కరుగును. అట చంద్ర, విద్యుత్, వరుణ, ఇంద్ర, ప్రజాపతులను ఆతివాహిక – పథప్రదర్శకుల సాయమును బడసి క్రమముగ విరజానదిని చేరుకొనును. అట, సూక్ష్మ శరీరమును పరిత్యజించి, దివ్యదేహమును బడసి, ఇంద్ర

ప్రజాపతులను ద్వారపాలకుల ఆదేశమున వైకుంఠమును ప్రవేశించి ఐరమ్మదమను సరోవరమును, సోమసవనమను అశ్వత్థవృక్షమును గాంచి, అప్సరసలచే నభినందితుడగును. పిదప, అనంత, గరుడ, విష్వక్సేనులకును, ఆచార్యులకును ప్రణమిల్లి, భగవత్పర్యంక సమీపమునకు గొనిపోవబడును. ఆ పర్యంకమున ధర్మపీఠమున, నానాభరణ భూషితుడును, దేవీసహితుడును నగు శ్రీమన్నారాయణుడు వెలయుచుండును. ముక్తుడాయనకు ప్రణమిల్లిన, భగవంతుడంకమ్మున గ్రహించి, దాసత్వమునను గ్రహించును. దాస్యానంద అనుభవము నందుచు, ఈశ్వరేచ్ఛాధీనమగు సర్వత్ర సంచరణాది శక్తులనుముక్తుడు పొందును

ఈ నిర్గమనము పారిభాషికముగ 'ఉత్క్రాంతి' లేక 'గతి' యనబడును. శంకరునిముక్తి, 'ఉత్క్రాంతి' వివర్జితము; 'గతి'రహితము. ఇటనే, ఈ లోకముననే అనుభవింపదగినది, శంకరుని ముక్తి క్రియా సాధ్యముకాదు. కాక, సంస్కార్య, ఉత్పాద్యవికార్యములలో నేదియొక్కటియును గాదు; అప్య మనబడు ప్రాప్యవస్తుప్రాప్తి. అనగా, అజ్ఞానరాహిత్యము రామానుజునిముక్తి స్వర్గసుఖ విశేషము. రామానుజుడు, అద్వైతుల జీవన్ముక్తి, విదేహముక్తుల నొప్పుకొనడు. కాని, అద్వైతుల సగుణ-బ్రహ్మలోకమునకును, రామానుజుని వైకుంఠమునకును భేదము లేదు; మార్గముకూడ ఒక్కటియే. సగుణబ్రహ్మోపాసనాపరులు ఈ క్రమము ననుసరించియే బ్రహ్మలోకమున కరిగి, అట ప్రకృష్టతరమగుసాధనను సల్పి, 'విదేహకైవల్యము' నందుదురని ఒప్పుకొనుచున్నారు. రామానుజుడు, తనముక్తిని తన నిర్దిష్టవస్తువును ఒప్పుకొననివారికి, అపరిమితమగుశాస్తిని విధించుచున్నాడు. బ్రహ్మము తానేయని తలచువారు రాజద్రోహులను బోలువారు, ముక్తివారికి బహుదూరము. ఈ ముక్తివిషయమునగూడ, ఆచార్యద్వయము యొక్క తారతమ్యము తేటపడగలదు. శాంకరమతమున ఏఒక్కడును అధోగతిని పొందుట లేదు; క్రమముగ ఉన్నతిని బొందుచున్నాడు.

చివరకు, తత్త్వము తప్పకుండ లభించును. ఈ సువిశాలదృష్టి రామానుజునియందుగాని, తదితర వైష్ణవాచార్యులయందుగాని కన్పించదు.

## సమాప్తి.

మాయావాదఖండనము, అనిర్వాచనీయ వాదఖండనము, నిర్విశేషవాదఖండనము, అసత్ఖ్యాతివాదఖండనము, మహావాక్యార్థవిచారము మున్నగు జటిలవిషయముల ప్రస్తావింప సాహసించుటలేదు. ఈ వాదఖండనావసరమున రామానుజుడు విశేషనైపుణ్యమును జూపినను, నెగ్గినట్లు కన్పింపదు. 'అహం బ్రహ్మాస్మి' మున్నగు స్పష్టార్థద్యోతకవాక్యముల నర్థవాదములని వచించి తప్పుకొనినాడు. రామానుజుడు, 'సదసద్విలక్షణత్వ' మను అనిర్వచనీయవాదుల నిరుక్తిని ఖండింపయత్నించి వారికొకింత ఉపకారమునే సల్పినాడు. తరువాతివారు, 'ప్రతిపన్నోపాధౌ త్రైకాలిక నిషేధప్రతి యోగిత్వమ్' (వివరణకారుడు), 'జ్ఞాననిర్వర్త్యత్వమ్' (వివరణమ్) 'సద్భిన్న రూపత్వమ్' (ఆనందభట్టారక), 'స్వాత్యంతాభావాధికరణ ప్రతీయమానత్వం' (చిత్సుఖ) అను అభేద్యలక్షణముల నిర్వచించినారు. శాంకరభాష్యము నెఱుంగగోరువారు, శ్రీభాష్యమును బఠించుట చాలగ అవసరము. శంకరుడు చూపినంతగ, రామానుజుడు శ్రుతి ప్రమాణమును జూపజాలక, స్మృతులనే బహుళముగ వాడినాడు. గ్రహించిన శ్రుతివాక్యములు పెక్కులు, అప్రసిద్ధములగు ఉపనిషత్తులకు జెందుచున్నవి. పాశ్చాత్యదార్శనికులగు స్పినోజా, హెగేలుల మతవాదమునకును, రామానుజ దర్శనమునకును సన్నిహిత సంబంధమున్నది.

## మహిమాఖ్యాతి.

శంకర రామానుజ లిద్దరును 'యుగసంధి' సమయమున జన్మించి, సంస్కృతిని నిలబెట్టిన మహాపురుషులు. రాధాకృష్ణ పండితుడు వచించినట్లు, ఒకరి గుణములు మఱియొకరిదోషములై నిలిచినవి. శంకరుడు జ్ఞానులలో శ్రేష్ఠుడై, నేటికిగూడ సమస్తజగత్తునందలి

విజ్ఞుల అభివాదనములు బొందుచున్నాడు. వివేకానందుని భవిష్యద్వాణి ననుసరించి, సైన్సు, అద్వైతవాదములు చేతులు గలుపుకొనుచున్నవి. రామానుజుడు భక్తశ్రేష్ఠుడై, భావుక చూడామణియై భారత దేశము నందలి జనసామాన్యము యొక్క హృదయమున శాశ్వతముగ నధిష్ఠితుడై వెలయుచున్నాడు. ఆయన నిరూపించిన దాస్యభక్తియే, తరువాత శ్రీ కృష్ణ చైతన్యుని యందు సఖ్య, వాత్సల్య, మధుర, రూపముల విస్తరిల్లి దేశమును పునీత మొనర్చినది.

ముగించుటకు : వేదాంత దర్శనమునందలి ఏ ఒక్క వాదమును ఆ ఆచార్యునితోడనే ఆరంభమైనదని తలపగూడదు. అనుపూర్వికముగ ఆయా వాదధారలు ప్రవహించుచు, విశిష్ట ఆచార్యులవలన పెంపొందింపబడినవి. అశ్మరథ్య, ద్రమిడ, టంక, గుహదేవ, శ్రీవత్సాంకులు విశిష్టాద్వైత వాదమును, రామానుజునకు బూర్వమే ప్రవచించియుండిరి; నాథముని, యామునులు సాక్షాత్ పూర్వులు.

" యో నిత్య మచ్యుతపదాంబుజయుగ్మరుక్మ
వ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే
అస్మద్గురో ర్భగవతోఽస్య దయైకసింధో
రామానుజస్యచరణౌ శరణంప్రపద్యే. "

# వేదాంత దర్శనము:

# స్వతంత్రాస్వతంత్ర వాదము - 3

## ( మాధ్వ మతము )

రసం ప్రశంసంతి కవిత్వనిష్ఠా
బ్రహ్మామృతం వేదశిరోనివిష్టాః,
వయంతు గుంజాకలితావతంసం
గృహీతవంశం కమపి శ్రయామహే.

### ప్రవేశిక:

ద్వైతవాదము, పూర్ణప్రజ్ఞ దర్శనము, లేక స్వతంత్రాస్వతంత్ర వాదము అనబడు వేదాంతదర్శనశాఖకు మూలము శ్రీమధ్వాచార్యుడు. మధ్వమతము, లేక బ్రహ్మసంప్రదాయ మనబడు ఈ పరంపరకు సనత్కుమారుడు ఆదిగురువుగ చెప్పబడుచున్నను, ఉపనిషత్తులు, లేక వేదాంతసూత్రముల ద్వైతప్రసక్తి కనబడదు. కాశకృత్స్న, ఆశ్మరథ్య, ఔడులోములు క్రమముగ అద్వైత, విశిష్టాద్వైత, భేదాభేదవాదములను బరిగ్రహించినట్లు వేదాంతసూత్రములవలన గ్రహింపగలము కాని సంపూర్ణముగ ద్వైతమతము నవలంబించిన వారిపేరు ప్రాచీనులలో నగపడదు. సాంఖ్యులు మున్నగువారు ద్వైతవారులే యైనను, మాధ్వద్వైతమునకును, తత్పరిచారిత ద్వైతమునకును విభేద మున్నది. శాంకర, భాస్కరీయ, శ్రీకంఠ, నింబార్క మతవాదముల ప్రచండవాయువులు వీచుచున్నప్పుడు మరల నొక విశేష వాదమును లేవదీసి, నిలువబెట్టగలిగిన ఈ ఆచార్యుని ప్రతిభ ప్రశంసనీయము. నాథముని, యామున, రామానుజాచార్యులను మహోన్నత నగశిఖరములనుండి ప్రవహించిన భక్తిమందాకిని నీతడు వహించి, తదనంతరము ప్రభవించిన శ్రీ కృష్ణచైతన్య దేవునియందు మిళిత మగుటకు కారణమైనాడు (చైతన్య మహాప్రభుని మతవాదము మాధ్వ

గాడీయమతవాద మనబడు చున్నది). వల్లభాచార్యునకు గూడ ఈమత మొకింతశరణ్యమైనది. మఱియు, ఈమధ్వమతాచార్యులు స్వమనీషాబలమున అద్వైతమతమును న్యాయపరశువుతో సమూలముగ పెల్లగించివేయ ప్రయత్నించి, అయ్యది ఇతోధికముగ బలపడుటకు కారకులైనారు. వీరియందు జైనమత ప్రభావము మిక్కుటముగ కనబడుచున్నది. ఈ ఆచార్యులలో నే యొక్కరికిని పరమతసహనము ఉన్నట్లగుపడదు. అనుచితభాషాప్రయోగమున వీరగ్రగణ్యులు. అగుగాక, నోటితో అద్వైతవాదము నుచ్చరించు దిగ్గజములకుగూడ మధ్వుడు నిర్వచించిన భక్తిపంథయే గతియైనది.

**జీవిత గ్రంథములు:**

త్రివిక్రమునిపుత్రుడగు నారాయణుడు 'మధ్వవిజయము', 'మణిమంజరి' అను రెండుగ్రంథములలో ఏతదాచార్యుని జీవితమును వర్ణించినాడు. త్రివిక్రముడు శ్రీమధ్వుని శిష్యుడు. అందువలన నారాయణుడు ప్రశిష్యుడు. నరహరితీర్థస్వామి 'అనుశాసనము' గూడ ఈ విషయమున సాహాయ్యకారి. తిరుపతివాసులగు శ్రీ సుబ్బరావు గారును, సి. ఎన్. కృష్ణస్వామిఅయ్యరుగారును ఇంగ్లీషున వ్రాసిన జీవితగ్రంథములు రెండు లభించుచున్నవి. వెనుక 'శారద' యను మాసపత్రికలో శ్రీమధ్వాచార్యుని జీవితమును ప్రకటించినట్లు గుర్తు. ఆంగ్లమున దర్శనశాస్త్ర చరిత్రలను లిఖించిన దాసుగుప్త, రాధాకృష్ణ, హిరియన్న లీ ఆచార్యుని గుఱించి ప్రసంగింపకుండుట శోచనీయము. ఈలోటును శ్రీ నాగరాజశర్మగారు (Indian Realism) అను గ్రంథమును వ్రాసి తీర్చిరి.

**జీవితము:**

తులువదేశముననున్న వేలిగ్రామమున మీమాంసా మతవాదులగు కొందఱు బ్రాహ్మణులు వసించుచుండిరి. వారు కాలక్రమమున శాంకరమతప్రభావమునకు లోనయిరి. ఈ వంశమునకు జెందిన మధ్వ

గేహుడను సామాన్య గృహస్థుడే శ్రీ మధ్వాచార్యుని పిత; వేదవతి మాత. ఇరువురు పుత్రులును, ఒకకన్యకయు జనింప, పుత్రు లిర్వురును కాలగ్రస్తులైరి. తదనంతరము నారాయణప్రసాదమున క్రీ. శ. ౧౧౯౯ వ సం. మున ఈ తృతీయపుత్రుడు గల్గెను. ఈ సంప్రదాయజ్ఞులు ఈయనను వాయుదేవుని అవతారముగ జెప్పుదురు.

వాసుదేవ నామకుఁడగు ఈ బాలుడు యథోచిత సమయమున గ్రామపాఠశాలకరిగెనుగాని విద్య యంటలేదు. కుస్తీ మున్నగు వ్యాయామక్రీడలలో మేటియై, 'భీము' డను నామమును బడసెను. పరిణత వయస్సున, స్వయంకృషివలన శాస్త్రములను పఠింపగా సన్యాసగ్రహణేచ్ఛ పొడమెను. అచ్యుతప్రకాశుడను అద్వైతయతికడ సన్యాసమును గ్రహించి, పూర్ణప్రజ్ఞ నామమును బడసెను. పిదప, 'ఆనందతీర్థ' నామమును వహించి, అనంతేశ్వరమఠమునకు అధ్యక్షు డయ్యెను. కాని అద్వైతమతము నచ్చలేదు.

క్రీ. శ. ౧౨౩౮ – వ సం. మున దాక్షిణాత్య విజయమునకు బయలుదేరి, మంగళూరునుండి ఇరువది యేడు మైళ్ళదూరమున నున్న విష్ణుమంగళమును జేరుకొనెను. అట వివిధములగు యోగవిభూతులను ప్రదర్శించి, తిరువేంద్రమున కేగెను. అచ్చట శృంగేరీమఠాధిపతి యగు విద్యాశంకరులతో వాదించి ఓటమినందెను. అప్పటి నుండియే శ్రీమధ్వుడు శాంకరమతమును తీవ్రముగ విద్వేషింప మొదలిడెను. తరువాత రామేశ్వరమును, శ్రీరంగమును దర్శించి, పాలారునదీతీరము ననుసరించి ఉడిపిని జేరుకొనెను. రామేశ్వరమునందలి అద్వైత పండితులు తర్క యుద్ధమున కాహ్వానించిరిగాని శ్రీమధ్వుడు ఒప్పుకొనలేదు. ఉడిపియందున్నప్పుడే ఈయన గీతాభాష్యమును రచించియుండ వచ్చును.

యాదవ వంశీయుడగు దేవగిరిరాజైన మహాదేవునితో నీయన సంభాషించిన ట్లగపడుటచేత మరల క్రీ. శ. ౧౨౬౦ – వ సం. మున ఉత్తరభారత పరిభ్రమణమునకు బయలుదేరియుండవచ్చునని తోచుచున్నది. ఈ పర్యటనమున ఈయనకు పూలదండలు, ముళ్ళుగూడ

స్థానవిశేషము ననుసరించి లభించెను. ప్రాణరక్షకై గోవానగరము నకు లారిపోవలసి వచ్చెను. పిదప హరిద్వార, బదరీనారాయణముల వఱకును యాత్రల నొనరించెను. ఈసమయమున ముసల్మానులభాష నీయన నేర్చుకొనెను. వ్యాసుని ఆదేశము ననుసరించి విష్ణుని మహాత్త్వస్థాపన, సూత్రభాష్యరచనల కుపక్రమించెనని వినికి.

పిదప చాళుక్యనగరి యగు కల్యాణమును జేరి, శోభనభట్టు అనునాయనను శిష్యు నొనర్చుకొనెను. ఈయనయే శ్రీమధ్వుని అనంతరము పద్మనాభతీర్థుడను నామమును వహించి మధ్వమతము నకు మూలకందమయ్యెను. అచ్చటనుండి ఉడిపికి మరల చేరుకొని పూర్వగురుడగు అచ్యుతప్రకాశుని భయపెట్టి స్వమతమునకు ద్రిప్పు కొనెను. ఉడిపియందు శ్రీకృష్ణాలయమును నిర్మించి దానిని మధ్వ మతావలంబులకు ముఖ్యపీఠముగ నొనర్చెను. శ్రీరామానుజ ప్రవర్తిత మగు శంఖచక్రాది అంకనవిధానమును శాస్త్రప్రమాణమువలన నిరూ పించుట, యజ్ఞమున జరుగు పశుహింసను నివారించుట అనునవి ఈయన తరువాత నొనర్చిన కార్యములు.

ఈ సమయమున శృంగేరీపీఠ గురువుతో విరోధము హెచ్చు కాగా, ఆయన శ్రీమధ్వుని పుస్తకాలయమును దీసికొని, దానిమీాద మధ్వాచార్యుల కెట్టిహక్కును లేకుండున ట్లొనర్చెను. పిదప విష్ణు మంగళ రాజగు జయసింహుని సాయమున దానిని మరల మధ్వా చార్యులు సంగ్రహింపగలిగెను. ఈ సమయమున నారాయణ పండితుడు ఉపదేశమును గ్రహించెను. తండ్రి మరణింప సోదరుడు గూడ సన్యసించి విష్ణుతీర్థుడయ్యెను.

శ్రీమధ్వాచార్యుని జీవితశేషము సరికంతర మనుచోట గడపబడెను. అచటనే ఈయన పరమపదమునందెను. ఈయన మరణించిన సంవత్సరమును సరిగాజెప్ప వీలుపడకున్నది. మధ్వ సంప్రదాయస్థులు ౭౯ సం. ౬ మా. ౨౦ రోజులు ఈయన మత ప్రచారము సల్పెనందురు. శ్రీమధ్వుని జన్మ క్రీ. శ. ౧౧౯౯ అని చెప్పియుంటిని. ౭౯వ ఏట, అనగా క్రీ.శ. ౧౨౭౮ సం.మున ఈయన

సన్యాసము పుచ్చుకొనెను. కనుక క్రీ.శ. ౧౩౦౩ సం.మున ఇహామును వీడవలసి వచ్చుచున్నది. కాని చారిత్రికముగ ఈలెక్క సరిపడదు.

## గ్రంథములు :

మధ్వాచార్యులు సుమారు ముప్పదినాలుగు గ్రంథములను సంస్కృతమున విరచించిరి. వీని నన్నిటిని కుంభకోణమునందలి మధ్వ విలాస బుక్ డిపోవారు క్రీ. శ. ౧౯౧౧ న ప్రకటించియున్నారు.

గీతాభాష్యము ఈయన మొదట రచించిన గ్రంథమై యుండ వచ్చును. ఇది గీతకు అతిసంక్షిప్తమగు టీక. దీనికి శ్రీ సేలం సుబ్బ రావుగారి ఇంగ్లీషు అను వాదము ఉన్నది.

పూర్ణప్రజ్ఞభాష్య మనబడు సూత్రభాష్యమున పౌరాణిక వాక్యసాహాయ్యమున స్వమతము సమర్థింపబడినది. ఈ భాష్యమునకు జయతీర్థాచార్యుని 'తత్త్వప్రకాశిక' అను టీక, ఆటీకకు రాఘవేంద్ర స్వామి 'భావదీప' మను వృత్తి యున్నవి. 'తత్త్వప్రకాశిక' పై వ్యాస రాజస్వామి 'తాత్పర్యప్రకాశిక' యను మఱియొక వృత్తినిగూడ రచించినాడు. 'అనుభాష్య' మనుశ్లోక గ్రంథమున మధ్వాచార్యులు బ్రహ్మసూత్రమునందలి మొదటినాలుగు సూత్రముల అర్థమును వివ రించిరి. దీనికి రాఘవేంద్రస్వామి 'తత్త్వమంజరి'అను టీకను విరచించెను. 'అనువ్యాఖ్యానము' అను గ్రంథమున శ్లోకరూపమున బ్రహ్మసూత్ర ముల వ్యాఖ్యను మధ్వాచార్యులు రచించిరి. పూర్ణప్రజ్ఞభాష్య మునకు సుబ్బరావుగారి ఇంగ్లీషు అను వాదమున్నది. 'న్యాయవివర ణము'న చతుస్సూత్రీయ శబ్దార్థము వివరింపబడినది.

'గీతా తాత్పర్యనిర్ణయము' అను గ్రంథమునగూడ మధ్వా చార్యులు గీతను వ్యాఖ్యానించిరి. దీనిపైన జయతీర్థుని 'న్యాయదీపిక' అను టీక, తామ్రపర్ణివృత్తి వ్రాయబడెను.

'ప్రమాణలక్షణము'న మధ్వాచార్యులు ప్రమాణములను గుఱించి శ్లోకములలో వివరించిరి.

ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, ఐతరేయ, తైత్తిరీయ, ఛాందోగ్య, బృహదారణ్యకములపై మధ్వభాష్యమున్నది. ఈ భాష్యములకు జయతీర్థ, మస్కరి, రఘునాథ, వ్యాసతీర్థ, విదేశి, ఉమార్జి, శ్రీనివాసతీర్థ, తామ్రపర్ణి, రఘూత్తమస్వాములనువారు రచించిన వృత్తి, టీకా, టిప్పణులున్నవి. ఇవిగాక కథాలక్షణము, ఉపాధిఖండనము (దీనికి ఒకటీక, రెండు టిప్పణులు నున్నవి), మాయా వాదఖండనము (జయతీర్థటీక), ప్రపంచ మిథ్యాత్వవాద ఖండనము (జయతీర్థటీక), తత్త్వసంఖ్యానము (జయతీర్థ, సత్యధర్మతీర్థ టీకలు), తత్త్వవివేకము (జయతీర్థటీక), తత్త్వోద్యోతము (జయతీర్థ, రాఘ వేంద్ర, శ్రీనివాసటీకలు), కర్మనిర్ణయము, విష్ణుతత్త్వవినిర్ణయము (జయతీర్థటీక) అను ప్రకరణ గ్రంథములు ఈ ఆచార్యవిరచితములు.

యమకభారతము, భాగవత తాత్పర్యనిర్ణయము, మహాభారత తాత్పర్య నిర్ణయము అను సంగ్రహగ్రంథములనుగూడ మధ్వా చార్యులు విలిఖించిరి. ద్వాదశస్తోత్రము, కృష్ణామృతమహార్ణవము (శ్రీనివాసటీక), తంత్రసారసంగ్రహము, సదాచారస్మృతి అనునవి సాధనపథమునకు జెందిన మాధ్వగ్రంథములు.

ఇవిగాక ఋగ్వేద ప్రథమ మండలమునందలి మొదటి నలు వది సూక్తములకు భాష్యమును మధ్వాచార్యులు విరచించిరి; జయ తీర్థుడు 'సంబంధదీపిక' అను టీకను సమకూర్చెను; రాఘవేంద్రస్వామి 'మంత్రార్థమంజరి' ని విలిఖించెను.

ఇవి శ్రీమధ్వాచార్య విరచిత గ్రంథములు. ఇక ఈయన ఈ గ్రంథములందు ప్రపంచించిన మతమును గుఱించి ఆలోచింతము.

అధికారి :

మాధ్వమతమున అధికారి మూడువిధములు — మంద, మధ్యమ, ఉత్తములని. మనుష్యులయందు ఉత్తమగుణ సంపన్ను లగువారు మందులు. ఋషులు, గంధర్వులు మధ్యములు. దేవతలు

ఉత్తములు. ఇయ్యది జాతిగతభేదము. గుణగతమగు భేదముకూడ యున్నది. దాని తెలిగియ్యది: పరమపురుషునియందు భక్తిగలవాడును, అధ్యయనశీలుడును నగు వ్యక్తి అధమాధికారి; శమసంయుక్తుడు మధ్యమాధికారి, సకలముఅనిత్యమని బుద్ధియుదయింప, కేవలము విష్ణుని శరణమును బొందినవాడు ఉత్తమాధికారి. ఇతడు కర్మ సన్యాసి.

## సంబంధము :

శాస్త్రమునకును, బ్రహ్మమునకును ప్రతిపాద్య ప్రతిపాదక భావసంబంధము. బ్రహ్మము శాస్త్రగమ్యము, అగమ్యముకాదు, దర్శనీయము, వాచ్యము. 'అవాఙ్మానసగోచర' మన అప్రసిద్ధమనియే ఎఱుగనగును కాని సంపూర్ణముగ అగోచరమని తలపరాదు. దాని గుణముల కంతులేదు. మేరుపర్వతము దర్శనీయమే కాని మహాత్తు అగుటవలన సంపూర్ణదర్శనమలభ్యము. 'ఆత్మన్యేవాత్మనాత్మానం పశ్యేత్' అని శ్రుతియందుండుటవలనను, 'ఈక్షతే ర్నాశబ్దం' అని సూత్రకార నిర్వచనమువలనను బ్రహ్మము శబ్దగమ్యమే. ౧

## విషయము :

అశేష సద్గుణ సంపన్నుడగు విష్ణువే ప్రతిపాద్యము. శ్రుతి స్మృతి పురాణేతిహాసముల సర్వత్ర విష్ణుని బ్రహ్మత్వము ప్రతిపాదితము. ఈయన దేశకాలములవలన అపరిచ్ఛిన్నుడు, అనంతుడు. ఈయన గుణములనిట్టివి, ఇంతవి అని చెప్పజాలము. కనుకనే నిర్గుణుడు. ఈయన జగత్తుయొక్క సృష్టిస్థితియొక్క సంహారములకు కారణము. అశేషగుణములకును ఆకరుడు. బ్రహ్మము నిర్విశేషము కాదు, సవిశేషము. జీవుడీయననుండి అత్యంతము భిన్నుడు.

---

౧. ఈ సూత్రమునకు సాంఖ్యమతఖండనపరముగ శ్రీశంకర రామానుజులు అర్థమును చెప్పిరి. శ్రీమధ్వుని అర్థమును బలదేవుడుకూడ గ్రహించెను; వల్లభుడుకూడ అనుసరించెను.

ప్రయోజనము:-

ఆనందప్రాప్తి, దుఃఖనివృత్తులే ప్రయోజనము. ఈశ్వర నామాంకన, నామకరణ, భజనాదుల నాయన ప్రీతుడగును. ఆయన ప్రసాదమున సాలోక్య సారూప్యముక్తులు లభించును. వైకుంఠపతి యగు విష్ణువే సేవ్యుడు. ముక్తపురుషులు వైకుంఠమున కరిగి, నారాయణసేవ నొనర్చి పరమానందమును బొందుదురు. వైకుంఠ ప్రాప్తి యగు ముక్తియే పరమప్రయోజనము.

ప్రమాణము:-

యథార్థజ్ఞానమును కలిగించునదే ప్రమాణ మని సామాన్య నిర్వచనము. మధ్వమతమున జ్ఞేయవస్తు ప్రతిపాదికము జ్ఞానము- జ్ఞానమే ప్రధాన ప్రమాణము, జ్ఞానజ్ఞేయములకు మధ్య ఎట్టి అవాంతరవస్తువుయొక్క ప్రయోజనమును లేదు. జ్ఞానోదయానంతరము తత్సాయము తొలగిపోవుచున్నది. ఇంద్రియములవలన జ్ఞానము కలుగుపట్ల ఇంద్రియములు జ్ఞానముయొక్క అంశము కావు. జ్ఞానోదయానంతరము గూడ అవి జ్ఞానాంశములు గాజాలవు. జ్ఞానము ఈ ఇంద్రియముల సాయమున వస్తువులను గ్రహించుటలేదు. కనుక జ్ఞానము లేక బోధయే ప్రమాణము (ప్రమాణలక్షణము).

ఈ ప్రమాణము కేవలము, అనుప్రమాణము అని ద్వివిధము. అందు ఈశ్వరుడు, లక్ష్మి, యోగ్యము, యోగి అనునవి కేవలప్రమాణములు. ఈశ్వరుడును, లక్ష్మియును అనాది, నిత్యములు. అనుప్రమాణము ప్రత్యక్ష, అనుమాన, ఆగమము లని మూడువిధములు. 'నిర్దోషార్థేంద్రియ సన్నికర్ష' ప్రత్యక్షప్రమాణము. నిర్దోషోపపత్తి అనుమానము. 'నిర్దోషశబ్దము' ఆగమము. ఇయ్యది స్వతఃసిద్ధము, అపౌరుషేయము, సత్యస్వరూపము, సత్యపరిజ్ఞానోపాయము, స్వతః ప్రమాణము; నిత్యము. అనుమానాదులకు నియతప్రామాణ్యము లేదు (సూత్రభాష్యము). అర్థాపత్తి,అభావములు అనుమానాంతర్గతములు.

ఈజ్ఞాన మాపేక్షికము. జ్ఞాతృజ్ఞేయములు లేకున్న జ్ఞానము కలుగదు. జ్ఞానము, చింత అభిన్న వస్తువులు. జ్ఞాతృజ్ఞేయములు చిర

సంబద్ధములు. నిర్వికల్పక జ్ఞాన మసంభవము; జ్ఞానము లన్నియు సవికల్పకములు. విచారమున ప్రమాణిత మగునదే సత్యము. సత్యము, దృశ్యవస్తువు లభిన్నములు (విష్ణుతత్వనిర్ణయము).

పదార్థములు:-

మధ్వమతమున పదార్థములు పది. అవి: ౧. భావవస్తువు, ౨. గుణము, ౩. క్రియ, ౪. జాతి, ౫. విశేషత్వము. ౬. విశిష్టము, ౭. అంశి, ౮. శక్తి, ౯. సాదృశ్యము, ౧౦. అభావము అనునవి. ఇవన్నియును హరిపరతంత్రములు. వీటి పారతంత్ర్యమును గ్రహించిన వాడే ముక్తిని బొందును (తత్త్వవివేకము).

తత్త్వములు:-

ఈ మతమున స్వతంత్రము, అస్వతంత్రము అని రెండు విధములు. అశేష సద్గుణ సంపన్నుడగు విష్ణువే స్వతంత్రుడు, జీవ జగత్తులు అస్వతంత్రములు (తత్త్వ సంఖ్యానము).

ఇక ఈ తత్త్వములను గుఱించి ఒకింత ప్రసంగింతము.

జగత్తు:-

జగత్తు సత్యము, జడము, అస్వతంత్రము. భగవంతుడి జగత్తును నియమించుచున్నాడు. జగత్తు కాల సాపేక్షికముగ అనంతము. అచేతన వస్తువులు నిత్య, అనిత్య, నిత్యానిత్యము లని త్రివిధములు. వేదములు, పురాణములు, కాలము, ప్రకృతి నిత్యములు. నిత్యానిత్యములు మూడు విధములు, అనిత్యము అసంసృష్టము సంసృష్టము అని రెండువిధములు. మహత్, అహంకార, బుద్ధి, మనః పంచభూత, పంచతన్మాత్ర, దశేంద్రియములు అసంసృష్టములు. శరీరము, తద్గతములు సంసృష్టములు.

జీవుడు:-

జీవు డణుస్వరూపుడు, ప్రతిదేహమునందును భిన్నుడు, అస్వతంత్రుడు. ఈశ్వరునితో నైక్యమెన్నడును కలుగజాలదు. జీవుడు సేవకుడు, భగవానుడు సేవ్యుడు. పరమేశ్వరుడు సేవ్యు డగుటవలన,

రాజును భృత్యుడును భిన్నులైనట్లు, జీవేశ్వరులు భిన్నులు. పురుషార్థప్రార్థన మొనర్పబోయి ఆధిపత్యమును బొంద గోరిన అఘాతములే దొరకును. భగవద్గుణోత్కర్షవలననే ఇష్టప్రాప్తి యగును. అభేదము నొందగోరి, విష్ణుని గుణములు ఎండమావులవంటి వనువారు 'అంధతామిస్ర' నరకమును బొందుదురు (మహాభారత తాత్పర్య నిర్ణయము). జీవుడు చేతనుడైనను అతని జ్ఞానము పరిమితము, కాల సాపేక్షముగ అపరిమితము. ఈ జీవులు దుఃఖసంస్పృష్టులు, అసంస్పృష్టులు అను రెండు విధములుగ నుందురు. దుఃఖసంస్పృష్టులయందు ముక్తియోగ్యులు, అయోగ్యులు అను రెండు భేదము లున్నవి. సాత్విక, రాజసిక, తామసికులని మఱియొక విభజన. వైకుంఠమును బొందువారు, అనంతనరకమును బొందువారు, నియతముగ సంసారమున భ్రమించువారు అని ఇంకొక విభాగము.

బ్రహ్మము:-

నిఖిల సద్గుణాలయుడగు విష్ణువే ఏతన్మత ప్రతిపాద్యమగు బ్రహ్మము. ఈ యన స్వతంత్రుడు. బ్రహ్మ, శివాదులకంటె శ్రేష్ఠుడు. దేవత లందఱును ఈయనకు వశులు. సృష్టిస్థితిలయముల కీయన కర్త, ముక్తిప్రదాత, ముక్తుల కాశ్రయుడు. ఈయనశక్తి అపరిమితము (విష్ణుతత్త్వ నిర్ణయము).

ఈయన భావాభావములకంటె విలక్షణుడు. భావవస్తువులు చేతనాచేతన భేదముల రెండు విధములు. జీవుడు చేతనుడు, జగత్తు అచేతనము. ఈ రెండును భగవదధీనములు. భగవానుడు వీటి నుండి సంపూర్ణముగ వేరు.

సాధన:-

భక్తి, త్యాగము, ఈశ్వరుని ప్రత్యక్షానుభూతి ముక్తికి సాధనములు. ధ్యానము లేకున్న ఈశ్వరసాక్షాత్కారము కలుగదు. వేదాధ్యయనము, ఇంద్రియ సంయమము, విలాసత్యాగము, ఆశాభయములపట్ల ఔదాసీన్యము, జాగతిక వస్తువుల వినాశశీలతా జ్ఞానము, ఆత్మసమర్పణములు అంగములు. సేవ ముఖ్యసాధనము.

ఇది అంకనము, నామకరణము, భజనము అని మూడువిధములు. నారాయణనామ స్మరణార్థము శరీరమునశంఖచక్రాదులను చిత్రింపను కొనుట అంకనము. సంతతికి కేశవాదినామము లుంచుట నామకరణము. భజన వాచిక, కాయిక, మానసికము లని మూడువిధములు. సత్య, హిత, ప్రియవాక్య కథనము, స్వాధ్యాయము అని వాచిక భజన నాల్గువిధములు. దాన, పరిత్రాణ, పరిరక్షణము లని శారీరక భజన మూడువిధములు. దయా, స్పృహా, శ్రద్ధలని మానసికభజన మూడువిధములు. ఇట్లు భజన దశవిధము లగుచున్నది. ఈ భజనను నారాయణార్పణపూర్వకముగ నొనర్పవలెను. భగవద్భక్తి. జ్ఞాన, వైరాగ్యపూర్వకముగ కర్మ నాచరింపవలెను. (కర్మనిర్ణయము).

ముక్తి:-

కర్మయొక్క ఫలితము జ్ఞాన మనబడు భక్తి. తత్ఫలమే ముక్తి. ముక్తియన జీవన్ముక్తి. నిర్వాణముక్తులు గావు. వైకుంఠప్రాప్తి. ముక్తజీవ ఈశ్వర సేవకుడు. ఇది పురుషార్థములలో నుత్తమము. ఇది యొక్కటియే సత్యము, తక్కిన వసత్యములు. ధ్యానఫలముగ జీవేశ్వర భేదము, జడేశ్వరభేదము. జీవభేదము, జడజీవభేదము, జడభేదముల జ్ఞానము కలుగ ముక్తిలభించును. పైని యథార్థజ్ఞానము, ఈశ్వర గుణోత్కర్షజ్ఞానములు గూడ ముక్తికి పూర్వ మవసరములు.

పరమతఖండన:-

సంక్షిప్తముగ నియ్యవి మధ్వాచార్యులు ప్రతిపాదించిన విషయములు. ఇవిగాక ఈయన పరమతముల నిరువది యొక్కంటిని ఖండించినట్లు వినికి. ఈయన ముఖ్యముగ శాంకరదర్శన ప్రతిపాద్య విషయములగు జగన్మిథ్యాత్వ, మాయా వాద, అభేదవాద, ఉపాధి వాదములను ఖండించినాడు. న్యాయజటిలములగు ఈ విషయములు సామాన్యపాఠకులకు విసుగును గూర్చునవగుటవలన, వాటి ప్రసంగమును విరమించుచున్నాడను. మధ్వుడేకాదు, ఈసంప్రదాయస్థులగు

ఆచార్యులందఱును శాంకరమత ఖండనమున విశేషమగు ఉపజ్ఞను జూపెట్టిరి. ఆపాతదృష్టికి వారుచూపు ఉపపత్తులు ఖండనాఘంభవము లనిపించును. నవ్యన్యాయమున ప్రవేశము లేకున్న ఈమెలికలు తెలి యవు.

అనుశీలన:-

శాంకర మతమున దృశ్యము మిథ్య. మాధ్వమతమున దృశ్యము సత్యము. శాకంరమతమున జ్ఞానము నిర్వికల్పకము, భేద రహితము. మాధ్వమతమున సవికల్పకము; జ్ఞాతృజ్ఞేయములు లేకున్న కలుగదు. మాధ్వమతమున భేదము నిత్యము, శాంకరమతమున ఔపాధికము. శాంకరమతమున జీవ బ్రహ్మములకు భేదములేదు. మాధ్వమతమున విలక్షణమగు భేద మున్నది.

శ్రీరామానుజుడు స్వగతభేదము నంగీకరించినను సజాతీయ విజాతీయ భేదముల నంగీకరింపడు. బ్రహ్మము పూర్ణము, జీవుడు అణువు అను విషయమున ఈ ఇరువురకును కలయికయున్నది. ఈ ఇరువురి మతమున జీవబ్రహ్మములకు సేవకసేవ్య భావ మున్నది.

ముక్తి విషయమునకూడ శంకరమతముతో సంపూర్ణ విరోధము. కాని, ఉపాసనా ఫలముగ జ్ఞానరూపమగు భక్తియు, తత్ఫలముగ ముక్తియు లభించుననుటలో శ్రీరామానుజ మధ్వు లిరు వురును ఒకటే. పంచవిధోపాసన, ఇతర విస్మృష్ణారూపకమగు భక్తి శ్రీరామానుజుడంగీకరించినాడు. శ్రీశంకరుని భక్తి ఆత్మాను సంధాన రూపకము; జ్ఞానమే మోక్షోపాయము.

రామానుజమతమున జ్ఞాని జగత్తును బ్రహ్మముగ జూచును. మధ్వమతమున ఈశ్వరునిచే నియమింప బడునదిగ గాంచును. శంకర మతమున జగత్తేయుండదు.

రామానుజమతమున జగత్తు ఈశ్వరుని పరిణతి. మధ్వమత మున ఈశ్వరునినుండి సంపూర్ణముగ వేరు. శాంకర మతమున బ్రహ్మ ము యొక్క వివర్తము.

మధ్వమతమున గనబడు ఉపవాసవిధి, అహింసాప్రాచుర్యములు జైనమత ప్రభావమును దెలుపుచున్నవి. కాని 'అనంతనరకవిధి'ని శ్రీమధ్వుడే మొదట విధించినాడు. అయౌక్తికమగు ఈ నరకశిక్ష సముచిత మనిపించదు. అపశూద్రాధికరణమున శ్రీశంకరుడు చూపిన ఔదార్యమును ఈయన శూద్రులపట్ల జూపజాలక పోయెను. శూద్రులు 'జ్ఞాన-అనర్హు'లని ఈయన నిర్వచనము. ఈయన రామానుజమతప్రభావమునకు లోనైనట్లే గౌడీయ వైష్ణవులును, వల్లభాచార్యుడును ఏతన్మతప్రభావమునకు లోనైరి. అందువలన విశేషమగు సాదృశ్యము అచింత్య భేదాభేదవాద, శుద్ధాద్వైత వాదముల గానవచ్చుచున్నది. రామానుజుని 'దాస్యభావము' మధ్వునియందు సంపుష్టి నందినది.

ఇతర వైష్ణవులకుండు శివవిద్వేషము మధ్వమతమునగనబడదు. అదియునుగాక శ్రీమధ్వుడువిధించిన భజనప్రకారము సామాన్యుల కందుబాటులోనున్నది.

సమాప్తి:-

ఇప్పుడుదయించు ప్రశ్నలు—శంకర రామానుజ మతములలో నెయ్యది సరియైనది? ఒకటి సరియైన తక్కినవాని అల్పజ్ఞు లనవలసి వచ్చునే? వీ రండఱును సర్వజ్ఞులైన, ఇట్లు విభిన్నపంథల ద్రొక్కనేల? వీట నెయ్యది ఆశ్రయణీయము? అని.

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబిచ్చుటకష్టము. త్రిమతకర్తృనామమున వ్యవహరింపబడు వీరు పరస్పర ఖండనమండనములకు వ్రాసిన గ్రంథములు కొన్నివందలుగ నున్నవి. కేవలము పాండిత్యము నాశ్రయించి, న్యాయశాస్త్ర దృష్టితో బరికింప శంకర మతమొక్కటే నిలువగలదు. అదియును గాక ఆధునిక విజ్ఞాన, మానసిక, తర్కదర్శనశాస్త్రముల అదుపునకు గూడ ఆగగలిగిన శక్తిసామర్థ్యములు దీని కున్నవి. తక్కినవి పడిపోవును. ఈ దృష్ట్యా శాంకర మతమే సమంజసము. పాశ్చాత్యులుగూడ దీనివలన నాకర్షింపబడుచున్నారు.

ఇక, జన్మగత మగు సంస్కారము, పారిపార్శ్విక పరిస్థితుల ననుసరించి కలుగు భావము ననుసరించి. 'భిన్నరుచిర్హి లోకః'. ఒకరికి నచ్చినది మఱియొకరికి నచ్చదు. ఈ శ్రేణికి జెందినవారు తమ మతమే అభ్రాంతము, తక్కినవి పొల్లులు అని యెంతురు. ఇట్టి యేక దేశబుద్ధులవలననే ప్రపంచమున రక్తనదులు ప్రవహింప జేయబడినవి. వీరు స్వర్గద్వారము లితరుల కనధిగమ్యము లనియే వచింతురు. మఱియు తదితరులకు 'అనంతనరకము'!

సాధకదృష్టితో జూచిన, హనుమంతుని వాక్యము గ్రహణ యోగ్యము. అది—

"దేహబుద్ధ్యాస్మి దాసస్తే, జీవబుద్ధ్యా త్వదంశకః,
ఆత్మబుద్ధ్యా త్వమేవాహం, ఇతి మే నిశ్చితా మతిః"

కేవలము దేహబుద్ధి యున్నవారలకు శ్రీమధ్వుడు ప్రవచించిన దాస్యభక్తియే గ్రహణీయము. సాధనారాజ్యమున నొకింత అగ్రేస రులై, తమ్ము జీవులుగ తలచువారలకు శ్రీరామానుజుని విశిష్టాద్వైత ముపకారి. ఆత్మగా తలచువారలు శంకర ప్రోక్త మగు బ్రహ్మ తత్త్వముననే వెలయుదురు.

కనుక, మానవుని నిశ్శ్రేయసలాభార్థము ఈ మూడును ప్రయోజనములే యని గ్రహింపగలము. సాధకుడు ద్వైతమతముతో తన సాధన నారంభించి శ్రీరామానుజుడు చూపిన పథము ననుస రించి అద్వైతమును జేరు నని నిగమనము. దక్షిణేశ్వర పూజారి యగు శ్రీరామకృష్ణదేవుడు ఈ సత్యము నుపలబ్ధ మొనర్చుకొని, ఈ సమన్వయవాదమును తన గృహస్థ, సన్యాసి శిష్యు లిద్దరకును బోధించెను. ఈఅనుభూతి ననుసరించియే ఆయన అధికారి తారతమ్య ములనుబట్టి కొందఱికి ద్వైతమతపరములును, మఱికొందఱికి విశిష్టా ద్వైత మతపరములును, తదితరులకు అద్వైతమతపరములును నగు సాధనల నుపదేశించెను. అంతియగాక, ఒకరికే ఈ మూడు సాధనలను క్రమముగా నుపదేశించియుండుట గూడ ఆయనజీవితమున గనబడగలదు.

ఈవిషయమున తర్కము వృథా. కనుక ఇంకొకవిషయము నుల్లే

ఖించి ముగించుచున్నాను. 'సత్య మొక్కటియే. సత్యమునకు బహు రూపము లుండవు' అను విషయము న్యాయసంగతము. మఱియు సత్యమునకు స్వతః ప్రకాశకర మగు శక్తికూడ నున్నది. కనుక ఈ మూడు సాధనలలో నేయొక్కదానినైన గ్రహించి మనఃపూర్వకముగ యత్నింప సత్యము ద్వైతమే యగుగాక, లేక విశిష్టాద్వైతమే యగుగాక, లేక అద్వైతమే యగుగాక సాధకునకు దర్శన మిచ్చితీరును. అందువలన సత్యానుభూతికి తీవ్రమగు అన్వేషణ సాధనలే ప్రయోజనములు; వాగ్వితండములు కావు అని నా మనవి. స్వయంజ్యోతిమ మగు సత్యమును వాగ్వాదముచే ఉపపన్న మొనర్ప జూచువానికి తాను సత్యమని నమ్ముదానియందే విశ్వాసము లేదనవలసివచ్చును.

తుదిమాటః-

చరమసత్యము కేవల మనుభవయోగ్యము, అవర్ణనీయము అగుటవలన అద్వైతము, దానిని నోటితో జెప్పవలసివచ్చిన విశిష్టాద్వైతము, కార్యరూపమున బెట్టవలసివచ్చిన ద్వైతమును మన దైనందినజీవితమున సంభవించుచున్నవి. కనుక ఈ మూడింటిలో నేయొక్కటియును త్యాజ్యము కాదు. అనుభూతిసంపన్నులగు ఆచార్యులు ఆయా దేశకాల పరిస్థితుల ననుసరించి తదుచితమగు సత్యభావమును లోకకల్యాణార్థము ప్రచారము చేసిరి. ఎద్దాని నాశ్రయించినను శ్రేయమే లభింపగలదు.

ఇతతు స్వారాజ్యం వా విశతు తామిస్రమంవాపి,
సుఖితం దుఃఖితమపి మాం నయతు కేశవస్వామీ.

---

# వేదాంత దర్శనము : శుద్ధాద్వైత వాదము

## ( వల్లభమతము )

ప్రేమాంజనచ్ఛురిత భక్తి విలోచనేన
సంతః సదైవ హృదయేషు విలోకయంతి,
యం శ్యామసుందర మచింత్యగుణస్వరూపం
గోవింద మాదిపురుషం త మహం భజామి.

ప్రవేశిక :

రుద్రసంప్రదాయ మనబడు ఈశుద్ధాద్వైత వాదమునకు వేద భాష్యకారులలో నొకడగు విష్ణుస్వామి మూలపురుషుడుగా జెప్పబడు చున్నాడు. ఈయన సన్యాసాశ్రమపరులగు బ్రాహ్మణులనే శిష్యులుగా గ్రహించుచుండెడివారు. జ్ఞానదేవ, నాథదేవ, త్రిలోచనులు తరువాతివారు. కడపటివాడగు వల్లభాచార్యులే శుద్ధాద్వైతవాదమును, బాలగోపాలోపాసనను వ్యాప్తిలోనికి దెచ్చెను. 'అష్టప్రహరసేవ' గూడ ఈయన విధించినదే. బ్రహ్మము జీవుడుకూడ శుద్ధులని చెప్పుచుండుటవలన 'శుద్ధాద్వైత' మనియు బ్రహ్మము జగత్తుగా మారినను అవికృతముగా నుండుననుటచే 'అవికృత పరిణామవాద' మనియు వల్లభమతము వ్యవహృతము.

జీవితగ్రంథములు:

ఈయనజీవితమును వర్ణించు సంస్కృత గ్రంథము లెవ్వియును గానరావు. ప్రాచీన హిందీపద్యములలో నాభాజీ మహరాజ్ చే వ్రాయబడిన 'భక్తమాల' అను గ్రంథమునను, వంగభాషయందు శ్రీ కృష్ణదాసు కవిరాజు బాబాజీవారు లిఖించిన 'శ్రీ చైతన్యచరితామృత' మను గ్రంథమునను ఈమహాపురుషుని జీవితము నందలి కొన్ని వృత్తాంతములు వర్ణింపబడి యున్నవి. శ్రీ కొమర్రాజువారి 'మహమ్మదీయ మహాయుగము'న గూడ ఏతదాచార్యుని ప్రసంగమున్నది. ఏతన్మతస్థు లీయనను అగ్నిదేవుని అవతారముగా తలంతురు.

**జీవితము:**

వల్లభుడు జన్మించినది త్రిలింగ దేశమున. ఈయన పుట్టిన నేలను వదలి మధురను మెట్టి 'గోకులమున' నివసింపసాగెను. అచ్చట కొంత కాలముండి తీర్థపర్యటన, స్వమత ప్రచారముల నొనర్చుచు విజయ నగరమును జేరుకొనెను. అచటి సంస్థాన పండితులగు స్మార్తులను వాదమున భంగపరచి, వైష్ణవులకు గురువయ్యెను. * పిదప ఉజ్జయినీ నగరమున కరిగి, శిప్రానదీతీరమున నొక అశ్వత్థవృక్ష తలమున కొంత కాలముండెను. ఈ స్థానము నేడుకూడ ఆచార్యుని స్థానముగా జెప్ప బడుచున్నది. మధురయందుకూడ ఇట్టిదేయగు స్థానమొకటి యున్నది. 'మూనాక్' అను ప్రదేశమునకూడ ఈయన మఠము ఒకటి యున్నది. ఆమఠ ప్రాంగణమున నున్న కూప 'మాచార్యకూప' మని చెప్పబడు చున్నది.

తరువాత ఈయన బృందావనమున కరుదెంచి శ్రీ కృష్ణుని భజింపసాగెను. ఈయనతపస్సునకు మెచ్చి దర్శనమిచ్చి, బాలగోపాల సేవను ప్రచారము సేయుమని భగవంతుడు ఆదేశించెను.

ఈయన పూరీక్షేత్రమున శ్రీకృష్ణచైతన్య మహాప్రభునితో సంభాషించినట్లు వంగభాషయందు రచింపబడిన 'చరితామృ'తాది మహా కావ్యములవలన దెలియ వచ్చుచున్నది. ఈయనరచించిన భాగవతటీక 'సుబోధిని' యనుదానిని ప్రమోదింపనట్లు ఆ మహాగ్రంథ మున జెప్పబడినది. కారణము, అది శ్రీధరస్వామి రచించిన టీకకు విరుద్ధముగ నుండుటయే. "మీటీక స్వామిగామిని కాదు, అందువలన ద్విచారిణి"† యని మహాప్రభువు పలికెనట.

చైతన్యుని శిష్యులును, గౌడియవైష్ణవ గోస్వాములును నగు శ్రీరూప, సనాతన, జీవ గోస్వాములతో నీయనకు సౌహార్ద్ర మున్నట్లు 'వైష్ణవమత వివే'కాది గ్రంథముల వలన తెలియ వచ్చు

---

* ఈ విషయ మెంతవఱకు సరియైనదో చెప్పజాలము. అప్పటిరాజు శ్రీ కృష్ణ దేవరాయలు. సభయందు అప్పయదీక్షితుని తండ్రియగు రంగరాజాధ్వరి మున్నగువా రుండిరి. వారినోడించుటయన్న సామాన్యముకాదు.

† స్వామి = శ్రీధరస్వామి, భర్త; ద్విచారిణి = వ్యభిచారిణి; అసమంజసము

చున్నది. వీరు బృందావనభూమియందు 'అఖిలరసామృతమూర్తి'యగు శ్రీ కృష్ణదేవుని లీలావిలాస ప్రసంగములయందును, పరస్పర విరచిత గ్రంథ శ్రవణమునను సుమధురములగు దినములను గడపియుండిరని మన మూహింపగలము. ఫలితముగ, వల్లభుని శుద్ధాద్వైతవాదము, గౌడీయ గోస్వాముల అచింత్యాభేదవాదమును ఒకటి మరొకదాని వలన ప్రభావిత మైనవి. వల్లభుని గోపాలసేవ, పుష్టిమార్గములును, గోస్వాముల వాత్సల్య, మధుర భావములును ఏకోదరులు.

వల్లభాచార్యుల తుదిజీవితము కాశీధామమున గడచినది. 'జేతన్-బేడ్' అనుచోట ఈయన మఠమును కట్టించి అట నీయన నివసించెనని చెప్పవచ్చును.

జీవితమునందలి తుదిరోజున ఈయన కాశీయందలి 'హనుమాన్ ఘాట్' నందు గంగాస్నాన మొనర్ప నీటియందు మునిగినతోడనే అగ్నిశిఖ యొకటి లేచి, ఈయన చాలమంది జనులు చూచుచుండగనే స్వర్గారోహణ మొనర్చెనని వినికి. హనుమాన్ ఘాట్‌నందు వల్లభాచార్యుని ఆలయ మొకటి, ఈయన స్మృతిని రక్షించుచు నేటికిని నిలచి యున్నది. ఈయన ౧౬-వ శతాబ్దపువాడని చెప్పగలను కాని, జనన మరణముల వత్సరములను దెలుప జాలను.

గ్రంథములు:

అణుభాష్యము, సుబోధిని, సిద్ధాంత రహస్యము, భాగవత లీలా రహస్యము, విష్ణుపదము అనునవి వల్లభాచార్యుని ముఖ్య గ్రంథములు.

బ్రహ్మసూత్రముల కీయాచార్యుడు స్వమత స్థాపనార్థము విరచించిన భాష్యమే అణుభాష్యము. దీనికి పురుషోత్తమజీ మహారాజ్ రచించిన 'భాష్యప్రకాశ' మను టీకయొకటి యున్నది.*

'సుబోధిని' వల్లభమతస్థులకు పరమ ప్రమాణమగు వ్యాఖ్య. దీనికి వల్లభుని పుత్రుడగు విఠలనాథుడు టిప్పణి సమకూర్చెను. ఈ రెండును ఇప్పుడు ప్రచురితములై లభించుచున్నవి.

---

* అణుభాష్య-ఆంగ్లానువాదమును అలహాబాదునందలి పాణిని ఆఫీస్‌వారు ప్రకటించియున్నారు.

సిద్ధాంతరహస్య, భాగవత లీలా రహస్య, ఏకాంతరహస్యము లను గ్రంథము లింతవఱకును ప్రచురితము లైనట్లు కనబడదు.

**విష్ణుపదము** విష్ణుని గుణానుకీర్తన మొనరించు పదములు. ఇది కాశీపురియందు ముద్రిత మైనది. భాష హిందీ.

ఇవి గాక వల్లభాచార్య విరచితము లగు కొన్ని స్తోత్రఖండికలు గూడ కానవచ్చుచున్నవి.

ఇక వల్లభుని మతవాదము నొకింత పరామర్శింతును.

అధికారి :

అధికారికే పురుషార్థము చేకూరును. త్రైవర్ణికుల కధికారము బ్రహ్మనిత్యపట్ల నున్నది. కర్మగాక బ్రహ్మజ్ఞానమే పురుషార్థసాధక మగుటవలన, వేదాంత వాక్యములవలన బ్రహ్మవిచార మొనర్పదగును. శూద్రులకు జ్ఞానాధికారము లేదు.

సంబంధము :

శాస్త్రము ప్రతిపాదకము, బ్రహ్మ ప్రతిపాద్యము. బ్రహ్మ శాస్త్రైకగమ్యము; శబ్దవిషయము, అవిషయము గాదు. "ఈక్షతేర్నాశబ్దం" (వే. సూ. ౧-౧-౫) అను సూత్ర వ్యాఖ్యాన ప్రసంగమున "న విద్యతే శబ్దో యత్ర ఇతి అశబ్దం, సర్వ వేదాంతాద్య ప్రతిపాద్యం బ్రహ్మైన భవతి కుతః? ఈక్షతేః - సదేవ సోమ్యేదమగ్ర ఆసీదిత్యాది" అనువాక్యములందు ఈయన ఈ విషయమును జెప్పియున్నాడు. అణుభాష్యమున ఈ ప్రసంగ మున్నది. "వచనైరీక్షణీయత్వాద్వాచ్యమేవ" అని మధ్వాచార్యులు పల్కిన వాక్యము లీ సందర్భమున తలపునకు రాగలవు

ప్రయోజనము:

అవిద్యానివృత్తి పూర్వకమును, బ్రహ్మప్రాప్తియునగు పురుషార్థమే ప్రయోజనము. అవిద్యవలన దుఃఖించు జీవుడు బ్రహ్మజ్ఞానమున దుఃఖమును బోగొట్టుకొన గలడు. ఇదియే ప్రయోజనము.

విషయము:

బ్రహ్మము, బ్రహ్మసాయుజ్య ప్రాప్తులు విషయములు. శ్రవణ మనన నిది ధ్యాసలనబడు అంతరంగ అంగములను, శమదమాదులను

బహిరంగ అంగములను నాశ్రయించిన, అత్యంత శుద్ధచిత్తమున స్వయముగ నావిర్భవించు స్వప్రకాశునితో సాయుజ్యమును బడయుటయే పరమ పురుషార్థము. ఇదియే శాస్త్రప్రతిపాదితమగు విషయము.

బ్రహ్మము:

బ్రహ్మము సాకారము, నిర్గుణము (అనగా ప్రకృతి గుణముల కతీతము), సర్వశక్తిమంతము, నిర్విశేషము, సర్వజ్ఞము, విశుద్ధము. మాయ బ్రహ్మమున లేదు. ఇది గుణాతీతమైనను జగత్కారణము. నిమిత్త, ఉపాదానములు రెండునుగూడ. నిర్గుణ పరబ్రహ్మమే ఆత్మశబ్దవాచ్యము, గుణాతీతమగు ఈ ఆత్మయే కర్త. బ్రహ్మముయొక్క శక్తి అచింత్యము, అనంతము. ఇయ్యది సర్వమును గాగలదు. విరుద్ధ ధర్మములయొక్కయు, విరుద్ధ వాక్యములయొక్కయు సమావేశమీయనయందున్నది. విరుద్ధధర్మాశ్రయత్వము బ్రహ్మమునకు భూషణము. భోక్త గూడ బ్రహ్మమే. కర్త, భోక్త, కారయిత అయ్యు నిర్వికారము. ఉపాదాన కారణమయ్యు సంసారధర్మ విరహితము. విచిత్ర జగద్రచన లౌకికమగు శరీరాధ్యాసవంటిదిగాదు, అలౌకికము. బంగారము కుండలాద్యాకారముగా మారినను బంగారమునకెట్టి వికారమును లేదు. కామధేనువు, కల్పద్రుమము, చింతామణులు అర్థులు గోరు విషయములను బ్రసాదించుచున్నను వాటికెట్టి వికారమును లేదు. అట్లే బ్రహ్మము జగత్ప్రపంచయయ్యు నిర్వికారము. గోలోకాధిపతియగు శ్రీకృష్ణుడే ఈ బ్రహ్మము. *

జగత్తు:

బ్రహ్మకార్యము జగత్తు. కార్యకారణముల కభిన్నత్వమున్నది. అందువలన జగత్తు సత్; మిథ్యకాదు. బ్రహ్మముయొక్క ఇచ్ఛ ననుసరించియే జగత్తు లయోదయముల నందుచున్నది. స్వేచ్ఛగ, లీలకొఱకు బ్రహ్మము జగద్రూపమును దాల్చినది. జగత్తు

---

* బ్రహ్మము సాకారము, నిర్గుణము అనుపట్ల బ్రహ్మసమాజమతస్థులతో గలుగు ఆశ్చర్యకరమగు శాబ్దిక భేదము గమనింప దగినది. వారి బ్రహ్మము నిరాకారము, సగుణము.

బ్రహ్మాత్మకము-బ్రహ్మముయొక్క అవికృత పరిణామము; బ్రహ్మము నుండి భిన్నముకాదు; లేక మాయికమునుగాదు. జగత్తునకు వినాశము లేదు; లయోదయములున్నవి. లయకాలమున కారణరూపము నను, ఉదయకాలమున కార్యరూపమునను వెలయుచున్నది. జగత్తు జడము కాదు; చైతన్యమే. జగత్తు నిత్యమను విషయమును (పూర్వ) మీమాంసకులుగూడ అంగీకరించి యుండిరి.

జీవుడు:

జీవుడు బ్రహ్మముయొక్క అంశము, అణువు. హృదయమీతని స్థానము. ఇతడుశుద్ధుడు, చేతనుడు. అణువైనను యీతడు చైతన్యగుణమున సర్వదేహ వ్యాపియైయున్నాడు. చందనబిందు వొకచోట నున్నను శరీరమున కంతటికిని చల్లదనమిచ్చుట యీ విషయమున దృష్టాంతము.

"గుణాద్వాఽలోకవత్" (వే.సూ. ౨-3-౨౫) అనుసూత్రభాష్య ప్రసంగమున జీవుని చైతన్యమును గురించియు, "అవిరోధ శ్చందన వత్" (వే. సూ. ౨-3-౨3) అను సూత్ర వ్యాఖ్యాన సందర్భమున యీ జీవుని సంప్రసారణ శీలతను గురించియు ఆచార్యులు తనయభిప్రాయమును దెలపరచి యున్నారు. జీవుడు "యథాగ్నేః క్షుద్రా విస్ఫులింగా వ్యుచ్చరంతితి" అను శ్రుతివాక్యబలమున బ్రహ్మము యొక్క-అంశ. జీవునకు బ్రహ్మముతో నైక్యము లేదు. తత్త్వమస్యాది వాక్యములు అంశాంశిభావైక్యమును, చైతన్యగుణ సామాన్యత్వమును దెల్పుచున్నవి. మంత్రిని రాజనునట్లు, ఈ వాక్యము బ్రహ్మము యొక్క ప్రజ్ఞా, గుణములు జీవగతము లగుటనే సూచించుచున్నవి.

"తద్గుణసారత్వాత్తు తద్వ్యపదేశః ప్రాజ్ఞవత్ (వే. సూ. ౨-3-౨౯) అను సూత్రమును వివరించుచోట్ల వల్లభులీ దృష్టాంతము నొసగెను.

జీవులు శుద్ధులు, సంసారులు, ముక్తులు నని ముత్తెరగులుగ నుందురు. అవిద్యాబద్ధులు సంసారులు. అవిద్యానివృత్తి యైనవారు శుద్ధులు. సదసద్వాసనా విశిష్ట మగు దైవత్వమును బ్రహ్మమునుండి బడసినవారు ముక్తులు.

సాధన :

శమదమాదులు బహిరంగ సాధనములు. శ్రవణ మనన నిదిధ్యాసనములు అంతరంగ సాధనములు. ఈ సాధనవలన, భగవంతుడనుగ్రహింప, పుష్టిమార్గము, లేక ప్రీతిమార్గము (భక్తి) ఉదయించును. నిరుపాధిక స్నేహ మగు భక్తియే సర్వాత్మభావము. భావమనగా రతి. ఈ రతి మర్యాద, పుష్టి అని ద్వివిధము. అంబరీషాదులు మర్యాదను, వ్రజగోపికలు పుష్టిని నాశ్రయించి యుండిరి. భగవచ్చిత్తపరతయే సేవ. ఈ సేవ శారీరకము, మానసికము నని రెండువిధములు. ద్రవ్యార్పణరూపక మగు శారీరక సేవ సాధన రూపము; శ్రీకృష్ణార్పిత చిత్తరూప మగు మానసిక సేవ ఫల రూపము. రెండవదానియందు సర్వాత్మభావము, అనగా భగవద్విరహబోధవలన సర్వత్ర తద్రూపస్ఫురణ మగును. ఇయ్యదియే భగవదనుగ్రహ లబ్ధమగు పుష్టి, మహాపుష్టి యనబడునది ప్రతిబంధకములను నివర్తిలజేయును. శుద్ధపుష్టియందు భగవదనుగ్రహముపై నిర్భర పడుటగాక, సాధనాంతర ముండదు. భగవంతుని పతిగా భావించి, ఆయనతుష్టికై సర్వమును అర్పించి తన్ను గోపికగాభావించి సేవించుటయే వల్లభుడామోదించు రాగమార్గము, జ్ఞానము, లేక విధివాదీయ భక్తి ఈయన ప్రశంసను బడయలేదు.

ఉపవాసము, తపస్సు మున్నగు కఠిన నియమములతో బని లేదు, చక్కగ భుజించి, మంచిబట్టలు గట్టుకొని భగవంతుని సేవింపనగును.

ముక్తి :-

గోలోకపతియగు శ్రీకృష్ణుని సాయుజ్యమునందుటయే ముక్తి. అట సర్వాత్మభావము, శ్రీ కృష్ణుని పతిగా బొందుట యనునవి లభించును. అఖండమును, నిత్యమును నగు రాసరసమహోత్సవ మట లభించును. అంతయును బ్రహ్మము అనుబోధయే సర్వాత్మభావము. అంతటను నిండియున్న తనపతియగు కృష్ణుని సేవించుటయే రాసరసాస్వాదము. ముక్తులు ఈ భగవల్లోకమున కరిగి మరల రారు.

"అనావృత్తిః శబ్దా దనావృత్తిః శబ్దాత్" (వే. సూ. ౪-౪-౨౨) అను సూత్రభాష్యమున పుష్టిమార్గ, మర్యాదామార్గపరులు ఈ మర్త్యమునకు మరల తిరిగిరారని ఆచార్యుడు నిర్వచించియున్నాడు.

అనుశీలన:--

ఆచార్య శంకర, రామానుజ, మధ్వులు "జన్మాద్యస్య యతః" (వే. సూ. ౧-౧-౨), "శాస్త్రయోనిత్వాత్" (వే. సూ. ౧-౧-3) అని రెండు సూత్రములుగా గ్రహించి బ్రహ్మము జగత్తునకు-స్థితి జన్మభంగములకు కారణము, వేదాంత (ఉపనిషత్) వాక్యములకు బ్రహ్మ యోని అని వ్యాఖ్యానించిన వాటిని వల్లభాచార్యులు "జన్మాద్యస్య యతః శాస్త్రయోనిత్వాత్" (అ. భా. ౧-౧-౨) అను ఒకే సూత్రముగా గ్రహించి, బ్రహ్మము జగత్తుకు నిమిత్త కారణ మని అర్థము జెప్పినాడు. పూర్వోక్త ఆచార్యుల మతమున ఈరెండును వేర్వేరు అధికరణముల బడుచున్నవి. ఇట్లే "తత్తు సమన్వయాత్" (వే. సూ. ౧-౧-౪) అనుచోట గూడ అర్థభేదము ఘటిల్లుచున్నది. వేదాంతవాక్యములకు బ్రహ్మమున సమన్వయమని త్రిమతాచార్యులు అర్థము జెప్పియుండిరి. వల్లభమతమున ఈసూత్రము బ్రహ్మము సంయుక్త-సమవాయి ఉపాదాన కారణత్వమును నిరూపించుచున్నది.

"అథాతో బ్రహ్మజిజ్ఞాసా" (వే. సూ. ౧-౧-౧) అను సూత్రమునందలి 'అథ' శబ్దమునకు వ్యాఖ్యాన మొనర్చుచు శంకర రామానుజు లిరువురును 'అథ' శబ్దార్థమును ఆనంతర్యార్థకముగానే నిర్వచించి యుండిరి. శంకరమతమున శమదమాదుల అనంతరము; రామానుజమతమున కర్మజ్ఞానానంతరము. కాని వల్లభున కీయర్థము 'అనేకదోష దుష్టము' అనిపించినది. అందువలన అధికారార్థమును గ్రహించినాడు. 'బ్రహ్మజిజ్ఞాస' అనుచోట శంకరుడు 'కర్మణి షష్ఠి' గ్రహింప, వల్లభుడు 'శేషేషష్ఠి'ని గ్రహించెను.

అపశూద్రాధికరణమున శంకరుడు శూద్రులపట్ల జూపిన ఔదార్యమును రామానుజ మధ్వులు చూపజాలక పోయినట్లే వల్లభుడుగూడ చూపజాలక "తస్మాన్న శూద్రస్య అధికారః" అనెను.

శాంకరమతమున 'తత్త్వమసి' వాక్యము సామానాధికరణ్యబలమున నిర్విశేష బ్రహ్మాత్మైక్య పరమగుచున్నది. రామానుజుడు సమానాధికరణమును గ్రహించినను, పైనజెప్పిన ఐక్యమును గ్రహింపక, సవిశేష బ్రహ్మముతో చిజ్జడాత్మక బ్రహ్మశరీరముయొక్క ఐక్యమును జెప్పినాడు. మధ్వుడు "ఆదిత్యోయూపః", "అగ్నిర్మాణవకః" అను వాక్యములవలె సాదృశ్యపరమని అభిప్రాయపడెను. వల్లభుడు వీటిలో నెద్దానినిగాని గ్రహింపక, అంశాంశీభావముయొక్క అభేదత్వము నీవాక్యము సూచించుచున్నదని నుడివెను.

సమాప్తి:-

రామానుజుని "పరిణామవాదము"నే గ్రహించి, నింబార్కుడు 'అచింత్యశక్తి' వలన ఇట్లు జరుగుట సంభవమనెను. అదియే వల్లభుని గ్రంథములందు 'అవికృత పరిణామవాదము'గాను, బలదేవుని గ్రంథములందు 'అచింత్య భేదాభేదము' లుగాను మారినది. కనుక వల్లభుని శుద్ధాద్వైతము 'నేతిబీర' వంటిది. వాస్తమువనకియ్యది 'శుద్ధద్వైతము'

జీవుడు అణువు, సేవకుడు, ప్రపంచము సత్యము అను రామానుజ మతసిద్ధాంతములను మధ్వ, వల్లభ నింబార్క, బలదేవులు గ్రహించిరి.

రామానుజుని దాస్యభక్తిని వీరందఱును గ్రహించిరి. అద్దానినే వల్లభుడు మర్యాదామార్గమనెను. రామానుజ, మధ్వ, నింబార్కులు దాస్యభావముతో నాగిపోవ, వల్లభుడు వాత్సల్య, మధుర (పుష్టి) భావములనుగూడ నంగీకరించెను. వీటి నన్నిటిని గలిపి గౌడీయ వైష్ణవ గోస్వాములు శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మధుర భావలుగా విభజించిరి. రామానుజుడు లక్ష్మీనారాయణులను, మధ్వుడు కృష్ణుని, వల్లభుడు గోలోకవాసి యగు కృష్ణుని, గౌడీయ గోస్వాములు బృందావన కృష్ణుని ఉపాస్యములుగా గ్రహించిరి.

విరుద్ధగుణ సమాశ్రయత్వము భగవానునకు భూషణము. సర్వము 'చైతన్యాత్మకము' అనుపట్ల వల్లభుడు భావరాజ్యమున జూపిన చింతాశీలత ప్రశంసనీయమే గాని, ఈయన అద్వైతుల పట్ల జూపిన అసహనము అప్రశంసనీయము.

అద్వైత సామ్రాజ్య పథాధిరూఢా స్తృణీకృతాఖండల వైభవాశ్చ,
శఠేన కేనాపి హఠేన వయం దాసీకృతా గోపవధూవిటేన.

# వేదాంత దర్శనము: ద్వైతాద్వైతవాదము - ౫

## (నింబార్క మతము)

నిర్దేశేన యదానందో జగద్వ్యాపయతేఽఖిలమ్,
తమహం నియమానందం వందే కృష్ణం జగద్గురుమ్.

— సిద్ధాంతజాహ్నవి.

ప్రవేశిక:-

సనకాది సంప్రదాయమనబడు ఈ వేదాంత దర్శనశాఖను విస్తరింపజేసినది శ్రీ నియమానందుడు. బ్రహ్మవస్తు వింద్రియాదుల కగోచరము, అతీతము అని ఉపవర్ణించు శ్రుతులే వీరికి ముఖ్యమగు ఆధారము. సనత్కుమార, సనక, సనందనాదులును, నారదుడును పూర్వాచార్యులుగా చెప్పబడినను, వారి గ్రంథములెవ్వియును — తద్విషయకములు - గానరాకున్నవి. వేదాంత సూత్రములలో (౧ ౪-౨౧; ౩-౪-౪౫; ౪-౪-౬) ఔడులోమియను ఆచార్యుడు ఇట్టిదేయగు సిద్ధాంతమును నిరూపించినట్లు పేర్కొనబడి యున్నది; ఈ ఆచార్యు ననుసరించి శ్రీ శంకర రామానుజులకు మధ్యవెలసిన భాస్కరాచార్యులు వేదాంత సూత్రములకు ద్వైతాద్వైతపరముగ నొక భాష్యమును రచించియుండెను. కాని, అది కేవలము 'బ్రహ్మ' పరము. తరువాత, శ్రీకృష్ణపరమగు వ్యాఖ్య నొనరించుచు, ౧౧-వ శతాబ్దపు వాడగు శ్రీ నియమానందుడు సనకాది సంప్రదాయమును వ్యాపింపజేసెను.

ఈ సంప్రదాయమువారి ముఖ్య కేంద్రము — పీఠస్థానము — బృందావనము నందలి ధ్రువక్షేత్రము. ఆపీఠాధిపతులకు 'వ్రజవిదేహి' యను బిరుదు గౌరవసూచకముగ నొసగబడును. ఈ శతాబ్దమున ఆ పీఠము నధిరోహించి కీర్తిశేషులైన శ్రీ రామదాస్ కఠియా బాబాజీ శ్రీ శాంతదాస్ బాబాజీల జీవితము ఆదర్శస్థానీయము. ఆధ్యాత్మిక శాంతికాములకు శ్రవణీయము.

ఇట 'బాబాజీ' పదమును జూచి ఆసహించుకొన బనిలేదు. అద్వైత సన్యాసులు 'స్వాము' లనబడునట్లు వైష్ణవ సన్యాసులు 'బాబాజీ' లనబడుదురు. శ్రీ శాంతదాస్ బాబాజీవారి పూర్వాశ్రమ నామము శ్రీ తారాకిశోరరాయ చౌధరి. వారు చాలకాలము కల కత్తా హైకోర్టు వకీలుగా నుండిరి. జడ్జి పదవి లభించు అవకాశ మున్నదని సర్ జాన్ ఉడ్రాఫ్‌గారు నివారించినను వినక, సన్యాస మును గ్రహించిన త్యాగపురుషులు వారు. గత వత్సరముననే వారిహమును వీడిరి. ప్రస్తుత మీ పీఠమున కధిపతులు శ్రీ ధనంజయ దాస్ బాబాజీగారు.

శ్రీ నియమానందుల శిష్యులగు కేశవభట్టు, హరివ్యాసు లను వారు విరక్తులు, గృహస్థులు అను రెండు శాఖలను బ్రబలిల్లజేసిరి. ఈ సంప్రదాయమువారు ఉత్తరదేశమున అధికముగను, వంగదేశ మున అల్పముగను నున్నారు.

"జీవుడు బ్రహ్మమునుండి అత్యంతము భిన్నుడు, అభిన్నుడును కూడ" అను ప్రతిపాదనవలన దీనికి ద్వైతాద్వైతవాద మను అన్వర్థ నామము కలిగినది.

జీవితము:-

శంకర రామానుజాదుల జీవితమును వర్ణించు గ్రంథములు సంస్కృతమునను, తదితరభాషలలోను ఏకాధికముగ లభించుచున్నవి. కాని, ఈ ఆచార్యుని ప్రసంగమే గ్రంథమునను వివరింపబడి యుండక పోవుటవలన విశేషము లేవియును దెలియరాకున్నవి.

త్రిలింగదేశమున ఈయన జన్మించినట్లు విజ్ఞుల అభిప్రాయము. ఈయన పాషండ నిదళనార్థ మవతరించిన సూర్యుడని తత్సంప్రదా యజ్ఞుల విశ్వాసము. మఱియు సూత్రభాష్యమున "పరమాచార్యైః శ్రీకుమారై రస్మద్గురవే శ్రీమన్నారదాయ ఉపదిష్టః" (౧-౩-౮) అనుటవలన ఈయన నారదునకు సమకాలమున నుండె నందురు. ఈ వాక్యమునకు ఈరీతిగా అర్థమొనర్చినచో సందేహములు చాలగ కలుగుట కవకాశమున్నది. ఛాందోగ్యోపనిషత్తునందు, శ్రీమద్భాగ వతమున, పాంచరాత్ర వాఙ్మయమున నారదుని ప్రసంగమున్నది.

అగుచో ఈముప్పురును ఒక్కరేనా, లేక వెవ్వేరుగనున్న ముగ్గురా? వీరు ఏయే సమయములనుండిరి? వీరిలో నియమానందుల గురు వెవరు? —ఇత్యాదిగా.

అద్వైత సన్న్యాసులు "శ్రీ శంకరుడు మాగురు" డని గౌణముగ వ్యవహరించునట్లే, నియమానందుడు "నారదుడు మాగురు" డని వచించి యుండునని తోచుచున్నది.

భవిష్యత్పురాణ పరిశిష్టమున భగవద్భక్త మాహాత్మ్యప్రసంగమున్నది. అందు నియమానందుని నామము గాననగును.§

ఈయనకు భాస్కరుడు, నింబాదిత్యుడు, నింబార్కుడు అను నామములుగూడ ఉన్నవి. భాస్కరుని భేదాభేదవాదముతో నింబార్కుని సిద్ధాంతమునకు గల సాదృశ్యము ననుసరించియే ఈనామము వచ్చియుండవచ్చును. నియమానందు డసలుపేరు. నింబార్కుడు, లేక నింబాదిత్యుడను పేరుతోడనే ఈయన ప్రసిద్ధిని గాంచెను.

శేషోక్త నామము కలుగుటకు కారణముగ వంగభాషయందు పద్యములలో రచింపబడిన 'భక్తమాల' యను గ్రంథమిట్లు నుడువుచున్నది:

సూర్యాస్తమయానంతరము భుజించు ఆచారములేని సాధుపురుషుడొకడు నియమానందుని ఆశ్రమమున కరుదెంచెను. వారిరువురకును శాస్త్రవిషయములను గురించి వాదము జరుగ, వారికి తెలియకుండగనే సూర్యు డస్తశిఖరిని చేరెను. అప్పుడు నియమానందుడు సూర్యుని ప్రార్థింప (మఱికొందరి ననుసరించి సుదర్శన చక్రమును ప్రార్థింప) నికటస్థమగు నింబవృక్షమున నిల్చెను. అతిథి సంధ్య ముగియలేదని తలచి భుజించెను.

అప్పటినుండియే నింబాదిత్యుడు, లేక నింబార్కుడను నామమున ఈ ఆచార్యుడు పేర్కొనబడుచుండెను.

సంప్రదాయ ప్రవర్తకుడగుటవలన ఈయనజీవితమున విశేషము లేవియు లేవనజాలము. ఎట్టి వివరణయు లభింపనందువలన, శంకర

§ "...ష్ణుస్వామీ ప్రథమతో నింబాదిత్యో ద్వితీయకః. మధ్వాచార్యస్తృతీయస్తు తుర్యో రామానుజః ... ..."

రామానుజుల మధ్యకాలమున, అభినవగుప్తుని సిద్ధాంతములు వ్యాప్తియందున్నతఱి ఈ ఆచార్యుని అభ్యుదయమని ఊహించి చెప్పుటకంటె అన్యోపాయ మేమియును లేదు.

గ్రంథములు:-

నింబార్కుడు రచించిన సూత్రభాష్యము 'వేదాంతపారిజాత సౌరభ' మనబడుచున్నది. ఇది అత్యంత సంక్షిప్తము. ఇందు నింబార్కుడు పరమత ఖండన నొనర్పకయే స్వమతమును ప్రపంచించుట గమనింపదగి యున్నది. నింబార్కుని శిష్యుడగు శ్రీనివాసుడు 'వేదాంత కౌస్తుభము' అను టీకను సమకూర్చెను. §దేవాచార్యుడను ఆచార్యుడు చతుస్సూత్రికి 'సిద్ధాంత జాహ్నవి' అను వృత్తిని విరచించెను. ఈ వృత్తికి మరల సుందరభట్టు 'సిదాంత సేతుక' మను టీకను వ్రాసెను.

'శ్రీకృష్ణస్తవరాజ' మను స్తోత్రగ్రంథ మొకటి దానిని కలకత్తాయందలి దేవకీనందన ప్రెస్సువారు వంగాక్షరములలో వెలువరించి యున్నారు. ఇందలి శ్లోకములు కడుంగడు హృద్యములై యున్నవి.

వేద భాష్యమును నింబార్కుడు రచించి యుండెనందురుకాని, అది ప్రస్తుత మలభ్యము.

ఇవిగాక ప్రకరణ గ్రంథము నొకటి దానినిగూడ నింబార్కుడు రచించి యుండును. దేవాచార్య, సుందర భట్ట, పురుషోత్తమాచార్యులు (వేదాంత రత్న మంజూష) తమ రచనలలో కొన్ని శ్లోకములను నింబార్కునివిగా నుదహరించి యున్నారు. మూలగ్రంథము దొరుకుటలేదు.

ఈ గ్రంథములలో లభించు సిద్ధాంతముల నొకింత అరయుదము.

---

§ సటీకా సూత్రభాష్యమును బృందావనమునందలి కిశోర్ దాస్ బాబాజీగారును, కాశీయందలి చౌఖాంబా గ్రంథమాలవారును వెలువరించి యున్నారు: నింబార్క భాష్యానుసారము ఆంగ్లమున శ్రీ భగ ముజుమ్దారుగారు (బారిసాల్ - బెంగాల్) వ్రాసిన గ్రంథమున్నది.

అధికారి:-

కర్మ బ్రహ్మముల సాతిశయత్వ, నిరతిశయత్వ విషయకమగు జ్ఞానఫలముగా నిర్వేదమునంది భగవత్ ప్రసాదమును బడసి, తద్దర్శనమును కాంక్షించు వాడును, గురుభక్తితో నిండిన హృదయము గల వాడును నగు ముముక్షు వీశాస్త్రమున కధికారి. †

సంబంధము:-

శాస్త్ర బ్రహ్మములకు వాచ్య వాచక సంబంధమున్నది. బ్రహ్మజ్ఞానము కేవలము శాస్త్రమువలననే లభించుచున్నది. విశ్వ జన్మాది హేతువగు అచింత్యశక్తి వేదైక ప్రమాణగమ్యము.

విషయము - ప్రయోజనము:-

బ్రహ్మమే జిజ్ఞాసావిషయము. అయ్యది అనంతము, అచింత్యము, విశ్వాత్మ, సర్వభిన్నాభిన్నము. అది రమాకాంతుడును, పురుషోత్తముడును నగు వాసుదేవుడు. భగవత్ ప్రసాద దర్శన లాభములే ప్రయోజనము. దీన సర్వదుఃఖ నివృత్తియును, పరమానందమును కలుగును.

బ్రహ్మము:-

బ్రహ్మము జీవజగత్తులనుండి భిన్నము, అభిన్నమునుగూడ. ఈ రెండును బ్రహ్మముయొక్క స్వభావము. బ్రహ్మమే జగత్తునకు ఉపాదానకారణము, నిమిత్తకారణమును నైయున్నది. సృష్టిలయముల కయ్యదియే కర్త. అయ్యు అది జగత్తున కతీతముగా తత్త్వముగనే యుండును. కనుక, బ్రహ్మ జగత్తులకు భేదము సిద్ధించుచున్నది. ఇక ఉపాదాన కారణముగూడ బ్రహ్మమే యగుటవలన జగత్తునకొక్క ప్రతిష్ఠ బ్రహ్మముననే. కనుక ఈ రెండును అభిన్నములు. జగత్తు గుణాత్మకము; బ్రహ్మము గుణి. గుణవంతునికంటె వేరగు ఉనికి గుణమున

---

† కర్మ బ్రహ్మఫలసాతిశయత్వ, నిరతిశయత్వవిషయక-[illegible] -నిర్వేదేన భగవత్ప్రసాదేప్సునా తద్దర్శనే[illegible]నా[illegible]చార్యైకదేవేన శ్రీగురుభక్త్యేకహార్దేన ముముక్షుణా... జిజ్ఞాసా సతతం సంపాదనీయా ఇతి. -వే, పా, సౌ.(౧-౧-౧)

కుండజాలదు. అయ్యది గుణయుక్తమగునది గుణముకంటె అతీతమై యుండ గలుగుచున్నది. అందువలన ఈ రెంటికిని గుణి గుణములు, లేక శక్తిమంతుడు శక్తి-ఉండు సంబంధము భేదాభేదము. బ్రహ్మము సగుణము, నిర్గుణముగూడ, రూపమున సగుణత్వ నిర్గుణత్వములకుండు ఆ పాత విరోధము వాగ్మాత్రము. బ్రహ్మము సర్వజ్ఞ స్వభావము; జడస్వభావము కాదు. బ్రహ్మమునుండి జగత్తు అభిన్న మగుటవలన విషయము లన్నియును బ్రహ్మమున అభిన్న భావముననే వెలయు చున్నవి. బ్రహ్మస్వరూపమున ఎట్టి వికారమునకును తావు లేదు. కాలశక్తి కూడ బ్రహ్మముననే లయ మగుచున్నది. బ్రహ్మమున గుణము, గుణి యను భేదము లేదు. అందు జ్ఞానము - జ్ఞాతృ - జ్ఞేయ భేదములు లేకపోవుట వలన నిర్గుణత్వ నిష్క్రియత్వములు సిద్ధించు చున్నవి.

బ్రహ్మము సర్వశక్తిమంతము. ఈశక్తి స్వాభావికము. ఈశక్తి బలముననే అయ్యది తనకంటె వేరగు జగత్తును ప్రకాశింప జేయు చున్నట్లు తోచుట్టును. ఈ శక్తిబలముననే స్వరూపాంతర్గత మగు జగత్తును భిన్నరూపమున దర్శించుచున్నది. ఇట్లు వీక్షించునదియే జీవశక్తి.

జగదతీతమగు బ్రహ్మభావము నిర్గుణము; జగదంతర్గత మగు బ్రహ్మభావము సగుణము. ప్రళయకాలమున జగత్తు బ్రహ్మమున లీన మైనను, దాన బ్రహ్మము కళంకిత మవదు - పృథివీవికారము లందు విలీనములైనను దానిని కలుషిత మొనర్పనట్లు. నిర్గుణ మనగా అనంతగుణము.

జీవుడు:

జీవుడు బ్రహ్మముయొక్క అంశ. జీవునకును, బ్రహ్మమునకు భిన్నాభిన్నులు. 'జ్ఞాజ్ఞౌద్వావజావీశానీశౌ' 'తత్త్వమసి' అను శ్రుతివాక్యము లీ విషయముననే సమర్థించుచున్నవి. జీవుడు పరమేశ్వ రుని కార్యము. కార్యము కారణము నుండి అభిన్నము. అందువలన జీవబ్రహ్మముల కభేదము. సముద్రము తరంగములవలెను. సూర్యుడు తేజములవలెను జీవేశ్వరులు భిన్నాభిన్నులు. మఱియొక ఉదాహరణ:

వజ్రవైడూర్యాదులు భూవికారములే యైనను, భిన్నముగ తోచు చున్నవి. వాస్తవమున నవి భిన్నములు కావు.

జీవుడు అణువు; విభుడు కాడు. జీవుడు అల్పజ్ఞుడు. ముక్తావస్థ యందు గూడ జీవుడు జీవుడే. అణుత్వ, నిత్యత్వము లాతనియందు స్థిరములు. ముక్తులకును, బద్ధులకును గల ప్రభేద మిది: బద్ధజీవులకు తమయొక్కయు, జగత్తుయొక్కయు బ్రహ్మభావ మనుపలబ్ధము; దృశ్యముతో నేకత్వము నందును. ముక్తావస్థయందు తనయొక్కయు, జగత్తుయొక్కయు, బ్రహ్మముయొక్కయు అభేదత్వము గోచరమగును. అనగా, తన్ను, జగత్తును బ్రహ్మముతో నొకటిగా నెరయును. ఏ వస్తువుయొక్క స్వరూపమునకును ఐకాంతిక వినాశము లేనందు వలన జీవుడు జీవుడుగానే యుండిపోవును. 'తత్త్వమసి' వాక్యము అభిన్నత్వ సాదృశ్యపరము; సామ్యజ్ఞాపకము కాదు.

జగత్తు:-

బ్రహ్మమే దీనికి నిమిత్తోపాదాన కారణము అని పూర్వము చెప్పియుంటిని. క్షీరము దధి యగునట్లు బ్రహ్మమే అసాధారణశక్తి యోగమున కార్యాకారముగా పరిణతి నందుచున్నది. ఇయ్యది స్వశక్తివిక్షేపమువలన సంభవము. ఇట్లు పరిణమించియు అవికృత ముగా నుండుట సర్వశక్తిమంతునపట్ల చోద్యము కాదు.

సాధన - ముక్తి:-

భక్తియే సాధనోపాయము. ఉపాసనాఫలము బ్రహ్మప్రాప్తి భక్తియే ముక్తిని గూర్చును. జగత్తును, తన్ను బ్రహ్మరూపమున భావించుట భక్తియొక్క అంగము. భక్తుడు భగవంతుని జగదతీతు నిగా చింతించును, తత్ఫలముగా నాతడు 'అర్చిరాదిమార్గము' న బ్రహ్మలోకమున కరుగును. శూద్రులకు బ్రహ్మవిద్యాధికారము లేదు.

అనుశీలన :

బ్రహ్మము సగుణము, నిర్గుణమునుగూడ అనుటవలన ద్వైతా ద్వైతమును, బ్రహ్మమును, జీవుడును భిన్నాభిన్నులనుటవలన

"ఆభాస ఏవ చ" (౨-౩-౪౯) అని శంకరుడు గ్రహించిన సూత్రమునకు నింబార్కపాఠము 'ఆభాసా ఏవ చ' అని.

"ఉత్పత్త్యసంభవాత్" (౨-౨-౪౨) అను సూత్రమును శంకరుడు పాంచరాత్ర (భాగవత) మత ఖండన పరముగా వ్యాఖ్యానించెను. శ్రీ రామానుజులు సాంఖ్యమత ఖండన పరముగా నుడివెను. నింబార్కుడు శక్తికారణవాద ఖండన పరముగా అర్థమును జెప్పెను.

సమాప్తి :-

వేదాంత పారిజాత సౌరభము నాఘ్రాణించి, ఆనాటియున్న వాదముల నన్నిటిని సమన్వయించి, మత వివాదములను బోనడప నింబార్కస్వామి ప్రయత్నించియుండెనని గ్రహింపగలము. ఒక పక్షమువారు అద్వైతమును, అన్యులు ద్వైతమును గ్రహించి పోరాడుచుండ నింబార్కుడు సర్వశక్తిమంతమగు బ్రహ్మమునందు ఈ రెండును సమంజసమని నిరూపింప యత్నించెను. ఈ నాతని ప్రయత్నము, విరుద్ధ ధర్మముల యుగపదవస్థానము అసంభవమేయైనను, ధన్యవాదార్హము.† ఈ వైరుధ్యమునుండి తప్పుకొనన్ తరువాతి వారును, నింబార్కుని మతవాదము నెక్కువగా పరిగ్రహించినవారును నగు గౌడీయ వైష్ణవులు 'అచింత్య' పదమును నిరివిగా ప్రయోగించిరి.*

వీరిరువురకును శ్రీమద్భాగవతము ప్రధాన గ్రంథము. రాధాకృష్ణుల యుగళమూర్తి ఉపాస్యము. రాధకు గౌడీయ వైష్ణవమతమున నున్నంత ప్రాధాన్యము నింబార్క మతమున లేదు.

నేటివరకును అవ్యాహతముగ నింబార్క సంప్రదాయము నిలిచియుండుట గాంచిన నింబార్కుని సమయమునను, తదనంతరమును ఇయ్యది బహుళప్రచారమున నున్నట్లు ఊహింపగలము. 'సర్వ

---

† స్వసిద్ధాంత వ్యాఘాతకమును శ్రీ నింబార్కుడే "ఏకస్మిన్ వస్తుని సత్త్వాసత్త్వాదేః విరుద్ధ ధర్మస్య ఛాయాతపవత్ యుగప దసంభవాత్" (వే. పా. సౌ. ౨-౨-33) అని వచించియుండుట గమనింపదగియున్నది.

* గౌడీయ వైష్ణవసిద్ధాంతము అచింత్య భేదాభేదవాద మనబడుచున్నది.

నిరాకృతి' యగు కాలపురుషుడే తత్సంప్రదాయ గ్రంథములను గ్రసించి యుండుట శోచనీయము. అంతయును ఇచ్ఛామయుని ఇచ్ఛయని సమాశ్వాసించుకొనుట కంటె అన్యోపాయము లేదు.

> యువతీనాం యథా యూని యూనాంచ యువతౌ యథా,
> మనోభిరమతే తద్వన్మనోభిరమతాం త్వయి.

---

## వేదాంత దర్శనము : అచింత్య భేదాభేదవాదము - ౬

### (చైతన్యమతము)

యస్య బ్రహ్మేతి సంజ్ఞాం క్వచిదపి నిగమో యాతి చిన్మాత్రసత్తా
ప్యంశో యస్యాంశకైస్స్వైర్విభవతి వశయన్నేవ మాయాం పుమాంశ్చ,
ఏకం యస్యైవ రూపం విలసతి పరమవ్యోమ్ని నారాయణాఖ్యం
స శ్రీకృష్ణో విధత్తాం స్వయమిహ భగవాన్ ప్రేమ తత్పాదభాజాం.

(గోవిందభాష్యమ్)

ప్రవేశిక :-

వాతిసింహ, విద్యాసాగరులను గురువులనుబడసి, నిమాయి పండితుడని ప్రసిద్ధి కెక్కిన శ్రీకృష్ణచైతన్యస్వామియే (మధ్వ-గౌడీయ వైష్ణవదర్శన మనబడు) అచింత్య భేదాభేదవాద బీజములను వెదజల్లినాడు. ఈయన శ్రీమన్మధ్వాచార్యులనే పరమగురునిగ గ్రహించెను. సాంప్రదాయిక మగు భాష్యాదులను విరచించు శక్తి గలిగి యుండియు అనవసర మని యెంచి, జీవిత మంతయు భగవన్నామ ప్రేమమూలసంకీర్తనప్రచారమునకే వెచ్చించెను. తరువాతివారు శ్రీకృష్ణ, బ్రహ్మ, నారద, బాదరాయణ, మధ్వ, పద్మనాభ, నృహరి, మాధవ, అక్షోభ్య, జయతీర్థ, జ్ఞానసింధు, దయానిధి, విద్యానిధి, రాజేంద్ర, జయధర్మ, పురుషోత్తమ, బ్రహ్మణ్య, వ్యాసతీర్థ, లక్ష్మీపతి, మాధవేంద్ర, ఈశ్వర (అద్వైత, నిత్యానంద), చైతన్యదేవుల నామములను తమ గురుపరంపరలో చేర్చుకొనిరి.

శ్రీ చైతన్యదేవుని సాక్షాచ్ఛిష్యులను, షడ్గోస్వాములనబడు వారిలో రూప (సంబంధ తత్త్వాచార్యులు), సనాతన (అభిధేయాచార్యులు), రఘునాథ (ప్రయోజన తత్త్వాచార్యులు), రఘునాథ (భట్టు), గోపాల, జీవగోస్వాములు ఈ వాదబీజమును అంకురితమును, పల్లవితమును అగునట్లు చేసిరి. వంగ, ఓఢ్రదేశములలో చైతన్యస్వామి కలియుగమును పావనము చేయుటకు ఇలాతలమున నవతరించిన శ్రీకృష్ణుడే యని విశ్వసింతురు. అట జనసామాన్యము

మనస్సులలో భగవంతుని నామ ముచ్చరించిన ఉదయించునది శ్రీమన్మహాప్రభుని మూర్తియే యని ఇట సంక్షేపముగ జెప్పిన చాలును.

ఇట్లు షడ్గోస్వామిపాదులచే పల్లవితమును, అంకురితమును నగు ఈ నామబీజము శ్రీనివాస, బలదేవాదుల యత్నముగ కుసుమితమై ఫలప్రద మయ్యెను

శ్రీ చైతన్యస్వామియును తదనంతరము ఏతన్మతవాదమును ప్రచారమొనర్చిన శ్యామానంద, శ్రీనివాస, నరోత్తమదాసులను వారును, గోస్వామిపాదులును శ్రీమద్భాగవతమునే వ్యాససూత్రములకు భాష్యముగ గ్రహించియుండిరి. క్రీ. శ. ౧౮-వ శతాబ్దమున వెలసిన బలదేవ విద్యాభూషణుడే సంప్రదాయానుసారము ప్రస్థానత్రయమునకు భాష్యమును రచించెను. కనుక, ఈ వ్యాసమున ఏతదాచార్యరచితము. గ్రంథములు, మతవాదమును వివరింపబడుచున్నది[1] ఈ మతమువారికి నవద్వీప, బృందావన, జగన్నాథక్షేత్రములు ప్రధానములని తెలియనగును.

జీవితము :

శ్రీ బలదేవుడు వంగీయ బ్రాహ్మణుడు. బాల్యమున స్వదేశముననే కావ్యాలంకారాది శాస్త్రముల నభ్యసించెను. శ్యామానందుని ప్రశిష్యుడగు రాధాదామోదరుని శిష్యత్వమును గ్రహించెను. పిదప బృందావనమున కరిగి, శ్రీవిశ్వనాథచక్రవర్తి, పీతాంబరదాసులనువారి కడ గూడ శాస్త్రముల నభ్యసించెను.

జయపూరు రాజధాని యగు జయసింహుని (రాజపుత్రస్థానము) సభయందు, అట నున్న శ్రీగోవిందవిగ్రహమున కెవరెవరికి సేవాధికారమున్నదో నిర్ణయింపబడు సమయమున గౌడీయ-వైష్ణవులకు సంప్రదాయ భాష్యము లేనందువలన అధికారము లేదని నుడువబడెను.

1 గౌడీయ వైష్ణవుల మతసారము నొక్క ముక్కలో చెప్పవలెనన్న—
"ఆరాధ్యో భగవాన్ వ్రజేశతనయ స్తద్ధామ బృందావనం, రమ్యా కాచి దుపాసనా వ్రజవధూవర్గేణ యా కల్పితా, శాస్త్రం భాగవతం ప్రమాణమమలం ప్రేమా పుమర్థో మహాన్, శ్రీచైతన్యమహాప్రభోర్మత మిదం తత్రాదరో నః పరః."

— శ్రీనాథచక్రవర్తి.

అప్పుడట, ఆ సభయందు శ్రీబలదేవ విద్యాభూషణు లుండుట తటస్థించెను. ఆయన వెంటనే శ్రీగోవిందుని పాదముల నాశ్రయించి, తదాదేశానుసారము వేదాంతభాష్యము నొక నెలలో రచించి, తన సంప్రదాయమువారి ప్రతిష్ఠను నిలబెట్టెను. ఫలితముగ, ఈయన విరచిత భాష్యగ్రంథమునకు 'గోవిందభాష్యము' అను అన్వర్థ నామము కలిగెను.[2] ఈ విషయమును బలదేవుడే వాకొనినాడు.

ఏతదాచార్యుడు వైశ్యకుల సంభూతు డని కొందరందురు. గాని, ప్రస్థానత్రయ భాష్యరచయిత యగు బ్రాహ్మణుడే ఆచార్యు డను సాంప్రదాయిక నియమ మున్నందువలన ఈమాట చెల్లదు. మఱియు, అపశూద్రాధికరణమున 'బ్రాహ్మణానామేవ అధికారః' అని వాకొనియుండుట వలన ఈయన బ్రాహ్మణుడే అని ఒప్పుకొన వలసి వచ్చుచున్నది. స్వాధికార వ్యాఘాతకర మగు సిద్ధాంతమును మందుడు గూడ విరచింపజాలడు కదా!

గ్రంథములు :-

గోవిందభాష్యమను వేదాంత సూత్రభాష్యమే బలదేవుని ముఖ్య గ్రంథము. సులలిత మగు భాషలో అచింత్య భేదాభేదవాద మిందు స్థాపింపబడినది. దీనికి బలదేవుడే స్వయముగ నొక టీకను వ్రాసెను. సటీక గోవిందభాష్యమును వంగాక్షరములలో ముద్రింపబడి యున్నది. కాని ఇంతవఱకు దేవనాగరలిపిలో ముద్రింప బడినట్లు గోచరదు. అలహాబాదు నందలి 'పాణిని ఆఫీస్' వారు ఆంగ్లానువాద మును ప్రకటించియున్నారు.

విస్తృత మగు భాష్యమును పఠింపజాలనివారికి వీలుగ నుండు నట్లు బలదేవుడు 'సిద్ధాంతరత్నము', లేక 'భాష్యపీఠకము' అను ప్రకరణ గ్రంథము నొకదానిని రచించెను. ఇది మ. మ. పండిత గోపీనాథకవిరాజు, ఎమ్. ఏ. గారి సంపాదకత్వమున కాశీయందలి

---

2 "విద్యారూపం భూషణం మే ప్రదాయ, ఖ్యాతిం నిన్యే తేన యో మా ముదారః, శ్రీగోవిందస్వప్ననిర్దిష్ట భాష్యో రాధాబంధుర్బంధురాంగః స జీయాత్."

— గోవిందభాష్యమ్

సరస్వతీభవన గ్రంథమాల నుండి వెలువడియున్నది. దీనికి బలదేవ విరచిత సూక్ష్మ టీకగూడ యున్నది.

దశోపనిషద్భాష్యము, గీతాభూషణ మను గీతాభాష్యము, సుధ యను విష్ణుసహస్రనామ భాష్యము గూడ వంగాక్షరముల ముద్రితమై వెలువడినవి.

'ప్రమేయరత్నావళి' అను ఒక ప్రకరణగ్రంథమును బలదేవుడు సంక్షిప్తముగ సిద్ధాంతసారమును దెల్పుచు విరచించెను. ఇందు ౧. విష్ణుని పారమ్యము (శ్రేష్ఠత్వము) ౨. (విష్ణుని) అఖిలామ్నాయవేద్యత్వము, 3. విశ్వసత్యత్వము, ౪. జీవభేదసత్యత్వము, ౫. భగవద్దాసత్వము, ౬. జీవతారతమ్యము, ౭. శ్రీకృష్ణప్రాప్తి రూపమగు మోక్షము, ౮. విశుద్ధభక్తియే మోక్షహేతుత్వము అను ప్రమేయములును, ఈ ప్రమేయజ్ఞానకారణము లగు ప్రత్యక్ష అనుమాన, శబ్దములను ప్రమాణములును విశదీకరింప బడినవి. ఈ గ్రంథమునకు శ్రీ విశ్వనాథ చక్రవర్తి శిష్యుడగు శ్రీకృష్ణవేదాంతవాగీశుడు 'కాంతిమాల' యను టీకను రచించెను శ్రీ అక్షయకుమారశాస్త్రి యను నవీనపండితుడు గూడ 'ప్రభ' యను టీకను రచించెను. ఈ గ్రంథ మింతవఱకును మువ్వురచే ప్రకటింపబడినను, ఉపర్యుక్త టీకాద్వయసమేతముగ కలకత్తా యందలి సంస్కృత సాహిత్యపరిషత్తువారు దేవనాగరలిపిలో వెలువరించిన సంస్కరణమే శుద్ధముగ నున్నది. న్యాయవైశేషికదర్శన ప్రవేశము గోరువారికి సిద్ధాంతముక్తావళియు అద్వైత వేదాంతసారమును తెలుసుకొనగోరు వారికి సదానందకృతమగు వేదాంతసారమును, రామానుజదర్శనమర్మము గ్రహింపగోరువారికి 'యతీంద్రమతదీపిక' యును తోడ్పడునట్లు అచింత్యభేదాభేదము నెఱుగ గోరువారికీ గ్రంథము తోడ్పడగలదు. ఇందు బలదేవుడు గూడ శ్రీ మధ్వాచార్యులనే పరమగురువుగ గ్రహించియుండుట గమనింపదగియున్నది.[3]

3 'ఆనందతీర్థనామా సుఖమయధామా యతి ర్జీయాత్,
సంసారార్ణవతరణిం య మిహ జనాః కీర్తయంతి బుధాః'
— ప్ర. ర. ౧ 3.

అట్టి కర్మల నాచరించినను లోకమున విశేషమగు ఫలము, అనగా జిజ్ఞాస ఉదయించుట లేదు. పవిత్రవర్తనుడై, సాధుసంగ మొనర్చిన జిజ్ఞాస అవశ్య ముదయించుచున్నది. కనుక సాధుసంగమే ముఖ్యము. నిత్యానిత్యవస్తువివేకాదిజ్ఞానానంతరము అధికారము లభించునని చెప్ప జాలము. సత్ప్రసంగము లేకున్న ఈ వివేకము లభింపదు. కనుక, సాధుసంగఫలితముగ చిత్తశుద్ధిని, వివేకాది గుణములను బడసినవాడే అధికారి. సనిష్ఠులు, పరినిష్ఠులు, నిరపేక్షులు అని అధికారులు మూడు విధములుగ నుందురు. అందు నిష్ఠతో కర్మ నాచరించువారు సనిష్ఠులు; లోకసంగ్రహార్థము కర్మ నాచరించువారు పరినిష్ఠులు; కేవలము ధ్యానమొనర్చువారు నిరపేక్షులు.

సంబంధము:-

బ్రహ్మమునకును, శాస్త్రమునకును వాచ్యవాచక సంబంధ మున్నది. లక్ష్యార్థముతో పనిలేదు. "తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి" ఇత్యాదులగు శ్రుతివాక్యములు బ్రహ్మముయొక్క శబ్ద వాచ్యత్వము నే నిరూపించుచున్నవి. "సర్వే వేదా యత్పదమామ నంతి" అను వాక్యములుగూడ ఈ విషయము నే దృఢపరుచుచున్నవి. దృష్టమగు మేరువును అదర్శనీయమనునట్లు బ్రహ్మముగూడ 'అవాచ్య' మనబడుచున్నది. "దేవదత్తుడు కాశీనుండి నివృత్తుడైనాడు". అనిన అతడు కాశికాపురి కరిగి మరలినట్లు గ్రహింపదగినరీతిగనే "ఎటనుండి వాక్కు నివర్తిత మగుచున్నదో" (తై.ఉ), "ఎవడు వాక్యములవలన సంపూర్ణముగ ప్రకాశింపబడడో" అను వాక్యములనుగూడ అర్థ మొనర్చుకొనవలసియున్నది. అనగా, ఒకింత జ్ఞానము లభించిన దని. బ్రహ్మము వేదప్రకాశ్యము కానిచో వేదపఠనమే వ్యర్థ మగును.

విషయము - ప్రయోజనము:-

నిరవద్యుడును, విశుద్ధుడును, అనంతగుణయుతుడును, అచింత్య శక్తియును, సచ్చిదానందుడును, పురుషోత్తముడును నగు శ్రీకృష్ణుడే విషయము. "తస్మాత్ కృష్ణ ఏవ పరో దేవస్తం ధ్యాయేత్ తం

రసేన తం ధ్యాయేత్ తం భజేత్" (గోపాల ఉ.) అను శ్రుతివాక్యము తెలుపుచున్నది ప్రమాణము. అశేషము లగు దోషముల వినాశన మొనర్చి, శ్రీకృష్ణదర్శన మొనర్చుటయే ప్రయోజనము. మఱియు, ఈ శాస్త్రమున ఈశ్వర, జీవ, ప్రకృతి, కాల, కర్మము లను తత్త్వము లైదు ప్రతిపాదింపబడును. ప్రమాణములు ప్రత్యక్ష, అనుమాన, శబ్దములు. ఈశ్వర, జీవ, ప్రకృతి, కాలములు నిత్యములు ; కర్మ అనిత్యము.

బ్రహ్మము, లేక ఈశ్వరుడు:-

ఈశ్వరుడు స్వతంత్రుడు, కర్త, సర్వజ్ఞుడు, ముక్తిదాత, విజ్ఞాన స్వరూపుడు. పూర్ణచైతన్య మగు ఈయన నిత్యజ్ఞానగుణవిశిష్టుడు. స్వరూపశక్తియుతు డగు ఈయన ప్రకృతి మున్నగువానియందు అనుప్రవేశ మొనర్చి, జగత్సృష్టిని, భోగమోక్షములను గలిగించుచున్నాడు. ఈయన నిత్యలక్ష్మీయుతుడు. అవతారములను దాల్చినప్పుడుగూడ లక్ష్మీయుక్తుడుగనే యుండును. ఈయనకు సంధినీ-సంవిద్-హ్లాదినీ రూప త్రయాత్మిక మగు స్వరూపశక్తి యున్నది. ఈయన జగత్తునకు నిమిత్తోపాదాన కారణములు. ఈయనకు సచ్చిదానందవిగ్రహమున్నది. అయ్యు, ఈయన సర్వవ్యాపి. గాంధర్వశాస్త్రజ్ఞులు శ్రవణేంద్రియమున రాగ స్వరూపమును ప్రత్యక్ష మొనర్చుకొనునట్లు భక్తులు భక్తిభావితచిత్తమున ఈ చిదానందవిగ్రహమును ప్రత్యక్ష మొనర్చుకొనుచున్నారు. అంతియకాక, ఒకేసమయమున, ఉపాసకుల కందఱికిని విభువు అగుటవలన ప్రత్యక్షమగును. ఇయ్యది 'అచింత్య' శక్తి వలననే జరుగుచున్నది. ఈయనయందు ప్రభుత్వ, సుహృత్త్వ, జ్ఞానదత్వ, మోచకత్వాదిగుణము లున్నవి. భగవంతుని చిద్ఘన దేహమునకును, ఆత్మకును 'భేదము' లేదు; రెండును ఒక్కటియే. విభుత్వాది ధర్మములుగూడ ధర్మియగు ఈశ్వరునినుండి వేరుగావు. ఈశ్వరుడును; ఆయన శక్తియును ఒక్కటియే యైనను ప్రకాశము ననుసరించి అంశాంశీభావము సిద్ధించుచున్నది. అవతారములలో కొన్ని అంశావతారములు, మఱికొన్ని కలామాత్రములు. కాని శ్రీకృష్ణుడు స్వయ

ముగ భగవంతుడే. ఈయన అప్రాకృతుడైనట్లు ఈయన ధామము కూడ అప్రాకృతమే. రూప-లీలా-కర్మ-ధామ పార్షదులుగూడ నిత్యములే. ఈయన అవ్యక్తుడైనను ఏకరసస్వరూపుడే యైనను స్వరూపభూతమగు జ్ఞానానందమును ప్రసాదించుచున్నాడు. నిత్యజ్ఞానాది గుణము లీయన కున్నవి. అయ్యు, ఇది నిర్గుణము. నిర్గుణమన ప్రాకృత రజస్తమోగుణహీనము. మఱియు, బ్రహ్మము అప్రాకృతగుణముల కాకరము.

జీవజగత్తులు:-

బ్రహ్మమే జగత్తుయొక్క నిమిత్తోపాదాన కారణము లని నుడివితిని. ఈయన తన 'అచింత్య శక్తి' వలన స్వరూపప్రచ్యుతుడు గాకుండగనే జగదాకారముగ పరిణమించుచున్నాడు. జగత్తు సత్యమే. అటనట, శాస్త్రములు జగత్తు మిథ్య యని చెప్పుట వైరాగ్యమును గలుగజేయుటకే. కాని, జగత్తు అనిత్యము. జీవుడు అణుచైతన్యము. ఈశ్వరుని వలెనే నిత్యజ్ఞానాది గుణవిశిష్టుడు, అస్మత్ శబ్దవాచ్యుడు. ఈశ్వరుడు గుణి, జీవుడు గుణము. ఈశ్వరుడు శరీరి; జీవుడు శరీరము. జీవాత్మలు పెక్కులు. ఇవి నానావిధస్థితుల వెలయుచుండును. కర్మఫలానుసారము జీవుల పరస్పర భేదత్వముకూడ గ్రహింపబడును. ఈశ్వరవైముఖ్యమే బంధము. ఈశ్వరానురతివలన స్వరూపావరణ, గుణావరణ అను బంధములు తొలగిపోవ, తత్సాక్షాత్కారము లభించును. జీవుడు నిత్యుడు.

అన్నిటికిని ఊర్ధ్వమున గోలోకమున్నది. తరువాత క్రమముగా వైకుంఠ, శివ, దుర్గా (భూ)లోకములున్నవి.

సాధన, భక్తి:-

భక్తియే ముఖ్యసాధనము. ఉపాసనాఫలముగ భగవంతుడు ప్రీతుడగును, ముక్తి నొసగును. జ్ఞాన వైరాగ్యములు సహకారి సాధనములు. [7] భక్తి హ్లాదినీ, సంవిత్ శక్తుల సారము. కనుక

7. "న వినా సాధునైర్గుణ్యే జ్ఞానవైరాగ్యభక్తిభిః,
దదాతి స్వపదం శ్రీమానిత్యస్తాని బుధః శ్రయేత్." —గోవింద భా.(3.1.1.)

నియ్యది జ్ఞానస్వరూపమును, ఆనందదాయకమును నగుచున్నది. విద్యా, వేదన రూపమగు జ్ఞానసారమే భక్తి. శుద్ధమగు 'త్వం' పదార్థజ్ఞానమే విద్య. ఇయ్యది నిర్వాణము కొఱకు సాధనము. 'తత్' పదార్థజ్ఞానమగు విధిభక్తియును, రుచిభక్తియును గలసి వేదన యనబడును.

తాప, పుండ్ర, నామ, మంత్ర, యాగములను పంచవిధ సంస్కారములను బడసి ద్వివిధభక్తిభావములను సిద్ధింపజేసుకొనినవారికే ఈశ్వర సాక్షాత్కారము లభించును.

తాపమన చందనాదులతో హరినామాదికమును ముద్రించుకొనుట. పుండ్రమన తిలకధారణము. నామమన 'హరిదాసు', 'కృష్ణదాసు' మున్నగు భృత్యత్వసూచక నామములను ధరించుట. మంత్రమన అష్టాదశాక్షరాది మంత్రోపదేశమును బొందుట. యాగమన సాలిగ్రామపూజ. శ్రవణకీర్తనాది రూపకమగు నవధాభక్తియే శాస్త్రవిధి నియంత్రితమైన వైధీభక్తి యనియు, అను రాగనియంత్రితమైన రాగానుగయనియు అనబడును. వైధీభక్తి ననుసరించువాడు చతుర్బాహుధారియగు భగవంతుని పూజించును. రాగానుగభక్తియుక్తుడు నృలింగ చిహ్నితములును, ద్విభుజ యుక్తములును అగు రామకృష్ణాదిరూపముల నర్చించును. 8

ఈ భక్తి పరిపక్వమైన భావమనబడును. ఈ భావము శాంత, దాస్య, సఖ్య వాత్సల్య, మధురములని పంచవిధము.

శాంతభావమున సర్వమత సామాన్యమగు తీవ్ర వైరాగ్యము, ఇష్టవస్తువుపై జపాదిసాధనల ననుసరించి మనస్సును నిల్పు యత్నము ఉండును. ఇందు సిద్ధుడైనవాడు దాస్యభావము నాశ్రయించును. భగవంతుడు ప్రభువు, భక్తుడు దాసుడు. ఇట క్రియా, కర్మలుండును. ఏట పరిశాంతుడైన నతడు సఖ్యభావమును ఆశ్రయించును. ఈ భావమున భగవంతుడును, భక్తుడును చెలికాండ్రవలె వ్యవహరింతురు.

---

8, గోస్వామివారుల ఉత్తమభక్తి నిర్వచన మిట్లు అనుసంధేయము:

"అన్యాభిలాషితాశూన్యం జ్ఞానకర్మాద్యనావృతమ్,
ఆనుకూల్యేన కృష్ణాను శీలనం భక్తి రుత్తమా."

ఎట్టి నైతిక నిబంధనలును వీరి మనస్సుల నరికట్టజాలవు. ఇందు స్థితిని బడసినవాడు మధురభావము నాశ్రయించును. ఇట భక్తునకు, భగవానునకు ప్రేమబద్ధులగు యువతీయువకుల మధ్యనుండు సంబంధ ముండును. పూర్వ పూర్వములగు భావముల గుణములు ఉత్తరోత్తర ముగ సంక్రమించుచుండును. అన్నిటికంటె మధురభావమే ఉత్కృష్టము.

ఈ భావసాధనయొక్క మహత్ఫలమే మహాభావ మనబడు ప్రేమ. ఇదియే జీవుని సహజస్థితి. ఇదియే ప్రాప్యము. ఇదియే భగవద్దర్శనమును, నిత్యధామమగు గోలోకవాసమును జేకూర్చి, జీవునకు అనంతమగు ప్రశాంతిని, ఆనందమును, సౌఖ్యమును గలిగించును.

అనుశీలన:-

పూర్వతనాచార్యు లందఱును చతుస్సూత్రినే (వేదాంత సూత్ర, ప్రథమాధ్యాయ, ప్రథమపాద, ప్రథమచతుస్సూత్రములు) సమస్తశాస్త్రమర్మప్రబోధకముగ గ్రహించియుండిరి. కాని ఆచార్య బలదేవ విద్యాభూషణులు—

"ఏతామేకాదశసూత్రీం సభాష్యాం
పంచన్యాయీం యే పఠేయుః ససూక్ష్మాః,
తత్త్వజ్ఞానం సులభం కిం న తేషాం
శేషగ్రంథో య మతివిస్తరకారీ."

— గోవింద భాష్య టీక (౧-౧-౧౧)

అని మొదటి పదకొండుసూత్రములను శాస్త్రసారముగ నిర్వచించెను.

శాంకరమతమున బ్రహ్మము నిర్గుణము; ఏతన్మతమున బ్రహ్మము స్వరూపశక్తియుతము. అద్వైతమతాధికారి సాధనచతుష్టయసంపత్తి కలిగియుండుట ముఖ్యలక్షణము. బలదేవుడు విధించునది సాధుసంగము. కర్మాద్యనాశ్రితమగు శుద్ధజ్ఞానమును మోక్షకారణముగ అద్వైతు లంగీకరింప, వీరు ఏవంవిధమగు భక్తినే గ్రహించుచున్నారు. అద్వైతుల ముక్తి ప్రాప్యవస్తుప్రాప్తి; గాడియవైష్ణవదర్శనము ముక్తి భగవ

త్రిపాద లబ్ధము. శాంకరమతమున సగుణ, సోపాధిక బ్రహ్మము వాచ్యము; నిర్గుణ, నిరుపాధిక బ్రహ్మము లక్ష్యము. బలదేవుడు కేవలము వాచ్యార్థమునే గ్రహించెను. అద్వైతులు బ్రహ్మమవాచ్యమగుటవలన నిషేధముఖమున వేదములు ప్రస్తావించుచున్న వందురు. బలదేవుని మతమున అవాచ్యత్వమున సాకల్యనిరూపణాసమర్థతయే. "ఇతరేషాం చానుపలబ్ధేః" (వే. సూ. ౨ ౧-౨) అను సూత్రమున శంకరుడు అశ్రౌతమని నిరసించిన మహత్తత్త్వమును బలదేవుడు గ్రహించినాడు. శూద్రులపట్ల శంకరుడు చూపిన ఔదార్యము వీరును చూపక, పురాణాదిశ్రవణమున వీరు పొందు ముక్తి నికృష్టమనెను.

శ్రీరామానుజుడు చిదచిద్విశిష్టముగు బ్రహ్మము సంగీకరించినట్లు వీరు శక్తిత్రయవిశిష్ట (స్వరూపశక్తి) మగు బ్రహ్మము సంగీకరించుచున్నారు. శ్రీరామానుజుడు అచిదంతర్గత మొనర్చిన కాల, కర్మము లనునవి వీరికి భిన్నములగు తత్త్వములు. శ్రీరామానుజుడు జీవన్ముక్తి సంగీకరింపకపోయినను వీరు అంగీకరింతురు.

మధ్వుడు ప్రతిపాదించిన బ్రహ్మసగుణత్వసవిశేషత్వములను జీవుని అణుత్వసేవకత్వములను, జగత్ సత్యత్వబ్రహ్మాధీనత్వములను బలదేవుడు గ్రహించెను. "ఈక్షతేర్నాశబ్దమ్." (వే. సూ. ౧ ౧ ౫) అను సూత్రమునుగూడ మధ్వుడు వ్యాఖ్యానించినరీతిగనే గ్రహించెను. కాని, జీవబ్రహ్మములకు అత్యంతభిన్నత్వమును వీరు ఒప్పుకొనరు. గుణిగుణత్వభావముగ భిన్నాభిన్నులు. మధ్వమతమున లక్ష్మి జీవకోటియందు పరిగణింపబడుచున్నది. కాని, బలదేవుని సిద్ధాంత ప్రకారము ఈశ్వరుడు నిత్యలక్ష్మీయుతుడు. మధ్వుడు కర్మమిశ్రితమగు భక్తిని గ్రహించెను. వీరు శుద్ధభక్తినే అంగీకరింతురు. మధ్వుడు తప్తముద్రాంకనమును గ్రహింప, వీరు చందనాదులవలన ముద్రలను ధరించుచున్నారు. మధ్వమతమున ఐశ్వర్యప్రధానమగు భక్తియును, ఈ మతమున మాధుర్యప్రధానమగు భక్తియును అవలంబింపబడుచున్నవి. మధ్వమతమున, భక్తులలో దేవతలే ముఖ్యులు. ఈ మతమున నిత్యధామమగు వ్రజపురియందు వసించు నిత్యసహచరులే ముఖ్యులు.

వల్లభాచార్యుని 'పుష్టి'మార్గమే వీరి మధురరతిగ పరిపుష్టినందినను, వల్లభుడు వాత్సల్యభావమునకే విశేషప్రాధాన్యము నొసగెను. వీరు మధురభావమును సర్వభావసమాహారముగ నంగీకరించిరి. ఇక, నింబార్కుని 'అచింత్యశక్తి', 'భేదాభేదము'లను గౌడీయదర్శనము సర్వాత్మనా అంగీకరించినది. శ్రీ జీవగోస్వామిపాదులు 'అచింత్యశక్తి'ని, బలదేవవిద్యాభూషణులు మధ్వమతాంతర్గతమగు 'విశేషము'ను గ్రహించి భేదాభేదతత్త్వమును ఉపస్థాపిత మొనర్చిరి. మఱియు, అద్వైతులు ఏ 'అర్థాపత్తి' ప్రమాణబలమున జగన్మిథ్యాత్వమును స్థాపించిరో, ఆ అర్థాపత్తినే గ్రహించి శ్రీజీవగోస్వామిపాదులు 'భేదాభేదము'ను నిర్వచించి యుండిరని గమనింపనగును. వీరి మతమున 'తత్త్వమసి' అఖండార్థబోధకము కాదు. 'తత్త్వమసి' యన 'తస్యత్వమ్ అసి'.

సమాప్తి:-

వైదికసూక్తములందు మాదముగ నిక్షిప్తమైన భక్తితంత్రులు ఆళ్వారుల తీవ్రసాధనచే ప్రతిస్పందితములై, శ్రీరామానుజ, మధ్వ, వల్లభ, నింబార్కులచే మీటబడి, గౌడీయ వైష్ణవదర్శన మను మధుర రాగిణిగ రూపొందినవి; ఆళ్వారులయొక్కయు, శ్రీరామానుజుని యొక్కయు ఆశాస్వప్నములు శ్రీచైతన్యదేవునియందు సఫలీకృతములై, ఆ సేతుహిమాచలము భక్తితరంగములను లేవదీసెను.

ఈ భక్తితరంగములయొక్కయు, నూతనవిజేతలగు మహమ్మదీయుల మతముయొక్కయు సంఘర్షణాఫలితముగ ఉత్తరభారతమున జన్మించిన నానక్, దాదూ, కబీర్, సూరదాస్ మున్నగు మహాత్ముల జీవితమును, ఉపదేశములును ప్రణిధానయోగ్యములు. కేవలము మధురభావమునే ఆశ్రయించి ఉత్పన్నములో, లేక పరిపుష్టములో ఐన 'సహజియా', 'బాఉల్', 'కర్తభజా' మొదలగు 'ప్రకృతి సాధక' మతములను గుఱించికూడ ఇదే మాట.

వల్లభుడును, తదనంతరపు వైష్ణవులును శ్రీమద్భాగవతమును 'చతుర్థప్రస్థానము'గ గ్రహించి, తదితరప్రస్థానములకంటె దానికే

విశేషముగు ప్రాధాన్యము నొసగిరి. కనుక వీటి నన్నిటిని 'భాగవత దర్శనము' లనినను అనవచ్చును. అద్వైతులు శ్రీధరస్వామిటీకను ప్రామాణ్యముగ గ్రహించునట్లు, రామానుజసంప్రదాయమువారు వీరరాఘవీయటీకను, మధ్వులు విజయధ్వజటీకను, వల్లభసంప్రదాయమువారు సుబోధినీటీకను, నింబార్కమతస్థులు విశ్వనాథచక్రవర్తి కృతమగు సారార్థదర్శని యను టీకను; గౌడీయసంప్రదాయమువారు జీవ, సనాతనవిరచితములగు క్రమసందర్భ, వైష్ణవతోషణు లను టీకలను ప్రమాణములుగ పరిగణించుచున్నారు.

గజపతి రనుకంపాప్య సంపదా యస్య సద్యః
సమజని నిరవద్యః సాంద్ర మానంద మృచ్ఛన్,
నివసతు మమ తస్మిన్ కృష్ణచైతన్యరూపే
మతి రతిమధురిమ్ని దీప్యమానే మురారౌ. [సిద్ధాంతరత్నమ్]

# వేదాంత దర్శనము : భేదాభేదవాదము - 2

## (భాస్కర మతము)

ప్రవేశిక:-

వేదాంతసూత్రములకు భేదాభేదపరమగు భాష్యమును రచించిన ఆచార్యుని పేరు భాస్కరుడు. అనంత విస్తృతమగు సంస్కృత సాహిత్యగగనమున లోకభాస్కరుడు, శ్రౌతభాస్కరుడు, హరిభాస్కరుడు, భగవంతభాస్కరుడు, జ్యోతిష్యభాస్కరుడు, భదంతభాస్కరుడు, మిశ్రభాస్కరుడు, శాస్త్రిభాస్కరుడు, దీక్షితభాస్కరుడు, రాయభాస్కరుడు, ఆనందభాస్కరుడు, నాథభాస్కరుడు, సేనభాస్కరుడు అను సంజ్ఞలతో నొప్పు అనంత భాస్కరోదయమైనది. ఇందు వేదాంతి భాస్కరుడు 'సిద్ధాంతశిరోమణి' రచయితయగు జ్యోతిష్య భాస్కరుని పూర్వపురుషుడని ఐతిహాసికుల పరిశ్రమవలన తెలియుచున్నది. ఈయన కన్యాకుబ్జనివాసుడగు రామభద్రుని పుత్రుడగు మిహిరభోజుని (క్రీ. శ. ౮౩౬-౮౯౦) రాజ్యపాలనా ప్రథమకాలమునకు చెందియుండెను. ఆ రాజు ఈయనకు 'విద్యాపతి' యను బిరుదము నొసగెను. ఈయన తండ్రిపేరు త్రివిక్రముడు. భట్టభాస్కరుడను ప్రసిద్ధనామమున ఈయన పండితసమాజమున ప్రసిద్ధికెక్కియున్నాడు. ఇంత కెక్కుడుగ ఈయన జీవితము తెలియవచ్చుటలేదు. ఈయన రచించిన గ్రంథములుకూడ సూత్రభాష్య మొక్కటియే లభించుచున్నది. ఛాందోగ్యభాష్యము, తదితర వేదాంతగ్రంథములు అలభ్యములు. శ్రీ పి. యన్. శ్రీనివాసాచారిగారు ఆంగ్లమున ఈదర్శనమును గురించి వ్రాసిన గ్రంథ మొకటి లభించుచున్నది.

పెక్కుతావుల భాస్కరభాష్యమున పఠింపబడిన సూత్రపాఠములను పరిశీలింప శాంకర శ్రీభాష్యపాఠములతో భేదించుచుండుట కనుగొనగలము. సంప్రదాయభేదము ననుసరించి పాఠభేదము పొసగుట వింతకాదు. భాస్కరుని సిద్ధాంతములును, కాలమును గూడ శంకరరామానుజులకు మధ్యస్థమైయుండుట గమనింపదగిన విశేషము.

ఈయన మతమున పరమానంద ప్రాప్తియే పరమపురుషార్థము. బ్రహ్మజ్ఞానముననే పురుషార్థోపలబ్ధి. ఉపాసనవలన బ్రహ్మజ్ఞానము లభించును. బ్రహ్మసాక్షాత్కారమున జీవునకును, బ్రహ్మమునకును గల భేదము అంతరించును. ఇదియే ముక్తావస్థ. సంసారావస్థయందు ఈ యిరువురును భిన్నులు.

అధికారి:-

ధర్మజ్ఞానానంతరము బ్రహ్మవిచారమున కధికారము లభించును. కర్మవిచారము పరిసమాప్తి యైనంతోడనే బ్రహ్మజిజ్ఞాస ఆరబ్ధమగుచున్నది. ధర్మ - బ్రహ్మమీమాంసలు రెండును గలసి ఒక శాస్త్రము. జ్ఞానకర్మసముచ్చయము సూత్రకారుని అభిమతము.[1] కర్మఫలము క్షణికమే యైనను, జ్ఞానయుక్తమైన అక్షయ మగుచున్నది.[2] కర్మవలన జ్ఞానమును, జ్ఞానమున ముక్తియును లభించుచున్నవి.

విషయము:-

బ్రహ్మమే విచార్యవిషయమును, పరమపురుషార్థమును అగుచున్నది. ఇయ్యది ఉపాసనవలన బ్రహ్మముతో నభిన్నబోధ కలిగిన సమకూరును. జీవుడును, బ్రహ్మమును భిన్నులును, అభిన్నులును గూడ. ముక్తస్థితియందు సంసారవికారము లన్నియును తొలగిపోవ జీవబ్రహ్మముల కభేదము కలుగును. ఇదియే అభిన్నత. కార్యరూపమున నానాత్వబోధ, కారణరూపమున అభేదము. ఇట్టి భేదాభేదవిషయమునే భాస్కరమత ముపదేశించుచున్నది. ఇయ్యది ఆప్యము. కర్మసహితమగు జ్ఞానమువలన శరీరాదులయందుండు ఆత్మబుద్ధి తొలగిపోవును; శరీరపాతానంతరము సర్వజ్ఞత్వ, సర్వశక్తిసంయుతత్వ

1 అతోహి జ్ఞానకర్మసముచ్చయాత్ మోక్షప్రాప్తిః సూత్రకారస్యాభిప్రేతా. —భాస్కరభాష్యమ్.

2. స్వతః క్షణికస్యాపి కర్మణో జ్ఞానరసవిద్ధస్యాక్షయఫలత్వాన్న క్షీయతే [illegible]. —భా. భా.

ములతో గూడి నిరతిశయసుఖసంవేదనతో నొప్పు ముక్తి లభించును. నిర్విషయముక్తి అంగీకార్యము కాదు. అంతేకంటె ఇతరులు చెప్పురీతిగ 'సృగాలత్వం వనే వరం'. ఇత్యాది పురుషార్థము కాదు. ముక్తపురుషుడు సర్వాత్మకు డగును.

సంబంధము:-

ఉపనిషత్తులకును, బ్రహ్మమునకును ప్రతిపాదక ప్రతిపాద్య సంబంధ మున్నది. బ్రహ్మము ప్రతిపాద్యము, శ్రుతి ప్రతిపాదకము. లౌకికదృష్టాంతములు వేదార్థ మునకుపపన్న తగవు. శ్రుతి యొక్కటియే బ్రహ్మవిషయమున ప్రమాణార్హము. తదితరములు అనర్హములు.

ప్రయోజనము:-

సర్వజ్ఞత్వ, సర్వశక్తిమత్త్వములతో గూడిన నిరతిశయమగు ఆనందప్రాప్తియే ప్రయోజనము. అనాత్మవిషయములగు దేహాదుల యందుండు ఆత్మబుద్ధి తొలగిన, శరీరవిమోక్షణానంతర మియ్యది లభించును.

బ్రహ్మము:-

భాస్కరమతమున బ్రహ్మము సగుణము, నిరాకారము. సల్లక్షణబోధ లక్షణాయుక్తము. సత్యజ్ఞానానంతమగు చైతన్యమాత్రము, రూపాంతర రహితము. ఇయ్యది అద్వితీయము. ప్రళయకాలమున సర్వవికారములును బ్రహ్మమున ఉపసంహృతము లగును. నిరాకారమగు బ్రహ్మమునే ఉపాసించునది; దీనిని శుద్ధముగను, కారణరూపముగను చింతింపనగును. కాని, బ్రహ్మమే కార్యరూపమున జీవప్రపంచములుగ పరిణమించుచున్నది. అది యెట్లన : బ్రహ్మమునకు భోగ్యశక్తి, భోక్తృత్వశక్తి అను రెండు శక్తు లున్నవి. భోగ్యశక్తియే అచేతనమగు ఆకాశాదులుగను, భోక్తృశక్తియే చేతనమగు జీవరూపముగను పరిణతినందుచున్నది.[3] బ్రహ్మమున కీశక్తి నైసర్గికము; కల్పి

3. ఈశ్వరస్య ద్వే శక్తీ భవతో భోగ్యశక్తి రేకా భోక్తృశక్తిశ్చాపరా. భోగ్యశక్తిశ్చ సాకాశాదిరూపేణాచేతనపరిణామాపత్తేః, భోక్తృశక్తిః సా చేతనా జీవరూపేణావతిష్ఠతే.

తము కాదు.[1] ఆయన అంతర్యామి రూపమున నియంత. బ్రహ్మము జగద్రూపమున పరిణత మైనను, ప్రపంచాకారముగ ఆకారిత మవదు.

జగత్తు:-

జగత్తు బ్రహ్మాత్మకము. కాని, బ్రహ్మము జగద్రూపమును బొందుచుండుట లేదు. బ్రహ్మమే జగత్తుయొక్క నిమిత్తకారణమును, ఉపాదానకారణమును కూడ. ఈవిషయమును స్థాపించు విశేషసూత్ర మొకటి, ఇతరగ్రంథములలో లేనిది, అధికముగ భాస్కరునిచేత పఠింపబడినది. ఆసూత్రము : 'అస్థూల మన ణ్వ హ్రస్వ మదీర్ఘ మశబ్ద మస్పర్శ మరూప మవ్యయమ్.' ఈ సూత్రవ్యాఖ్యానసందర్భమున 'ఆకాశో వై నామరూపనిర్వహితా' మున్నగు సృష్టిశ్రుతుల తాత్పర్యము అరూపమగు బ్రహ్మమును ప్రతిపాదించుటయందే యని యు, ఈ విషయము ఇట్టి బ్రహ్మమే ధ్యేయ మనియు వక్కాణించి యున్నాడు.

జీవుడు:

జీవుడు బ్రహ్మముయొక్క అంశము. మఱియొకరీతిగ చెప్పవలసిన, బ్రహ్మముయొక్క భోక్తృశక్తియే జీవుడు. సమస్తవికారరహితమును, కారణాత్మకమును అగు బ్రహ్మమును అనుధ్యాన మొనర్చిన, నేనే బ్రహ్మమును అని భావించిన, జీవునకు బ్రహ్మభావము కలుగుచున్నది. దేహాదులయందుండు ఆత్మభావము తొలగిన, శరీరపాతానంతరము జీవుడు బ్రహ్మమున లయమగుచున్నాడు.

ముక్తి:-

ఉపాసనాఫలమే ముక్తి. ఇయ్యది 'అహం బ్రహ్మాస్మి'.అను భావముతో కారణాత్మక మగు నిర్వికారబ్రహ్మమును ఉపాసింప

---

1. అంతర్యామి పరమాత్మా నియంతృరూపా శక్తిః పారమార్థికీ, న హి సా [illegible] ... — భా. భా.

లభించుచున్నది. అప్పుడు బ్రహ్మలక్షణములగు సర్వజ్ఞత్వాదికములు కలుగును. జీవన్ముక్తి అసంభవము. జ్ఞానికిగూడ ఉత్క్రమణమున్నది. జ్ఞానకర్మల సముచ్చయము మవలంబనీయము. జ్ఞానము ఆపేక్షికము; అఖండము కాదు. భేదజ్ఞానము కూడ జ్ఞానమే. అజ్ఞానము కాదు. అహంగ్రహోపాసన అంగీకార్యము. శూద్రులకు బ్రహ్మవిద్యాధికారము లేదు.

సమాప్తి :-

కర్మలను జ్ఞానకారణముగ అంగీకరించుటలో శ్రీకంఠ రామానుజ భాస్కరుల కైక్యమున్నది. శాంకరదర్శన మీవిషయమును అంగీకరింపదు. భాస్కరుని భేదాభేదవాదమును, నింబార్కుని ద్వైతాద్వైతమును ఒకే తరగతికి జెందినవి. ఈవిషయమున భర్తృప్రపంచ, యాదవప్రకాశుల నామములుగూడ స్మృతికి దగులును. కాని, నింబార్కుని బ్రహ్మము సగుణము, సవిశేషము; భాస్కరుని బ్రహ్మము నిర్గుణము, సవిశేషము. ఇట్టి నిర్గుణ సవిశేషశబ్దములను ఆధునికులగు బ్రహ్మసమాజమతస్థులుగూడ వ్యవహరించుచున్నారు. నిరాకారమగు బ్రహ్మమున శక్తి నంగీకరించు భాస్కరుని వాక్యముల కద్వైతులు ఆశ్చర్యము నందగలరు. ముక్తినిగురించి భాస్కర శ్రీకంఠులు లొకేరీతిగ జెప్పుచున్నారు. కొన్ని శాక్తతంత్రములు గూడ భేదాభేదమును సమర్థించుచున్నవి. శ్రీరామానుజుడు విష్ణుపరముగను, శ్రీకంఠుడు శివపరముగను సూత్రభాష్యము నొనర్చియున్నారు. కాని, భాస్కరుడు శంకరునివలెనే బ్రహ్మపరముగ వ్యాఖ్యాన మొనర్చెను.

మొదటనుండి తుదివఱకు శాంకరభాష్యమును ఖండించుటయందే భాస్కరుడు విశేషముగ ప్రయత్నించియున్నాడు. శాంకరమును ప్రచ్ఛన్నబౌద్ధమని భాస్కరుడే మొదట వాకొనినాడు. భాస్కరుడు త్రిదండిసన్న్యాసమును, తదనుకూలమగు పాంచరాత్రమతమును సమర్థించియున్నాడు.

తదితరవిషయము లెట్లున్నను, భేదాభేదవాదము అద్వైతపరములగు వ్యాఖ్యలకును, ద్వైతపరములగు వ్యాఖ్యలకును సఖ్యమును గూర్చునదైయున్నది. కనుక, ఈ భావపరిపోషకములగు దర్శనములను ఆధునికులగు పాశ్చాత్యవిద్వాంసులుగూడ నిర్మించియున్నారు. సమన్వయమును సమకూర్చునదియగుటచే పలువుర దృష్టి నియ్యది ఆకర్షింపగలుగుచున్నది.

# వేదాంత దర్శనము : సమన్వయ వాదము - ౮

## (విజ్ఞానభిక్షుమతము)

మహదాఖ్యః స్వయంభూర్యో జగదంకుర ఈశ్వరః,
సర్వాత్మనే నమస్తస్మై విష్ణవే సర్వజిష్ణవే. —సాంఖ్యసారము.

ప్రవేశిక :-

ప్రసిద్ధులగు సాంఖ్యమతాచార్యులలో విజ్ఞానభిక్షు వొకడు. ఈయనగూడ బ్రహ్మసూత్రములకు నొక భాష్యమును విరచించెను. దానిపేరు 'విజ్ఞానామృతభాష్యము.' ఇందు సాంఖ్యవేదాంతముల సమన్వయ మొనర్చుటకాయన విశేషముగా ప్రయత్నించెను. ఫలిత ముగా విచిత్రమగు నూతన మతవాద మొకటి నిలబడెను. 'భిక్షు' వను విశేషణ ముండుటవలన ఈయన బౌద్ధభిక్షువేమో యనిపించును. కాని వాస్తవమున కీయన సాంఖ్యమతావలంబి. విశేష మేమనగా, ఈయన సాంఖ్యు లంగీకరింపని ఈశ్వరుని గూడ గ్రహించినాడు. సామాన్యముగా సాంఖ్య దర్శనము నిరీశ్వరమత మనియే ప్రథ. కాని ఈయన అభిప్రాయము : "బ్రహ్మమీమాంస (వేదాంతదర్శనము), యోగదర్శనముల ముఖ్యోద్దేశ్యము ఈశ్వర ప్రతిపాదన. సాంఖ్యదర్శ నోద్దేశ్యము ప్రకృతి-పురుష వివేకము. కనుక, సాంఖ్యులనిరీశ్వర వాదము వ్యావహారికము యోగవేదాంతముల ఈశ్వరవాదము పారమార్థికము". (చూ: సాంఖ్య ప్రవచన భాష్యము).

మఱియు, ఈయన సాంఖ్యసార, యోగసార, ప్రవచనభాష్య ములయం దీశ్వరనమస్కృతి నొనర్చి, తన ఈశ్వరవిశ్వాసమును ప్రక టించియున్నాడు.

ఈ పండితవర్యుని జీవితవిశేషము లన్నియును కాలగర్భమున విలీనములు. క్రీ. శ. ౧౬-వ శతాబ్ద శేషభాగ మీయనజన్మకాలమని ఊహింపవచ్చును.

గ్రంథవివరణ :-

'విజ్ఞానామృతభాష్యము'ను ఈయన గురుదక్షిణగా విరచించెను. 'శ్రుతిస్మృతిన్యాయవచఃక్షీరాబ్ధిమథనమున ఈ జ్ఞానామృతము' ఉద్భూతమైనది. ఇదియే ఈయన రచించిన గ్రంథములలో లభించు ప్రథమగ్రంథము. ఈ గ్రంథమున సాంఖ్యప్రవచనభాష్యము పేర్కొనబడినది.

'ఉపదేశరత్నమాల' యను గ్రంథమును ఈయన సూత్రభాష్యమున పేర్కొనియున్నాడు.* కాని ప్రస్తుత మది అలభ్యము. ఇట్లే, ఈయన రచించిన 'గీతాభాష్యము' లభించుట లేదు. 'ఉపనిషద్భాష్యము వ్రాతప్రతి యున్నదికాని, అచ్చుకాలేదు.

'సాంఖ్యప్రవచనభాష్యము' అను గ్రంథమువలననే విజ్ఞానభిక్షువు పండితసమాజమున ప్రసిద్ధికెక్కియున్నాడు. ఈ గ్రంథము నీయన విజ్ఞానామృతరచనానంతరము విరచించెను.[1] కపిలుని సాంఖ్యసూత్రములకు పూర్వము అనిరుద్ధభట్టు (క్రీ. శ. ౧౫౦౦?) రచించిన వృత్తి యుండెను కాని, అది సంక్షిప్తము. విజ్ఞానభిక్షుని భాష్యమే సూత్రహృదయమును చక్కగా వివరించుచున్నది.

'సాంఖ్యసారము' అను ప్రకరణగ్రంథమునుగూడ విజ్ఞానభిక్షువు విరచించెను. ఇందు మొత్తము తొమ్మిది ప్రకరణములు ఉన్నవి. అందు మొదటిమూడును గద్యమునను, తక్కినవి శ్లోకములతోడను సమకూర్చబడినవి. ఈగ్రంథము ప్రవచనభాష్యానంతరకృతి.[2]

---

* "అధికం తూపదేశరత్నమాలాఖ్యప్రకరణే ద్రష్టవ్యమ్"

— విజ్ఞానామృతభాష్యమ్.

౧ "అధికం తు బ్రహ్మమీమాంసాభాష్యే ప్రపంచితమస్మాభిరితి"

— సాం. ప్ర. భా. భూమిక.

2. "సాంఖ్యభాష్యప్రయత్నాద్యైః
స్వరూపం విస్తరాన్మయా,
ప్రోక్తం తస్మాత్తదప్యత్ర
సంక్షేపాదేవ కథ్యతే."

— సాంఖ్యసారము.

'యోగవార్తికము' అను గ్రంథము పతంజలి యోగసూత్రము లకు వ్యాసుడు వ్రాసిన భాష్యమునకు టీక. ఇదికూడ సాంఖ్యప్రవచన భాష్యమువలెనే కడుంగడు ప్రసిద్ధము.

'యోగసారము' అను గ్రంథము యోగశాస్త్ర ప్రకరణ గ్రంథము. ఈసంక్షిప్తగ్రంథమున యోగమతము వివరింపబడినది.

ఈగ్రంథము లన్నియు ప్రస్తుతవ్యాసప్రయోజనమునకు బహి ర్భూతములు. కేవలము 'విజ్ఞానామృతభాష్యము' నాధారపరచు కొనియే ఏతదాచార్యుని వేదాంతనిరుక్తిని వివరింతును.

బ్రహ్మము, లేక ఆత్మ :-

ఆత్మ కేవలము; ఈశ్వరపదవాచ్యము. సృష్టికిపూర్వము అది యొక్కటియే యుండెను. మాయ ఈశ్వరుని శక్తి. ఈశక్తిబలముననే ఈశ్వరుడు సర్వేశ్వరుడు. ఈయన క్లేశకర్మవిపాకాదులవలన అసంస్పృ ష్టుడు. సశక్తికుడైనను నిర్గుణుడు అంతస్థప్రకృతిపురుష సాహాయ్యమున నీయన మహదాదులను సృష్టించుచున్నాడు. ఊర్ణనాభితంతువిసృతిని బోలునది ఈసృష్టి. సేవ, అపరాధముల ఫలములను రాజొసగునట్లు ఈయన కర్మఫలముల నొసగుచున్నాడు. ప్రళయసమయమున జీవ జగత్తులను తనలోనికి ఉపసంహరించుకొని అద్వితీయు డగును. సము ద్రమున తరంగబుద్బుదములు లీన మగునట్లు జగత్తు ఈయనలో లీన మగుచున్నది. అప్పు డన్నియును ఇంద్రజాలసమములై, వాచారంభణ మాత్రములే యగును.

జీవుడు :

జీవు లందఱును సూర్యకిరణములవలె బ్రహ్మముయొక్క అంశ ములు ప్రకృతి, తద్గతగుణములు, జీవులు, తత్సత్త, తత్స్ఫూర్తి ఈశ్వరాధీనములు. ప్రకృతి, గుణములు, జీవులును స్వప్నవిషయముల వలె దృశ్యములు. వీనికి స్వతఃసిద్ధత్వము లేదు - పారమార్థిక సత్తా విహీనములు జీవుని చైతన్యాంశము బ్రహ్మముతో సమానము. ఈశ్వ రుడే పంచవింశతితత్త్వముల ఆత్మ జీవుని జీవాంశము—చేతనాంశము

విడువ మిగులునది - జడమగు అనాత్మ. నిఖిల వేదాంతవాక్య ప్రతిపాద్యమగు ఈ సత్ బ్రహ్మమును 'సమమాత్మేతి', 'సోహమితి' అని జీవుడు గ్రహించును. దేహమాత్రాదులనుండి వేరగు ఆత్మ నిట్లు గ్రహించి, అవిద్యాకామకర్మాదులు క్షయముకాగా దుఃఖము లన్నిటినుండి ఆత్యంతికముగనే విడివడును. జీవబ్రహ్మములు అంశాంశీభావము అగ్ని - స్ఫులింగములవలె. జీవునకును, ఆకాశాదులకును విభుత్వము, అనగా వ్యాపకత్వము లేదు. పితాపుత్రన్యాయముగా జీవబ్రహ్మముల అవిభాగము గ్రహణీయము.

మోక్షధర్మములలో వ్యాసదేవుడు పురుషబహుత్వమును అంగీకరించియు, బహుపురుషుల జన్మకు ఒకేపురుషుడు కారణమైనట్లు విశ్వయోనియగు పురుషునొక్కనే పితాపుత్రన్యాయమున సూచించియున్నాడు. 'మాయాంతు ప్రకృతిం' (శ్వే. ఉప), 'యథా సుదీప్తాత్ పావకాత్' (ముం. ఉప) 'వాలాగ్రశతభాగస్య' (కఠ. ఉప) అను శ్రుతులను ఈ అంశాంశీభావమునే దృఢపరచుచున్నవి. ఈ అంశాంశీభావము భేదప్రతిపాదనా ఫలకము. ఉత్సర్గబలమున అంశిఅంశముల ఏకరూపత, జీవుని అసంసారిత్వ, విభుత్వ, సర్వాధారత్వములు నిషిద్ధములు. భేదాభేదము అవిభాగపరము.

భేదాభేదము:-

కేవలము తత్త్వమస్యాది వాక్యప్రోక్తమగు అభేదజ్ఞానమువలననే ముక్తి చేకూరదు. భేదజ్ఞానముకూడ అవసరము. 'పృథగాత్మానం' (క. ఉప) అను శ్రుతి భేదజ్ఞానఫలమునుగూడ ముక్తియనుచున్నది. భేదజ్ఞానమనగా ఈశ్వరుని నుండి వేరుగా గ్రహించుట. అందువలన ఈ భేదజ్ఞానము అవిద్యానివర్తకమై మోక్షహేతు వగుచున్నది. 'సత్యేన లభ్యస్తపసా' (ముం. ఉప) 'తతో మాం తత్త్వతో జ్ఞాత్వా' అను శ్రుతిస్మృతు లీ విషయమున ప్రమాణములు. మఱియు,

"ప్రధానపురుషవ్యక్తకాలానాం పరమం హి యత్,
పశ్యంతి సూరయః శుద్ధం తద్విష్ణోః పరమం పదమ్"

అను శ్లోకము కూడ గమనింపనగును.

అభేదవాక్యములు సాక్షాత్ అవిద్యానివర్తకములు, కావు, కాని, ఈ వాక్యములను బ్రహ్మాత్మైక్యతాబోధక వాక్యశేషములుగా పరిగ్రహింపనగును. అభేదజ్ఞానము 'అహం దుఃఖీ' ఇత్యాదిలక్షణమగు అవిద్యను తొలగింపజాలకున్నది. ఒకే ఆకాశమున శబ్దము తదభావ ముల ఉనికి అసంభవమైనట్లు, ఒకే ఆత్మయందు భావాభావము లసంభవములు. కనుక, భేదవాక్యములు వివేకపరములు, అభేదవాక్య ములు అవిభాగ (ఏకత్వ) నిర్దేశకములు. ప్రతిబింబ, అవచ్ఛేదక వాక్య బలమున ముక్తి సంభవము కాదు. వివేకజ్ఞానమే ముక్తి. ఐక్యజ్ఞానము కాదు.

జగత్తు:-

బ్రహ్మము జగత్తుయొక్క అధిష్ఠానకారణము. ప్రకృతి బ్రహ్మ మునుండి అవిభక్తము. బ్రహ్మము స్వావిభక్తములగు ప్రకృత్యాదుల సాక్షిస్వరూపముగ ఉపష్టంభకము. కనుక, బ్రహ్మము జగత్కారణ మైనను నిర్వికారము. ప్రకృతిపురుషాదులు సృష్టికి పూర్వము లేకుం డుటవలన సాక్షిత్వము వానియందు ప్రసజ్యము కాదు.[3] అధిష్ఠాన కారణ మనగా: ఏదానియందు అవిభక్తముగా వెలయుచు, దేని బల మున ఉపష్టంభమై ఉపాదానకారణము కార్యాకారముగ పరిణత మగు చున్నదో అది. సృష్టికి పూర్వము పృథివీతన్మాత్ర జలమున అవిభక్త ముగా నుండి, తద్ద్వారా ఉపష్టబ్ధమై, పృథివిగా పరిణామము నందు చున్నది.[4] ఇట్లు, చిన్మాత్రబ్రహ్మమున, జగత్తుయొక్క ఉపాదానత్వ- అభేదత్వములు ఉపపన్నము లగుచున్నవి.[5]

3. "బ్రహ్మణశ్చ స్వావిభక్తప్రకృత్యాద్యుపష్టంభకత్వం సాక్షితామాత్రేణేతి జగత్కారణత్వేఽపి న బ్రహ్మణో వికారిత్వం, నహి ప్రకృతిపురుషాదిష్వతి ప్రసంగః"

4. "తదేవాధిష్ఠానకారణం కార్యాకారేణ పరిణమతే, యథా సృష్ట్యాదౌ జలాఽవిభక్తాః పార్థివసూక్ష్మాంశాః తన్మాత్రాఖ్యాః జలేనైవోపష్టంభాత్ పృథివ్యాకారేణ పరిణమంతి ఇత్యతో జలం మహాపృథివ్యా అధిష్ఠానకారణమితి"

5. "అత ఏవావికారి చిన్మాత్రత్వేఽపి బ్రహ్మణో జగదుపాదానత్వం జగదభేదశ్చోపపద్యతే," — విజ్ఞానామృతభాష్యము.

బ్రహ్మము జగత్తుయొక్క సమవాయి, అసమవాయి, లేక నిమిత్తకారణములలో ఏ ఒక కారణమును కాదు. వీటికంటె వేరగు అసమవాయి కారణము. ఇట్లే వైశేషికులుగూడ అధిష్ఠానకారణము యొక్క నిమిత్తకారణత్వమును గ్రహించుచున్నారు. తదితర వ్యాఖ్యాత లభివర్ణించిన కారణత్వముకంటె కారణమగు తన కారణవ్యాఖ్యను గూర్చి విజ్ఞానభిక్షువే ఇట్లు వచించియున్నాడు :

"సంభవత్యవిరోధే సృష్టిప్రక్రియాయాం వైశేషికసాంఖ్యయో రుభయో ర్వ్యక్త్రో విరోధాభావాదితి. వైశేషికాదిభిః స్మృతం బ్రహ్మణః కారణత్వ మిష్యత ఏవ. తచ్చ తు తైరేవనుపి నిమిత్తకారణతేతి పరిభాష్యతే అస్మాభిస్తు సమవాయ్యసమవాయిభ్యాముదాసీనం నిమిత్తకారణేభ్యశ్చ విలక్షణతయా చతుర్థమాధారకారణత్వమితి"

ఈశ్వరుడు :-

విద్యారణ్యుడు 'పురుషస్సత్త్వప్రధానుడ' ని చెప్పిన ఈశ్వరునితో "క్లేశకర్మవిపాకాశయైః అపరామృష్టః" అను పతంజలి ఈశ్వరుని కలిపి, పైన 'సత్త్వ' విశేషణమును వైచి విజ్ఞానభిక్షువు తన ఈశ్వరుని సృష్టించుకొనినాడు. ఈయన అచింత్యరచనాత్మకుడు. ఈ రచన యన్ననో షడ్విధ భావవికారములతో గూడుకొనినది. ఇయ్యది ఆయనయం దంతర్లీనమైన ప్రకృతి-పురుషులవలన కలుగుచున్నది. [6]

సాధన :

ఈయన జ్ఞానకర్మ సముచ్చయవాది. కర్మవిశిష్టమగు జ్ఞాన మోక్షసాధనత్వమును అంగీకరించినాడు. శ్రుతి "ఆత్మక్రీడః ఆత్మరతిః క్రియావానేష బ్రహ్మవిదాం వరిష్ఠః" అని ఆత్మారాముడగు విద్వాం

6. "అస్య జగతో నామరూపాభ్యాం వ్యాకృతస్యచేతనాచేతనరూపస్య ప్రతినియతదేశకాల సంస్థాన వ్యాపారానుపతో చింత్యరచనాత్మకస్య జాయతేఽస్తి వర్ధతే విపరిణమతేఽపక్షీయతే వినశ్యతీత్యేవం రూపం జన్మాదిషట్కం యతః పరమేశ్వరాదంతర్లీనప్రకృతిపురుషాదఖిలశక్తిమతః సర్వజ్ఞాత్సత్త్వోద్రిక్తాఖ్యాదుపాధికాత్ క్లేశకర్మ విపాకాశయైరపరామృష్టాచ్చేతనవిశేషాద్ భవతి ఇతి"

—విజ్ఞానామృతభాష్యము.

సుసరిమోక్ష ప్రక్రియనుగూడ దర్శించుచున్నది. మఱియు, "అంధంతమః ప్రవిశంతి" (ఈ. ఉప.) "విద్యాంచా విద్యాంచ" (ఈ. ఉప.) అను శ్రుతులును,

"జ్ఞానినాజ్ఞానినా వాపి యావద్దేహస్య ధారణమ్,
తావద్వర్ణాశ్రమప్రోక్తం కర్తవ్యం కర్మ ముక్తయే॥"
"జ్ఞానేనైవ సహితాని నిత్యకర్మాణి కుర్వతః,
నిత్యప్రాప్తఫలప్రాప్తస్య ముక్తిః స్యాత్ కరే స్థితా॥"

అనుస్మృతులును మోక్షసాధనముగా సముచ్చయమును ఉపదేశించుచున్నవి.

ముక్తి:-

ఈశ్వరునితో నేకీభావము పొందుట ముక్తి కాదు. ముక్తపురుషులకు ఈశ్వరునితో సమమగు ముక్తి లభింపదు. మహాపురుషులు ఈశ్వర సమానభోగమును పొందుదురు ఈశ్వరసాయుజ్య మనగా, సమానభోగము. "సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితేతి", "సయథైతాం దేవతాం సర్వాణి భూతా న్యవంతి ఏవం హైనం సర్వాణి భూతా న్యవంతి తేన ఏతస్యై దేవతాయై సాయుజ్యం సలోకతాం జయతీతి" అను శ్రుతులీ విషయమునే తెలుపుచున్నవి. కనుక, సృష్ట్యధికారము కేవల మీశ్వరున కొక్కనికే యున్నదని గ్రహింపవలెను. సాయుజ్య మనగా, ఉపాస్యమున ప్రవేశించి దానితో ఏకీభావరూపమగు భోగము ననుభవించుట. కార్యబ్రహ్మమును బొందువారి అపునరావృత్తి ఔత్సర్గికము; కారణబ్రహ్మమును బొందువారి అపునరావృత్తి నియతము. జీవన్ముక్తి సంభవము.

అనుశీలన:-

సాంఖ్యవేదాంతసిద్ధాంతములను కలిపి, విచిత్రమగు ఈసిద్ధాంతములను విజ్ఞానభిక్షువు ప్రతిపాదించినాడు. విజ్ఞానభిక్షువు వేదాంతుల 'అధిష్ఠానము'ను గైకొని దానియందు సాంఖ్యుల ప్రకృతి అవిభక్తముగ నుండునని చెప్పియున్నాడు. సాంఖ్యుల ప్రకృతి ఆత్మనుండి

వేరు. విజ్ఞానభిక్షునిప్రకృతి బ్రహ్మముయొక్క శక్తి. సాంఖ్యుల సాక్షిత్వమే ఉపష్టంభకమైనది. ఇట్లు. ఈతడు జగత్తుయొక్క సత్యత్వము, బ్రహ్మముయొక్క నిర్గుణత్వమును ప్రతిపాదింపచూపిన కారణములు విచిత్రములు.

పతంజలి ఈశ్వరుడు ఉదాసీనుడు. ఆయనకు జీవులతో నేమియు సంబంధము లేదు. వేదాంతుల ఈశ్వరుడు అంతర్యామి. ఈ వేదాంతుల ఈశ్వరునకు విజ్ఞానభిక్షువు సాంఖ్యుల వేషమును అలంకరించినాడు. మఱియు, ఈయన జీవేశ్వరుల సంబంధమును నిర్ణయించిన రీతిని జూచిన, నింబార్క-భాస్కరుల భేదాభేదసిద్ధాంతము గుర్తుకు రాగలదు. ఇది వేదాంతావరణమున సాంఖ్యమన్న దోషము లేదు.

వాచస్పతి ఎట్లున్నను. ఈయనయొక్క సమన్వయపరిచేష్ట ప్రశంసనీయము.

# వేదాంతదర్శనము : శివాద్వైతవాదము -

## (శ్రీకంఠశివాచార్యమతము)

ఓం నమో౽హం పదార్థాయ లోకానాం సిద్ధిహేతవే,
సచ్చిదానందరూపాయ శివాయ పరమాత్మనే.

ప్రవేశిక :

శివాద్వైతపరమగు సూత్రభాష్యమునకు కర్త శ్రీకంఠాచార్యులు. ఈ భాష్యకారుని జీవితవిషయము లేమియును దెలియవచ్చుట లేదు. కేవలము శ్రీశంకరరామానుజుల మధ్యకాలములోనివా డనియు, దాక్షిణాత్యు డనియు, దహరవిద్యోపాసకు డనియు పండితు లూహించుచున్నారు. ఈయన మృగేంద్రసంహిత యను శైవాగమమునకుగూడ వృత్తి నొకదానిని రచించినట్లు వినికిడి. కాని, గ్రంథము ఇంతవరకు ముద్రితమైనట్లు తోచదు.

శ్రీకంఠభాష్యమునకు శివార్కమణిదీపిక యను టీకను అప్పయ్యదీక్షితులవారు సమకూర్చిరి. ఈ టీకయును, తద్విరచితములగు శివాద్వైతనిర్ణయము, నయమణిమాల అను గ్రంథములుకూడ శివాద్వైతమనబడు ఈ శివవిశిష్టాద్వైతవాదమును గ్రహించుటకు తోడ్పడగలవు.

శ్రీకంఠభాష్యమునకు నిజగుణశివయోగి విరచితమగు 'తారావళి', హరదత్త శివాచార్యుల 'శ్రీకంఠభాష్య - సమర్థనము', బ్రహ్మవిద్యాధ్వరీంద్రుని 'వేదాంతసర్వస్వ-శివదర్పణము' అను టీక లున్నట్లు పండితులు చెప్పుచున్నారు. కాని, ఇవన్నియును ప్రస్తుతము అలభ్యములు.

"పూర్వాచార్యులవలన కలుషితమైన వ్యాససూత్రములను ప్రసాదిత మొనర్తు" నని ప్రతిజ్ఞ నొనర్చి 'మధుర మగు భాష'లో 'మహార్థములను' 'నాతివిస్తరముగ' శ్రీకంఠాచార్యులు ప్రపంచించినారు. సంగ్రహముగ ఏతన్మతవాదమును దెల్పుటయే ప్రస్తుతవ్యాసోద్దేశ్యము.

భోగమును విధించుచున్నాడు. జ్ఞానశక్తివలన ఆనందము ననుభవించుచు, చిచ్ఛక్తివలన జగత్తుగ బ్రహ్మము పరిణామించుచున్నది. ఈ ఆనందమును బ్రహ్మము శరీరకరణములు లేకున్నను మనస్సువలన భోగించుచున్నది. [3] బ్రహ్మము అనంతశక్తిమత్త్వమువలన ప్రపంచ-సమవాయికారణత్వము సిద్ధించుచున్నది.

ఈ బ్రహ్మము సర్వదా సర్వత్ర యుండుటవలన 'భవు' డనియు, సర్వసంహారక మగుటవలన 'శర్వు' డనియు, నిరుపాధిక-పరమైశ్వర్యసంపన్న మగుటవలన 'ఈశాను' డనియు, పశుపాశముల పతి యగుటవలన 'పశుపతి' యనియు, చిదచిన్నిష్ఠదుఃఖాత్మకమును, సంసారశోకమును నిర్మూలించి మోక్షమొసంగునదియు నగుటవలన 'రుద్రు' డనియు, సర్వప్రకాశకమును, నిరస్తతేజమును అగుటవలన 'ఉగ్రు' డనియు, సర్వనియామక మగుటవలన 'భీము' డనియు చెప్పబడుచున్నది.

ఈ బ్రహ్మము అంతఃకరణస్వరూపమగు సూక్ష్మశరీరముతో, ఆత్మకంటె భిన్నమై, సక్రియమై, జ్ఞేయమై, జన్మాదివ్యాపారలక్షితమై, 'ఇతివ్యావృత్తిపూర్వకముగ' ప్రపంచమునకు మూలమై యొప్పుచున్నది.

౨త్ర, జీవ [illegible] :-

అనాద్యజ్ఞానవాసనాబద్ధుడై, [4] కర్మఫలభోగార్థము కాయప్రవేశ మొనర్చుచు సంగమించుచు వివిధతాపముల ననుభవించువాడే జీవుడు. కాని, ఈ జీవుడు విభుడు. నానాత్వశోభితుడు. జీవునకు కర్తృత్వభోక్తృత్వములు వాస్తవముగనే యున్నవి; మాయాకల్పితములు కావు. ఈ జీవుడు పాశపటలము విచ్ఛిన్నమైన, బ్రహ్మసమానైశ్వర్యమును బొంది ఆనందించును.

---

3. “బ్రహ్మణః మనసైవ భోగానుభవో న బాహ్యకరణద్వారా”

— శ్రీకంఠభాష్యమ్.

4. “అనాద్యజ్ఞానవాసనావిద్ధో [illegible] - విచిత్రకర్మఫలభోగానుగుణబహుశరీర ప్రవేశనిర్గమవ్యాపార [illegible] సమ్మగ్నో జీవాత్మా”

— శ్రీకంఠభాష్యమ్.

## సభ్యులు

శ్రీ కోటంరాజు కృష్ణారావుగారు, తెనాలి.
,, పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, చావలి.
,, యాబలూరి ఆదినారాయణశర్మగారు, తెనాలి.
,, ఖండ్రిక సాంబయ్యగారు, తెనాలి.
,, విష్ణుభొట్ల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, తెనాలి.
,, వెంపటి సూర్యనారాయణగారు, ,,
,, ముక్కామల వెంకటాచలపతిరావుగారు, తెనాలి.
,, పసిపాటి పిచ్చయ్యగారు, ఇంకొలు.
,, ఊపర సూరయ్యగారు, అయితానగరం.
,, ఇసుకపల్లి వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, గార్లపాడు.
,, కోగంటి తిరుపతయ్యగారు, తెనాలి.
,, గాదెపల్లి వెంకటసుబ్బారావుగారు, తెనాలి.
,, మట్టిగుంట వీరభద్రరావుగారు, తెనాలి.
,, సిరిపురపు శ్రీరాములుగారు, ,,
,, దేవేపూడి సుబ్రహ్మణ్యముగారు, ,,
,, బలివేపల్లి పశుపతిరావుగారు, ,,
,, అన్నపాసం శివరామమూర్తిగారు, ,,
,, ప్రత్తి సూర్యనారాయణగారు, ,,
,, మాదిరాజు రామదాసుగారు, ,,
,, అన్నంరాజు మాధవరావుగారు, ,,
,, ముదిగొండ మృత్యుంజయుడుగారు, ,,
,, రావులపర్తి సూర్యనారాయణరావుగారు, ,,
,, ధారా సీతారామకృష్ణయ్యగారు, ,,
,, బలిభద్ర సత్యనారాయణమూర్తిగారు, ఫిట్టుపల్లి.
,, గొర్తి సత్యయ్యపంతులుగారు, గంగలకుర్రు (అగ్రహారం)
,, శివపట్ట వెంకట్రావుగారు, మీరానపూర్.
,, యం. వి. వెంకటరమణయ్యగారు, పైసూరు.
,, తాడేపల్లి కేశవశాస్త్రిగారు, తెనాలి.
,, గవిని రామయ్యగారు, జంపని.
,, రామచంద్రుని నరసింహారావుగారు, తెనాలి.
,, నన్నపనేని వెంకట్రామయ్యగారు, కొల్లూరు.

రాబోవునది :— * బదరీయాత్ర * క్షేత్ర మాహాత్మ్య పటములతో

## 1947

## ప్రచురణలు

| | | | |
|---|---|---|---|
| 1 భగవత్ప్రాప్తి - ఉపాయములు | ... | ... | 0- 4-0 |
| 2 నరసదాసు కీర్తనలు | ... | ... | 0-10-0 |
| 3 హరినామ మహిమా శతకము | ... | ... | 0- 4-0 |
| 4 సప్త మహావ్రతములు (మహాత్మా గాంధీ) | ... | ... | 0- 6-0 |
| 5 ఈశ్వరసాక్షాత్కారము - నామజపము | ... | ... | 0- 3-0 |
| 6 శ్రీ సీతారామ శతకము | ... | ... | 0- 2-0 |
| 7, 8 గీతా ప్రతిభ (పద్యగ్రంథము) | ... | ... | 0-12-0 |
| 9, 10, 11 భాగవతకథ 320 పేజీలు (త్రివర్ణ సాదాచిత్రములు) | | | 2- 0-0 |
| 12 శ్రీ త్రిపురాంతకేశ్వర శతకము (ద్విప్రాస) | ... | ... | 0- 4-0 |

ఈ పైసెట్టు (12 వాల్యూములు) రు 4-12-0, రు 5/- లు పంపిన రిజిష్టరు పోష్టులో పంపబడును.

## 1948

## ప్రచురణలు

| | | | |
|---|---|---|---|
| 13 శ్రీ త్యాగరాజ చరిత్ర | .... | .... | 0— 4—0 |
| 14, 15 పరమ సాధన | .... | .... | 0—12—0 |
| 16 శ్రీ కాళహస్తీశ్వర శతకము ([illegible]పీఠిక, పాఠాంతరములు, పద్యానుక్రమణిక) | | | 0— 8—0 |
| 17 to 20 ఆ[illegible]మాహాత్మ్యము ([illegible]నవరాత్ర వ్రతమాహాత్మ్యము) 350 పేజీలు, ఉత్తమగ్రంథము | | | 2— 0—0 |
| 21 to 24 భారతీయతత్త్వశాస్త్రము | | | 2— 0—0 |

ఈ పైసెట్టు (12 వాల్యూములు) రు 5/- లు. రు 5-8-0 పంపిన, రిజిష్టరు పోష్టులో పంపబడును.

### రాబోవునవి:

శబరి, [illegible] (సంకీర్తన నాటకరాజము) అవతారములు, వివేకపల్లవి,
రాధిక, వేదప్రామాణ్యము, సంకీర్తన మీమాంస, మానవ ధర్మము.

1947, 48 ప్రచురణములు స్వల్పముగ కలవు — త్వరపడుడు.

వివరములకు కేటలాగు ఉచితము.

గ్రంథములకు:

సాధన గ్రంథ మండలి, తెనాలి

శ్రీ రామనామ క్షేత్రము, గుంటూరు

## శ్రీ రామకృష్ణ మఠమువారి
## తెలుగు ప్రచురణలు

1. శ్రీమద్భగవద్గీత :— శ్రీ నిర్వికల్పానందస్వామివారు వ్రాసిన ప్రతిపదార్థ టీకాతాత్పర్య శ్రీధరీయ టీకాసారవిశేషాంశసహితము. 500 పుటలు.

2. నాగురుదేవుడు:— శ్రీ నిర్వికల్పానందస్వామివారు, శ్రీ వివేకానందస్వామివారి ఆంగ్లరచనకు చేసిన అనువాదము. 3-వ కూర్పు.

3. శ్రీశారదాప్రసంగములు:— రిక్రూర్ట్ గవర్నమెంటు అనువాదకులు. శ్రీ వెసురుమూడి కృష్ణారావుగారి అనువాదము.

4. ముక్తిమార్గము :— శ్రీ జి. సత్యనారాయణగారు శ్రీరామకృష్ణానందస్వామివారి రచనకు చేసిన అనువాదం.

5. భక్తిమార్గము :— పైవారు. శ్రీ పరమానందస్వామివారి రచనకు అనువాదము.

### ఇతర రచనలు :

(6) శ్రీ వివేకానంద జీవితచరిత్ర, (7) శ్రీ శారదాదేవి, (8) రాజయోగము, (9) కర్మయోగము, (10) భక్తియోగము, (11) శ్రీరామకృష్ణ బోధామృతము, (12) ప్రబోధరత్నాకరము, (13) వివేకానందలేఖావళి, (14) వివేకసూర్యోదయము, (15) నవీన భారతము మున్నగునవి.

## శ్రీ రామకృష్ణ ప్రభ
### (మాసపత్రిక.)

ఇది 1941 జులైలో శ్రీ నిర్వికల్పానందస్వామివారిచే స్థాపింపబడి, 1946 సెప్టెంబరువరకు వారి సంపాదకత్వమున వెలువడినది. 5-వ సంవత్సరము నడచుచున్నది. ఇతరులు సంపాదకులుగనున్నారు. పై పుస్తకములకును, ఇతరములకును, పత్రిక చందా వివరములకును,

మేనేజరు, శ్రీరామకృష్ణ మఠం, చెన్నపురి

అని వ్రాయవలెను.

# శ్రీ యోగవాసిష్ఠము

శ్రీ వ్యాసాశ్రమమువారు ఇదివరలో ప్రకటించుచు వచ్చిన శ్రీయోగవాసిష్ఠము ఇప్పటికి పూర్తియైనది. 5 ప్రకరణములు గల పూర్వార్థము. 1994 పుటలు. రెండు సంపుటములు వెల రు 20-0-0

నిర్వాణప్రకరణము : రెండు భాగములు గల ఉత్తరార్థము. 2248 పుటలు. రెండు సంపుటములలో వెల రు 25-0-0. 3200 శ్లోకములు, 4212 పుటలుగల గ్రంథము. మొత్తము వెల రు 45-0-0.

ఇవన్నియును 25 సంచికలలో సంచిక 1-కి రు 1-8-0 వెల చొప్పున వెలువడియున్నవి.

వలయువారు:— మేనేజరు, శ్రీ వ్యాసాశ్రమము,
ఏర్పేడు P. O. (చిత్తూరు జిల్లా) అని వ్రాయవలెను.

## ప్రపంచ దర్శని

(ఆంధ్ర డైరెక్టరీ అండ్ ఇయర్ బుక్)

పంచాంగమునుండి రాష్ట్ర రాజకీయాలవరకూ ఇందులో వివరాలున్నాయి. సంవత్సరానికి అంతా దగ్గర ఉండదగిన గ్రంథం. సుమారు 500 పుటలు. వెల రు 4—0—0

ప్రకాశకులు:— కప్పగంతుల సత్యనారాయణ, ఎమ్. ఎ.
కథామాల, 1/5 వీరబద్ర స్ట్రీటు, మదరాసు 4.

## విశ్వజ్యోతి

శ్రీ శ్రీ స్వామి శివానంద సరస్వతీ స్వామివారి సంపాదకత్వమున ఏప్రిలునుండి వెలువడుచున్న మాసపత్రిక. సంవత్సర చందా రు 3/- లు.

## మోక్షసాధని !

మీరీ మాసపత్రికను చదువుట కెన్నియో కారణములున్నవి. మహాత్ముల అనుభవములతో ప్రతినెల వెలువడును. నేడే చందాదారులుగ చేరండి. సం॥ చందా రు 2/- మాత్రమే.

శ్రీ రామనామ క్షేత్రము,
[illegible] - గుంటూరు